# విజ్ఞప్తి

భారతదేశ స్వాతంత్ర్యప్రదాత, జాతిపిత, సత్యయుగ స్థాపనాచార్యులేగాక ప్రపంచానికి నూతనసందేశాన్ని అందించారు మహాత్మాగాంధి. ఆయనరచనలు ప్రతిభాషలోనికి అనువదింపబడవలసియున్నది. కాన గాంధీజీరచనలను తెలుగులోనికి అనువదించి ప్రచురించి, ఆంధ్రప్రజానీకమునకందించు సంకల్పముతో గాంధి స్మారకనిధి, ఆంధ్రశాఖవారు ప్రత్యేకముగా ప్రచురణశాఖనెలకొల్పి కృషిచేస్తున్నారు. గాంధీసాహిత్యప్రచురణ సలహాసంఘము 1959 జూన్ మాసములో నెలకొల్పబడినది. తదుపరి సంపాదకవర్గమేర్పరచి, ప్రచురణకార్యక్రమము నిర్వహించుటకు 1959 అక్టోబరు 2 తేదీన గాంధిసాహిత్య ప్రచురణాలయము స్థాపింపబడినది. ఇంతవరకును స్వామిసీతారాంగారి అనువాదము "ఢిల్లీ దినచర్య", మల్లవరపు విశ్వేశ్వరరావుగారి అనువాదము "నామతము", కొండాలి ఆంజనేయులుగారి అనువాదము "మనగ్రామ పునర్నిర్మాణము" ప్రచురితమైనాయి.

నాల్గవది "నూతనవిద్యావిధానము." విద్య చేతిపరిశ్రమపై ఆధారపడియుండవలెను. చిన్నపిల్లవాడు గ్రామములోని అర్థవ్యవస్థకు సహాయపడవలెనను భావముతో నూతనవిద్యావిధానమునుగూర్చి తమ అభిప్రాయములను వేర్వేరుసమయ

ములంను వెలిబుచ్చారు. ఆవ్యాసములు యిందు విషయక్రమ ముననుసరించి పొందుపరుపబడినవి.

ఆంధ్రప్రదేశమందుగల వివిధసంస్థలు, వ్యక్తులు వీని నుపయోగించిననాడే యీ ప్రచురణల లక్ష్యము సిద్ధించగలదు. ఇంటింటా యీరచనలకు స్థానముండవలెనని మాకోరిక. గాంధిసాహిత్యమును ప్రచారములోనికి తీసుకొనివచ్చు బాధ్యత మాతో బాటు యావదాంధ్రులు వహింపవలెనని మా విజ్ఞప్తి.

శ్రీనగర్, ఇట్లు విధేయుడు,
కాకినాడ, మల్లవరపు వెంకటకృష్ణారావు
31. 8. 1960. అధ్యక్షుడు,
గాంధిస్మారకనిధి ఆంధ్రశాఖ,
గాంధిసాహిత్య ప్రచురణశాఖ.

# సంపాదకుని పీఠిక

గాంధిజీ భారతదేశమున నూతన విద్యా ప్రయోగమును ప్రారంభించినది ఇటీవలనేయైనను, ఈ విషయమున ఆయనకు చిరకాలమునుండి తీవ్రమగు నిశ్చితాభిప్రాయము లుండెను. దక్షిణాఫ్రికాలో టాల్‌స్టాయి క్షేత్రమునునెలకొల్పి, చాల యేండ్లకు పూర్వము, ఆయన తన పద్ధతిననుసరించి బిడ్డలకు శిక్షణనిచ్చెను తదుపరి ఇండియాలో తాను, తనఅనుచరులు, బిడ్డలు నివసించిన తావులందెల్ల ఈ నవీన విద్యాపద్ధతినే ఆయన అవలంబించుచువచ్చెను. కనుక 1937 లో ఈదేశమున తానువ్యాపింపజేసిన నవీన విద్యాపద్ధతి ఆయనకు క్రొత్తదికాదు. పూర్తిగా మూడుదశాబ్దములపాటు ఆయనచే బిడ్డలపై ప్రయోగింపబడిన ఈవిధానము మంచి ఫలితముల నిచ్చెను.

ఆంగ్లేయులు ఇండియాలో ప్రవేశపెట్టిన ఆంగ్లపుస్తక విద్య ఆఫీసు గుమస్తాలను తయారుచేయుటకే ఉద్దేశింపబడెను. వస్తూత్పత్తి చేయగల నైపుణ్యమునుగాని, యత్నశీలమునుగాని పెంపొందించుశక్తి దానికిలేకపోయెను. చదివిన వారిని, ప్రజలనుండి దూరముచేసిన చదువది. వారి పాండిత్యము ప్రజల క్షేమాత్రము పనికిరాకుండ పోయెనని గాంధిజీ కనిపెట్టెను. ఆంగ్లేయులు మనపురాతన గ్రామవ్యవస్థను ధ్వంసముచేసి, గ్రామాలను విదేశీసరుకులతో నింపివేయుట వలన, సంఘము ఛిన్నాభిన్నమయ్యెను. వృత్తులు నశించినని.

ప్రజలు నిస్సహాయులైరి. దారిద్ర్యము, నిరుద్యోగము, నిస్పృహ వెన్నంటినవి. చదివినవారు తమ చదువును స్వలాభము కొరకును, బీదలను బాధించుటకును ఉపయోగించు చుండిరి. గ్రామవిద్యద్వారా ప్రజల ఆర్థికస్థితిని బాగుపరచుట యొక్కటే ఈదుస్థితిని తొలగించగలమార్గమని గాంధిజీగుర్తించెను. కనుక గ్రామ వృత్తులద్వారా విద్యగరప బడవలెనని ఆయన చెప్పెను. బిడ్డలను ఉత్పత్తిదారులుగ చేయవలెను. అయితే వారిని కేవలము అర్థసంపాదన పరులుగ చేసిన చాలునను పొరపాటు మాత్రము మహాత్ముడు చేయలేదు. వారు ఉత్తమమానవులుగ తయారుకావలెనను విషయమునకే ఆయన ప్రాధాన్యతనిచ్చెను. బిడ్డల హస్తనైపుణ్యము ఎంత ముఖ్యమో, వారిమనస్సు హృదయమువికాశము నొందుటయు అంతముఖ్యము. పరభాషతో నేర్పబడువిద్యకు జీవితముతో సంబంధముండదు. దానికొకనిర్దిష్టమగు ఆశయముండవలెను. బిడ్డలమాతృభాషలోనే అదిజరుగవలెను. విద్యవస్తుతః విద్యార్థుల సాంఘిక, సాంస్కృతిక వాతావరణముతో సంబంధించి యుండుటయేగాక, అందే అదిపుట్టిపెరుగవలెను.

పూర్తిగ నశించిపోనున్న మనఆర్థిక సాంస్కృతిక జాతీయ జీవనమును ఈ విద్యాసంస్కరణ ద్వారా పునరుద్ధరించుటకు గాంధిజీ పూనుకొన్నారు. చేతిపనుల మూలమున విద్య గరపుటలో మరియొకఉద్దేశ్యము కూడకలదు. నేటియంత్ర

నాగరికత దేశప్రజలకును, పారిశ్రామికముగ వెనుకబడియున్న వారికిని బాధలను, బానిసత్వమును తెచ్చిపెట్టినదని గాంధిజీకి ధృవపడెను. పనిచేయువానికి స్వేచ్ఛలేదు, స్వాతంత్రములేదు. రాష్ట్రాధిపతులకో, ధనపతులకో అతడు పరాధీనుడై యుండవలసినదే. అంతేకాదు. నిరంతర జాతివైరాలకు, ప్రపంచ యుద్ధములకు, వినాశమునకు ఇదే కారణమగుచున్నది. కనుక భారీయంత్రి పరిశ్రమలను వదలి, గ్రామపరిశ్రామలను నెలకొల్పుటయే దేశమునకు శుభంకరమని గాంధిజీకితోచెను. పారిశ్రామికుల శక్తియు, నైపుణ్యమును వృద్ధిచెందుటకును, వారికి శాంతి స్వాతంత్రములు చేకూరుటకును ఇదొక్కటే మార్గమని ఆయనకు స్పష్టమయ్యెను. యంత్రములనుండి తయారగు వస్తుసమృద్ధికంటె, వ్యక్తివికాసము, స్వాతంత్రము ఎక్కువ విలువగలవి యని ఆయనఉద్దేశ్యము. కనుక చేతిపరిశ్రమలును, సేద్యమును వృద్ధిచెంది గ్రామస్తులందరు కలసి గ్రామ క్షేమముకొరకు పాటుపడు శుభదినముకొరకు ఆయన వేచియుండెను. అట్టి భావిసౌభాగ్యదశకు బిడ్డలను తయారుచేయు విద్యాభ్యాసము చేతిపరిశ్రమపై విధిగా ఆధారపడవలెను. ఇట్లు గాంధిజీపర్చరచిన విద్యాపద్ధతికి అహింసయు, అట్టడుగు ప్రజల స్వాతంత్ర్యమును పునాదులు.

ఈ కాలపు మనుష్యులు స్వేచ్ఛ, ప్రజాధిపత్యము, శాంతి యని జోరుగ మాట్లాడుచుందురు. కాని వీనికి అనుగుణ్య

మగు ఆర్థికవ్యవస్థ పునాదియై నిలువనిచో అవి మనకు లభించ వని వారెరుగరు. ఆర్థిక క్షేత్రమున మనము నాటినదానికి తగిన ప్రతిఫలమే తిరిగి లభించుననను సత్యమును గాంధిజీ గుర్తించి నంతగ మరెవ్వరును గుర్తించియుండలేదు. వస్తూత్పత్తియే మన ఆర్థికాశయమగుచో, మనకు తేలు ఫలితము ఆమాత్రమే. అందు స్వేచ్ఛ లేదు, శాంతి లేదు అట్లుగాక మనము కోరునదే స్వేచ్ఛయు శాంతియు అయినచో, అప్పుడు మన ఆర్థిక, రాజ్యాంగ, సాంఘికవ్యవస్థలను, మనవిద్యా విధానమునుకూడ మార్చుకోవలెను. ఇందువలన వస్తుసమృద్ధి ఒకప్పుడు వెనుక బడిపోయినను ఇబ్బంది లేదు. ఈనాడు మానవకోటి యావత్తు వాంఛించుచున్న శాంతి స్వాతంత్ర్యముల సంపాదనయే గాంధిజీ వేసిన విద్యాప్రణాళిక యొక్క ముఖ్యాశయము.

(1) బ్రిటిషువారు ఇండియాలో ప్రవేశపెట్టిన విద్య యొక్క నిరర్థకత్వము (2) గాంధిజీ స్థాపింపనెంచిన అహింసా సంఘువ్యవస్థ——ఈ రెండును ఆయన 'బేసిక్' లేక నవీన విద్యా పద్ధతికి అనుకూల వాతావరణమును కల్పించినవి.

ఈ వాతావరణము నటుండనిచ్చినను, వస్తుతః విద్యా శాస్త్ర, సిద్ధాంతములరీత్యా కూడ గాంధిజీ ప్రణాళిక ప్రశంస నీయమే. ఈ సిద్ధాంత మేమనగా :

(అ) వ్యక్తియొక్క సమస్త శక్తుల వికాసమే నిజమగు విద్య. దానిని బడయు ఉత్తమసాధనము మానవుని క్రియా

శక్తి. జీవశాస్త్రరీత్యా క్రియాశీలమునకు దోహదము చేయుటయే మానసికశక్తుల పనియనెడు మనస్తత్వశాస్త్రజ్ఞుల సిద్ధాంతము సరియైతే, క్రియాశీలమునుండియే జ్ఞానము, బుద్ధి వృద్ధిచెందునన్న నిర్వివాదసిద్ధాంతముపైననే గాంధిజీ విద్యా పద్ధతికూడ సుస్థిరముగ నిలిచియున్నదని చెప్పవలెను. క్రియాత్మకములుకాని వట్టివిషయజ్ఞానము మనసుకు బరువై, దానిని అణచి వేయును. అప్పుడు సహజప్రకృతి అందుకొని, మనసుకు రక్షణ నీయనిచో మానసిక అజీర్ణము పట్టుకొనును.

(ఆ) మరియు ఈ విద్య బిడ్డలోని సహజశక్తుల నన్నిటిని వికసింపజేయవలెనన్నచో, అదియొక వృత్తిపనిమూలము ననే గరపబడవలెను. ఎందువల్లననగా బిడ్డకుసమస్యలను కల్పించి, జిజ్ఞాసనురగిల్చి, తద్వారా వానిశీలమును, కళాభిరుచిని పెంపొందించునది వృత్తిపనియే. కేవలము పుస్తకవిద్య ఇట్లుండక ఎక్కడి కక్కడ పాక్షిక వ్యవహారమగును. చేతి పనితో సంబంధములేని మానసిక శిక్షణ ; మనో వికాసమును కలిగింపని శారీరక పరిశ్రమ ; క్రియాశక్తికిగాని, మనోవికాసమునకుగాని సంబంధించనికళ, మతబోధ—ఇట్లు దేనికదే విడివడియుండును. బిడ్డజీవితము అవిభాజ్యమగు ఒకే వస్తువు గనుక, దానిలోని సమస్తశక్తులకును సమాభివృద్ధి నీయగల శిక్షణయే సంపూర్ణమానవుని తయారు చేయగలదు. వివిధవిద్యాశాఖలలో ప్రత్యేక పాండిత్యములకు

ప్రాధాన్యత ఈయబడుచున్న ఈరోజులలో విద్యార్థిలోని శక్తులన్నిటికిని సమగ్రవికాసము నిచ్చు విద్యా విధానమును గాంధిజీ ప్రతిపాదించుట చాల సమయోచితము, మిక్కిలి ఉపయుక్తముకూడ.

తనయుద్దేశ్యములను ఒకపద్ధతిలోనికి దెచ్చి రూపొందించుటకు తగినంతసమయము గాంధిజీకి లేకపోయెను. ఇది మన దురదృష్టము. సున్నితములైన శుష్కసిద్ధాంతముల నల్లుటలో గాంధిజీకి నమ్మకములేదు. సత్యమని తనకు నిశ్చయమైన వానిని ఆచరణలో బెట్టుటయే ఆయన తనకర్తవ్యముగ నెన్నుకొనెను. తన యభిప్రాయములు కార్యరూపమునకు వచ్చుటయే వానినిజాయితీకి నిదర్శనముగ ఆయన భావించెను.

పాఠకుల సౌకర్యముకొరకు గాంధిజీవ్రాతలును, ఉపన్యాసములును, వీలైనంతవరకు తేదీలవరుసను, ఈసంపుటమున కూర్చబడినవి. "విమర్శలు, విశదీకరణములు" అను అయిదవభాగము ఒకప్రత్యేక ప్రాముఖ్యము, అభిరుచి కలది. ఈ అధ్యాయములో గాంధిజీ అనేక సంశయములను, కష్టములను ఎదుర్కొనుచు, తన సిద్ధాంతమును స్పష్టీకరించియున్నారు.

బొంబాయి : —భరతన్ కుమారప్ప.

అక్టోబరు 1,1950.

# విషయ సూచిక

అధ్యాయము | పుట


సంపాదకుని పీఠిక 3

మొదటిభాగము : నూతనవిద్య

1 నూతన విద్యయొక్క ఆవశ్యకత 17
2 వృత్తిద్వారా విద్య 24
3 మనోవికాసమా లేక భ్రష్టత్వమా ? 28
4 జాతీయ విద్యలోని ముఖ్యాంగములు 32
5 చదువుమాట ఏమి ? 37
6 నయీతాలీమ్ వలని ఫలితము 38

రెండవభాగము : బేసిక్ విద్యా సమావేశము

7 విద్యాసమావేశంలో ఆలోచనీయాంశములు 39
8 ప్రధానసమస్య 43
9 యంత్రయుగము 53
10 విద్యా సమావేశము – తీర్మానములు 54
11 సభ ముగింపు 55
12 ఒక ముందడుగు 56

మూడవభాగము : స్వయంపోషకవిద్య

13 విద్య – మద్యపానపు రాబడి 59

14 విద్యను గూర్చిన తికమక 64
15 స్వయంపోషకవిద్య 65
16 స్వయంపోషకవిద్య -- సంభాషణలు 68
17 స్వయంపోషక పాఠశాలలు 73
18 చేయుటయేగాని, సోమరిఆలోచనకాదు 80
19 బొంబాయిలో ప్రాథమికవిద్య 85
20 స్వయంపోషకత్వము - పరీక్షకాదు 91
21 తుదినిశ్చయములు 92

నాల్గవభాగము : ఉపాధ్యాయులు

22 విజ్ఞప్తి 94
23 ప్రాథమిక విద్యోపాధ్యాయ ధరఖాస్తుదారులకు 94
24 బేసిక్ విద్యా విధానములోని ఉపాధ్యాయులకు 95
25 అహింసపైఆధారము 97
26 బేసిక్ విద్యలోని ఉపా ధ్యాయులు 100

అయిదవభాగము : విమర్శలు, విశదీకరణములు

27 ప్రణాళికను బలపరచుట 102
28 ఒకవిమర్శకు జవాబు 105
29 ఒకఅమెరికనునితో సంభాషణ 111
30 మతవిద్య 116
31 బేసిక్ విద్యా ప్రణాళికకు అగ్నిపరీక్ష -I 118

32 బేసిక్ విద్యా ప్రణాళికకు అగ్ని పరీక్ష -II 128
33 పాశ్చాత్యులనుండి తెచ్చుకొన్న
దిగుమతి వస్తువుకాదు 133
34 మధ్యపరగణాల స్థానికసంస్థలు దారిచూపుచున్నవి 135
35 తకిలీ × ఆటవస్తువులు 141
36 పుస్తకపఠనము × చేతిపరిశ్రమ 143
37 చేతిపని, మానసికాభివృద్ధి 144
38 బేసిక్ శిక్షణపొందినవాని లక్షణములు 146
39 మంత్రుల సమావేశములో ప్రశ్నలు 148
40 మాతృభాష × ఇంగ్లీషు 155
41 నూతనవిద్యలో వైద్యమునకు స్థానము 156
42 విద్యావేత్తలతో 159

ఆరవభాగము : బేసిక్ విద్యాఫలితములు

43 నూలువడుకుట, శీలము 171
44 ఎడారిమధ్య ఉద్యానవనము 173
45 చేతిపరిశ్రమలద్వారా విద్య 175

ఏడవభాగము : బేసిక్ తరువాతవిద్య

46 కాంగ్రెసు మంత్రిత్వములు; బేసిక్ తరువాతవిద్య 177
47 క్రొత్తవిశ్వ విద్యాలయములు 182

# మొదటి భాగము : నూతన విద్య

## 1

## నూతన విద్యయొక్క ఆవశ్యకత

సంపాదకుడు : విద్య యనగా అక్షరజ్ఞానమని సామాన్య ముగ అనుచుందురు. చదువు, వ్రాత, గణితము నేర్పుట ప్రాథమిక విద్యగా చెల్లుబడి అగుచున్నది. వ్యవసాయదారుడు న్యాయమార్గమున తిండి సంపాదించుకొనును. సామాన్య లోకజ్ఞానమంతయు అతనికున్నది. తల్లిదండ్రులు, భార్య, బిడ్డలు, తోడి గ్రామస్థులు – వీరందరియెడల ఎట్లు ప్రవర్తించ వలెనో అత డెరుగును. నీతి ధర్మమును చక్కగ అర్థము చేసికొనగలడు, ఆచరింపగలడు. అయితే తనపేరును తాను వ్రాయలేడు. అట్టివానికి చదువుచెప్పి ఏమిచేయవలెనని మీ యుద్దేశము? అతని సుఖమును కొంచెమైన మీరు పెంచ గలరా? ఆ పూరిల్లు, దారిద్ర్యము యెడల అతనికి అసంతృప్తి కలిగించవలెననియా మీ కోరిక? మీరట్లు చేయదలచినను, అట్టి విద్య అతనికి అవసరమనిపించదు. ప్రచండమైన పాశ్చాత్య భావవాహినిలో కొట్టుకొనిపోవు మనము, ఉచితానుచితములు విచారించక ప్రజలకు ఈ మాదిరి విద్య గరపుటకు తీర్మానించి నాము.

ఇక, ఉన్నతవిద్యను తీసికొందము. నేను భూగోళ ఖగోళ శాస్త్రములను, బీజ, క్షేత్ర గణితములను నేర్చితిని. అయితే నేమి ? అందువల్ల నేను నాకుగాని, పొరుగువారికిగాని ఎట్లుపయోగ పడగలిగితిని ? ఈ శాస్త్రములను నేను నేర్చుకొన్న దెందుకు ? హక్స్లే పండితుడు విద్యనిట్లు నిర్వచించినాడు :

"ఎవని శరీరము చిత్తమునకు పూర్తిగ లోబడి చేతనైనంత పని సంతోషముతో చేయ సంసిద్ధమో, ఎవని బుద్ధినిర్మలము, హేతుయుక్తము, సౌష్టవము అయి చక్కగ పనిచేయునో, ఎవని మనస్సు మూలసత్యములపై ఆధారపడిన విజ్ఞానముతో నిండియుండునో, ఎవని ఉద్రేకములు క్రమశిక్షణద్వారా బలమైన ఇచ్ఛాశక్తికిని, మృదువైన మనస్సాక్షికిన్ని లోబడియుండునో, ఎవడు సమస్త నీచప్రవృత్తులను గర్హించుచు, అందరిని తనవలె భావించి గౌరవించునో, అతడే ధారాళమగు విద్య నేర్చినవాడగును. ఎందువల్లననగా అతడు ప్రకృతియొక్క నిత్యసంసర్గము ననుభవించును. ప్రకృతి, అతడు పరస్పర పూర్ణ సహకార భావమున బ్రతుకుచుందురు."

ఇదే నిజమైన విద్యయైతే, నేజేసిన శాస్త్రపఠన మంతయు నాఇంద్రియ నిగ్రహమునకు పనికిరాలేదని నిశ్చయముగ చెప్పగలను. కనుక ఈ ప్రాథమిక విద్యగాని, ఉన్నత విద్యగాని కావలసిన పనికి ఉపకరించదు. అది మనకు మనుష్యత్వము నీయలేదు. మనచే కర్తవ్యపాలనము చేయించలేదు.

పాఠకుడు : అయితే, ఇన్ని విషయములు మీరు నాకెట్లు తెలియజెప్ప గలుగుచున్నారు ? మీరు పొందిన ఉన్నతవిద్య వలన కానిచో, ఈ వివరణశక్తి మీకెట్లు కలిగినది ?

సంపాదకుడు : ఇది మంచి ప్రశ్న. కాని దీనికి జవాబిచ్చుట సులువు. ఈ యున్నత, లేక ప్రాథమిక విద్య నాకు లేకుండి నచో నా బ్రతుకు నిరర్థకమయ్యెడిదని నేను ఏమాత్రమును నమ్మను. మాటలాడ గలుగుటచే, నేను సేవచేయ గలుగు చున్నాననుకొనుటయు సరికాదు. సేవచేయు కోరిక నాకున్నది. దానిని నెరవేర్చుకొనుటలో, నేను నేర్చిన విద్యను ఉపయోగ పరతును. దాని సద్వినియోగము కూడ ప్రజాకోటికి ఉపక రించదు. మీవంటివారి కొరకే దాని యుపయోగము. ఇది నా వాదమును బలపరచుచున్నది. మన మిద్దరమును కృత్రిమ విద్యావిధానముయొక్క దుష్ప్రభావములో పడిన వారమే. నేను దానినుండి తప్పించుకొని, నా అనుభవములను ఈ విద్యలోని కుళ్ళును మీకు తెలుప యత్నించుచున్నాను.

అట్లని అన్ని సందర్భములలోను అక్షరజ్ఞానమును నేను ఖండించువాడను కాను. ఇదియొక మూఢనమ్మిక కారాదని మాత్రమే నావాదన. అక్షరజ్ఞానము మన కామధేనువు కాదు. దాని స్థానమున అది యున్నంతవరకు ఉపయుక్తము కాగలదు. ఇంద్రియ నిగ్రహము, నీతివర్తనము స్థిరపడినచోట అక్షర జ్ఞానము మంచిపని చేయును. కావలసినవారికి అది మంచి ఫలితము నీయగలదు; జీవితమున కొక అలంకారము కాగలదు. అయితే ఇట్టి విద్యను నిర్బంధముచేయ బనిలేదు మన ప్రాచీన విద్యాపద్ధతి మనకు చాలును. శీలమును పెంచుకొనుట ధ్యే

అందు ప్రధాన విషయము. ఇదే ప్రాథమిక విద్య అట్టి పునాదిపై నిర్మింపబడు గృహము సుస్థిరముగ నిలిచియుండును.

పాఠకుడు : అయితే స్వరాజ్య సంపాదనకు మీదృష్టిలో ఆంగ్ల విద్యతో పనిలేదన్నట్లు నేను భావింపదగునా ?

సంపాదకుడు : అవునని, కాదనికూడ నా జవాబు. కోట్ల కొలది ప్రజలకు ఆంగ్లభాషను నేర్పజూచుట వారిని బానిసలను చేయుటయే. మెకాలే ప్రభువు ఆంగ్లభాషకు వేసిన పునాదివల్ల జరిగిన పనియిది. అతడీపని బుద్ధిపూర్వకముగా చేసినాడని నేననుటలేదు కాని కలిగిన ఫలితము అదే. స్వరాజ్యమును గూర్చి మనము విదేశభాషలో మాటలాడుకొనవలసి వచ్చుట శోచనీయము కాదా ?

ఐరోపావారు తీసిపారవేసిన సిద్ధాంతములు, పద్ధతులు మనమాచరణలో పెట్టుకొందుము. అక్కడి విద్వాంసులు ఎప్పటికప్పుడు వలసినమార్పులను చేసికొనుచుందురు. మనమో వారు విసర్జించిన విధానములను పట్టుకొని దేవులాడుదుము. అచ్చటి ప్రతిరాష్ట్రమును తనయభివృద్ధికై పాటుపడును. ఇంగ్లాండులో ఒక చిన్నభాగము వేల్సు. వేల్సుప్రజల మాతృభాషాభివృద్ధికి తీవ్రకృషి జరుగుచున్నది. ఈ యుద్యమములో ఆంగ్లఛాన్సెలరు లాయిడ్ జార్జి ప్రధానపాత్ర వహించినాడు. ఇక మనస్థితియేమి ? మనము తప్పుడు ఇంగ్లీషుతో లేఖలు వ్రాయుచుందుము. మన 'ఎం. యే.,'ల స్థితికూడ ఇంతే.

మన ఉత్తమభావములన్నియు ఆంగ్లములోనే వ్యక్తపడు చున్నవి; కాంగ్రెసు సభాకార్యక్రమము నడచుచున్నది ఆంగ్లములోనే; మన ప్రఖ్యాతవార్తాపత్రికల ముద్రణకూడ ఆంగ్లములోనే. ఈ స్థితి చిరకాలమిట్లేయున్నచో, ముందు తరాలవారు మనలను దూషించి దుమ్మెత్తిపోయుదురు.

ఆంగ్లవిద్యనేర్చి మనమీజాతిని బానిసజాతిగ తయారు చేసినామని మరువకుడు. మోసము, నిరంకుశత్వము పెరిగి పోయినవి. ఇంగ్లీషునేర్చిన ఇండియనులు ప్రజలను మోసగించి భయపెట్టుటకు జంకరు. మనమిపుడేదైన ప్రజాసేవచేయు చున్నామంటే, మనఋణములో అల్పాంశము తీర్చుకొను చున్నామన్నమాట.

నేను న్యాయస్థానమునకువెళ్లి అక్కడ వాడవలసినది ఆంగ్ల భాష. నా బారిష్టరువృత్తిలో మాతృభాషను మాట్లాడరాదు కదా! మరొకరు దానినుండి తర్జుమాచేయవలసియుందురు. ఇదెంత అసంగతము! ఎట్టిబానిసత్వము! దీనికిగాను నేను నిందించవలసినది ఆంగ్లేయులనా, లేక నన్నేనా? ఇంగ్లీషు నేర్చిన మనమే ఇండియాను బానిసగజేసినాము. ఈజాతి శాపము మనకే తగులును. ఆంగ్లేయులకు కాదు.

మీ చివరి ప్రశ్నకు నా జవాబు 'అవును' 'కాదు' కూడ అంటిని. ఎట్లు 'అవునో' విశదపరచితిని. ఎందుకు 'కాదో' ఇక వినుడు.

ఆంగ్లవిద్యను పూర్తిగావదలి మనము బ్రతుకలేకున్నాము. నవనాగరికతయను రోగము మనలనింతగా పట్టివేసినది. ఇదివరకే ఆ విద్యను నేర్చియున్నవారు, అవసరమైతే దానిని ఉపయోగపరచుకోవచ్చును. ఆంగ్లేయులకు లేక మనవారికి ఆంగ్లముననే జాబులువ్రాయుట తప్పనియెడల వ్రాయవచ్చును. ఆంగ్లేయులే తమ నాగరికతతో తామెంత విసిగియున్నారో మనకు తెలియుటకుగూడ అది పనికివచ్చును. ఇంగ్లీషునేర్చిన తల్లిదండ్రులు తమబిడ్డలకు నీతిబోధను మాతృభాషలోనే చేయుచు, వారికి మరొక భారతీయ భాషనుకూడ నేర్పవలెను. పెద్దవారైనపుడు వారుకూడ, కావలసినచో, ఆంగ్లము నేర్వవచ్చును. నిజముగ మనకాభాష అనవసరమని చివరకు తేలిపోవలె. తద్వారా ధనార్జనచేయు ఉద్దేశముండరాదు. ఇట్లు కొద్దిపాటి ఇంగ్లీషు చదువుటలో గూడ తద్వారా మనము నేర్వదగినదేదో, తగనిదేదో నిర్ణయించుకోవలె. మనము ఏయే ప్రకృతి విజ్ఞానశాస్త్రములు నేర్వవలెనో నిర్ణయము కావలె. ఇంగ్లీషు డిగ్రీల వ్యామోహము మనలో అంతరించిన తక్షణమే మన ప్రభువులు చెవులు రిక్కించి చూతురు.

పాఠకుడు : అయితే మనము గరపవలసిన విద్య ఎట్టిది?

సంపాదకుడు : ఈ విషయము కొంతవరకు పైన చర్చింపబడినది. కాని మరికొంచెము విచారింతము. దేశభాషలన్నిటిని మనము వృద్ధిచేయవలెను. వాటిద్వారా నేర్పవలసిన పాఠము

లేవో ఇక్కడ విశదీకరింప బనిలేదు. ఆంగ్ల భాషలోని మంచి గ్రంథములను మన దేశ భాషలలోనికి అనువదించవలెను. చాల విజ్ఞానశాస్త్రములను నేర్వవలసియున్నామను కపట వాదమును మనము వదలుకోవలెను. మతము అనగా నీతి శిక్షణకు ప్రథమస్థాన ముండవలెను. సంస్కారముగల ప్రతి భారతీయుడును తన మాతృభాషకుతోడు, తాను హిందువుడైతే సంస్కృతమును, మహమ్మదీయుడైతే అరబ్బీని, పార్శీయైతే పారశీకమును, అందరును హిందీని నేర్చుకొనవలెను. హిందువులలో కొందరికి అరబ్బీ, పారశీకములును; కొందరు ముస్లిములకు. పార్సీలకు సంస్కృతమును రావలెను. ఉత్తరాదివారు, పశ్చిమరాష్ట్రములవారు కొందరు తమిళము నేర్చుకొనవలెను. హిందీ అఖిలభారత భాష కావలెను. అది పారశీక లిపితో గాని, దేవనాగరితోగాని వ్రాయబడవచ్చును. హిందూ - ముస్లిం మైత్రి దృఢపడుటకుగాను రెండు లిపులను నేర్చుకొనుట అవసరము. మనమిది చేయగలిగినచో ఆంగ్లభాషను కొద్దికాలములో ఇక్కడనుండి తోలివేయవచ్చును. బానిసలమైన మనకిదంతయు అవసరమే. మన దాస్యముతో ఈ జాతికి బానిసత్వము దాపరించినది. మన స్వాతంత్ర్యముతో అదియు స్వతంత్ర మగును.

పాఠకుడు : మతవిద్యా సమస్య చాల క్లిష్టమైనది.

సంపాదకుడు : కాని మతశిక్షణ లేకుండ సాగదు. ఇండియా

ఎన్నటికిని నాస్తిక దేశము కాబోదు. గడ్డు నాస్తిక్యము ఈ భూమిపై వర్ధిల్లదు. ఈ పని కష్టమే. మతవిద్య అనగానే నా తల తిరుగును. మన మతబోధకులు కపటులు, స్వార్థ పరులు; మనము వారివద్దకు వెళ్ళవలెను. ముల్లాలు, దస్తూర్లు, బ్రాహ్మణులు తాళముచెవిని తమచేత బెట్టుకొన్నారు. వారు వివేకశూన్యులైనప్పుడు ఆంగ్ల విద్యనుండి మనము పొందిన శక్తిని మతవిద్యకై వినియోగించవలెను. ఇది ఏమంత కష్ట మైన పనికాదు. ప్రజాసముద్రపు అంచుమాత్రమే మైలపడి నది. ఆ యంచు నున్నవారు మాత్రమే పరిశుద్ధులు కావలె. ఈ వర్గమునకు చెందిన మనము మనలను శుద్ధిగావించుకొన వచ్చును. ప్రజాబాహుళ్యమున కీమాట వర్తించదు. ఇండి యాకు మరల ప్రాచీన ప్రతిభ రావలెననిన, మనము వెను కకు మరలవలెను.

హింద్ స్వరాజ్ 18వ అధ్యాయము.

# 2

## వృత్తిద్వారా విద్య

[నూతన విద్యనుగూర్చిన ఆలోచన మొదట తనకెట్లు కలిగెనో, వృత్తిని, విద్యను సమన్వయించుటను గూర్చి తన యుద్దేశమేమో గాంధిజీ కొన్ని సంభాషణలలో విపుల పరచెను.]

విద్యలో నూతనపద్ధతి రావలెనని చాలాకాలము క్రిందటనే నాకు గట్టిగ తోచెను. నేను దక్షిణాఫ్రికానుండి తిరిగి వచ్చిన పిదప, నన్ను చూడవచ్చిన విద్యార్థులతో మాట్లాడుచుండగా, ప్రస్తుత విద్యావిధానము నిష్ఫలమయ్యెనను సంగతి నాకు ధృవమయ్యెను. కనుక ఆశ్రమ పాఠశాలను చేతిపనుల శిక్షణతో ప్రారంభించితిని. దీనికే అత్యధిక ప్రాముఖ్య మియ్యబడుటచే పుస్తకవిద్య లేదనిచెప్పి విద్యార్థులు విసుగు జెందిరి. వారట్లనుకొనుట పొరపాటు. చదువు కొద్దియైనను, ఇతర చోట్ల పిల్లలకు నేర్పబడుదానికంటె వీరు నేర్చినది యెక్కువే. అయినను అది నన్ను ఆలోచనకు పురికొల్పినది. పుస్తకవిద్య ప్రక్కనే వృత్తిపనిని మరొక విద్యగా నేర్పుటకాదని, వృత్తి పనిద్వారానే మిగత విషయము లన్నియు రావలెనని నాకు తేలిన సిద్ధాంతము. అందుచే వృత్తివిద్య బాధకరమనిపించదు. పుస్తకపు చదువుకు ఒక నూతన అర్థము, నూతన ప్రయోజనము కలుగును.

ఇంగ్లీషుభాషను తీసివేయుటకే మేము నిశ్చయించితిమి. కారణమిది : పిల్లలకున్న సమయములో అధికభాగము ఇంగ్లీషు పదములను, వాటి ప్రయోగములను జ్ఞాపకముంచుకొనుటతోనే తీరిపోవుచున్నది. అంతేకాదు, వారు నేర్చినది తమ స్వంత భాషలో మరల చెప్పలేరు. ఉపాధ్యాయుడు చెప్పినదానిని సరిగా అర్థము చేసికొనలేరు. ఇదియిట్లుండగా,

కేవలము అలక్ష్యమువలన తమ స్వంత భాషనుకూడ మరచి పోదురు. పై రెండు చెడుగులను నివారించుటకు వృత్తిపని మూలమున విద్య గరపుట ఒక్కటే మార్గముగ నాకు కను పించినది.

బాలుర తెలివితేట లెంతవరకున్నవో పరీక్షించుటకో మొదటి పాఠము ప్రారంభింతును. తరువాత తకిలీని వారి చేత పెట్టుదును.

ఎన్నో ఇతర చేతిపనులుండగా తకిలీనే ఎందులకు ప్రవేశ పెట్టవలెనని మీరడుగవచ్చును. మనవారు కనిపెట్టిన మొదటి చేతిపనులలో తకిలీ ఒకటి. అది యుగముల తరబడి బ్రతుకుచు వచ్చినది. ఆదికాలమున మన బట్టలన్నియు తకిలీ నూలుతోనే నేయబడు ,చుండెడివి. రాట్నము తరువాత వచ్చెను. రాట్నముతో సన్ననూలు రానికారణంచేత, మరల తకిలీకే పోవలసి వచ్చెను. తకిలీని కనిపెట్టుటలో మానవుని కల్పనా శక్తి అంతకుమును పెన్నడును వెళ్ళనంత యెత్తునకు వెళ్ళెను. హస్తనైపుణ్య మెంతవరకు ఉపయోగపడగలదో అంతవర కుపయోగ పరుపబడెను. అయితే, ఈ పనిముట్టు కేవలము విద్య నెరుగని కార్మికుల చేతులలో ఉండిపోవుటచే, దాని వాడుక తప్పిపోయెను. దానిసుద్ధరించి గ్రామపునర్నిర్మాణము చేయవలెనన్నచో బిడ్డల విద్యాభ్యాసము తకిలీతోనే ప్రారం భింపవలసి యుండును. పూర్వము మన నిత్యజీవితమునందు

తకిలీకుండిన స్థానమును బోధించుటయే నేను బిడ్డలకిచ్చు రెండవ పాఠము. తరువాత చరిత్ర పాఠము వచ్చును. తకిలీ క్రమముగ ఎట్లు నశించిపోయెనో చెప్పుదును. బ్రిటిషు తూర్పు ఇండియా సంఘ చరిత్రతోనో, మహమ్మదీయ యుగముతోనో చరిత్ర ప్రారంభింతును. ఈస్టిండియా సంఘము స్వార్థముతో - వారిచ్చిన సరుకే స్వార్థము-మన ప్రధాన పరిశ్రమను గొంతుపిసికి చంపివేసిన చరిత్రను విపులముగ బోధింతును. తదుపరి క్లుప్తముగ యంత్ర నిర్మాణము, అనగా తకిలీని తయారుచేయుట, వచ్చును. ఆదికాలమున మట్టి లేక పిండి వుండకు మధ్య గుచ్చుబడిన వెదురుపుల్ల తకిలీగా పనిచేసి యుండును. బీహారు, బెంగాలు రాష్ట్రములలో ఇప్పటికింకను ఈ రకపు తకిలీ నిలిచియున్నది. తరువాత మట్టివుండకు బదులు కాల్చిన మట్టి బిళ్ళ, తరువాత ఇటీవల ఇనుము, ఉక్కు లేక ఇత్తడి బిళ్ళలు వచ్చినవి. వెదురు పుల్లకు బదులు ఇనుపపుల్ల వచ్చినది. ఇక్కడ ఇంకను విపులపరచవలసిన విషయము లుండును. తకిలీబిళ్ళ పరిమాణము, పుల్లపొడవు, అంతే యెందుకుండవలెనో, అంతకుమించికాని తగ్గికాని ఎందుకుండరాదో బోధింపవలెను. తరువాత ప్రత్తి, ప్రత్తిలో రకములు, అది పండు రాష్ట్రములు, ఇత్యాది విషయములపై కొన్ని ఉపన్యాసము లుండును. ప్రత్తిని పైరుచేయు విధమునుగూర్చి, దానికి అనువైన భూములనుగూర్చి విద్యార్థులకు అనుభవజ్ఞానమును

కలిగించవలెను. ఇది మనలను కొంచెము వ్యవసాయ పరిశ్రమ లోనికి తీసికొని వెళ్ళును.

విద్యార్థుల కిది బోధించుటకు ముందు ఉపాధ్యాయుడు దీనినంతను తనలో జీర్ణింపజేసికొని యుండవలెను. వడికిన నూలును గజములలో లెక్కించుట, నూలు నంబరుకట్టుట, కట్టు చిలపలు పోసి నేతకు సిద్ధముచేయుట, పుంజములోని పోగులలెక్క, పడుగుపేకలు, ఇట్టి విషయములను తెలిసికొనుట ద్వారా ప్రాథమిక గణితజ్ఞాన మంతయు వచ్చును. ప్రత్తిని పైరుచేయుట మొదలు వస్త్రనిర్మాణము వరకుగల పనులన్నిటికి సంబంధించిన శాస్త్రము, చరిత్ర, గణితము అన్యోన్య సంబంధము కలిగియుండును.

పిల్లలకు నేర్పబడు చేతిపనినుండియే శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శిక్షణ యంతయు గరపబడవలెనని ఇందలి ప్రధాన విషయము. ఈ శిక్షణమూలమున విద్యార్థియొక్క శక్తులన్నిటిని వికసింపజేయవలెను. చరిత్ర, భూగోళ, గణిత పాఠము లన్నియు ఈ చేతిపరిశ్రమతో సమన్వయింపబడవలెను.

హరిజన్ : 11-6-'38.

# 3

## మనోవికాసమా? లేక భ్రష్టత్వమా?

ఇటీవల నా తిరువాన్కూరు, మద్రాసు పర్యటనలో నన్ను కలసికొన్న చాలమంది విద్యార్థులలోను, మేధావులలోను

బుద్ధి వికాసమునకు బదులు బుద్ధియొక్క దుర్వినియోగమునే చూచితిని. ప్రస్తుత విధానములోని దోషమిది. ఈ వికారములకు దోహద మిచ్చునది, మనస్సును పెడమార్గమున కీడ్చునది, అభివృద్ధిని ఆటంకపరచునది ఈ దోషమే. సేగాఁలో నేను చేసిన ప్రయోగములు నా యభిప్రాయమును ధృవపరచినవి. కాని నా ప్రయోగము లింకను అసంపూర్ణములు. కనుక వానిని నేను ఋజువుగ తీసికొనను. నే నిపుడు ఇచట వ్యక్తపరచు అభిప్రాయములు 1904లో దక్షిణాఫ్రికాలో 'ఫినిక్సు' నివాస మేర్పడిన నాటినుండియు నా కున్న వే.

చేతులు, కాళ్లు, కళ్ళు, చెవులు, ముక్కు మొదలగు అవయవములకు తగిన శిక్షణ నిచ్చుట ద్వారానే సరియైన మానసికాభివృద్ధి కలుగ గలదని నా విశ్వాసము. అనగా వివేకముతో బిడ్డయొక్క అవయవములను పనిలో పెట్టుట మెదడుకు త్వరితముగా వికాసము నీయగల ఉత్తమమార్గము. కాని మనశ్శరీరాలు రెండును కలిసి వృద్ధిచెందుతూ, తోడ్తోడ ఆత్మను మేల్కొల్పనిచో, మొదటి రెంటిది నిరర్థకమగు పాక్షిక వ్యాపారమగును. ఆధ్యాత్మిక శిక్షణ యనగా హృదయ వికాసమును కలిగించుట యని నా భావము. బిడ్డయొక్క ఆధ్యాత్మిక, శారీరక శక్తుల శిక్షణతో కలిసి విద్య నడచినపుడే చక్కని మనోవికాసము కలుగును. వీనిలో దేనికది విడివస్తువు కాదు. ఒక్కొక్కటిగ విడదీసి యభివృద్ధికి తేవచ్చు

నసుకొనుట చాల పొరపాటు.

శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులను సరిగా సమన్వయించంక పోవుట వలన కలుగు దుష్ఫలితాలు స్పష్టముగ కనబడుచునే యుండును. అవి మన సంఘము నలుముకొనియే యున్నవి. మన ప్రస్తుత వక్రజీవిత సంబంధాలనుబట్టి, వాటిని మనము చూడలేక పోవుచున్నాము. మన గ్రామీణుల విషయమాలోచింపుడు. బాల్యం నుండి వారు దినమంతా కష్టించి, పొలంలో పనిచేయుదురు. వారి పశువులమధ్యనే వారియునికి. వాటి కష్టమువంటిదే వారి కష్టముకూడ. వారి బ్రతుకంతయు నిరంతరము అలసటతోను, నిర్జీవమగు వెట్టిచాకిరితోను కూడియుండును. ఏ మాత్రపు మనోవికాసం గాని, ఆత్మసౌందర్యం గాని లేక, వారు పశువుల స్థితికి దిగిపోయినారు. దుఃఖమయ జీవితాన్ని ఎట్లాగో ఈడ్చుకొంటూ కాలక్షేపం చేస్తారు. ఇప్పుడు పట్టణ పాఠశాలలలోను, కాలేజీలలోను విద్య యనబడునదంతయు మనోశక్తుల దుర్వినియోగమే. వారి దృష్టిలో మానసిక శిక్షణకును, శరీర శ్రమకును ఎట్టి సంబంధమును లేదు. కాని శరీరారోగ్యమునకు ఏదో ఒక విధమైన పరిశ్రమ కావలెను కనుక నిరుపయోగమగు ఏదోయొక కృత్రిమ వ్యాయామములతో కాలముగడపుదురు. ఇట్టి శుష్క వ్యాయామముతో తయారైన యువకునికి ఒక్క సామాన్య శ్రమజీవికున్న సహనశక్తి యుండదు. కించిత్తు పనిచేయుటతో తల

నొప్పి బయలుదేరును. ఇంచుకసేపు సూర్యరశ్మిలో నిలువ గానే తల దిమ్ముపుట్టును. మీదు మిక్కిలి ఇదంతయు 'సహజమే' అని అతడనుకొనును. దీనితో వాని హృదయము శిక్షణ లేక పెడమార్గము పట్టి దాని యిష్టము వచ్చినట్లు పరుగిడును. నైతిక, ఆధ్యాత్మిక అరాచకమే దీని తుది ఫలితము. కాని ఇదొక మెచ్చుకోదగిన విషయముగ పరిగణింపబడుచున్నది!!

ఇట్లుగాక, ఆదినుండియు శ్రద్ధతో హృదయ శిక్షణను పొందిన బిడ్డ విషయము తీసికొందము. నూలు వడుకుట, వడ్రంగము, సేద్యమువంటి ఒక వృత్తిలో శిక్షణపొందుచు, దానికి సంబంధించిన పనిముట్ల ఉపయోగము, వాటి తయారు నెరిగిన మరొక పిల్లవాడితడు. అంగసౌష్టవము, ఆరోగ్యముగల శరీరాన్ని, అనుభవజ్ఞానముయొక్క నిత్య పరీక్షలో ఉత్తీర్ణమైన మనశ్శక్తిని కూడ అతడు కలిగియుండును. కేవల విద్వత్సంబంధమగు మేధస్సుకాదది. గణితశాస్త్రజ్ఞానము, తనవృత్తిని జయప్రదం చేయగల వివిధశాస్త్రాల జ్ఞానము అందు కలిసియుంటవి. మనోల్లాసం కొరకు సారస్వతమునుకూడ వీటికి చేర్చితే అతని విద్య పూర్ణతనొందును. ఇందు మనస్సు, శరీరము, ఆత్మ సమవికాసమును పొంది, సహజమైన సమన్వయ జీవితము సిద్ధించును. మనుష్యుడనగా కేవలము మేధస్సుగాని లేక వట్టి స్థూలశరీరం కాని కాదు. ఒక్క హృదయము, లేక ఒక్క ఆత్మమాత్రమే కాదు. పూర్ణ మానవుడు తయారగు

టకు ఈ మూంటియొక్క సరియైన సమపాళ్ళ కలయిక అవసరము. ఇదియే విద్యనుగూర్చిన సరియైన అర్థశాస్త్రము. స్వాతంత్ర్యము వచ్చిన పిమ్మటనే ఈ ప్రణాళికను అమలు పరచగల మనుకొనుట తలక్రిందు పద్ధతి. కోట్లాది ప్రజలను తమ తమ వృత్తులలో వివేకముగల ప్రవీణులను చేయవలె. సర్వజనుల సమిష్టి సుఖసంపదలకోసమే తాము బ్రతుకుచున్నట్లు అందరును భావించవలె. ఈ పని జరిగినట్లైతేనే, స్వాతంత్ర్యమును అతి త్వరితముగ రాబట్టగలము.

హరిజన్ : 8-5-'37.

# 4

## జాతీయ విద్యలోని ముఖ్యాంగములు

'మే' నెల 22వ తేదీని తిథాల్‌లో, గుజరాతు జాతీయ పాఠశాలల ఉపాధ్యాయుల సమావేశము జరిగెను. సమావేశ కర్త ఆహ్వానితులకు ఈ క్రింది ప్రశ్నావళిని పంపెను:

1. గ్రామస్థులకు అత్యంతోపయుక్తమై, గ్రామావసరములను తీర్చగల ఉత్తమ విద్య యేది? దానిని గ్రామాలలో విస్తరింపజేయుట యెట్లు?

2. ప్రజానీకములోని నిరక్షరత్వమును, అజ్ఞానమును నిరోధించుట యెట్లు?

3. మనోవికాసమునకు అక్షరజ్ఞానము ఉండితీరవలెనా? అక్షరములు వ్రాయుట, చదువుటతో శిక్షణ ప్రారంభించుట మానసికాభివృద్ధికి అడ్డు తగులునా?

4. విద్యకంతకును వృత్తి-శిక్షణను కీలకముగా చేయు ఆవశ్యకత.

5. ప్రస్తుత జాతీయ పాఠశాలల భవిష్యత్తు.

6. విద్యనంతను బిడ్డల మాతృభాషలోనే గరపు అవకాశము.

7. ఉన్నట్టి పాఠశాలలలో జాతీయ విద్యయొక్క ముఖ్యలక్షణము లేవి లోపించినవి?

8. ప్రాథమిక, మాధ్యమిక విద్యలో మొదటినుండియు హిందీ-హిందూస్థానీ భాషను నిర్బంధముగ నేర్పవలసిన అవసరము.

పై విషయములపై అభిప్రాయముల నిచ్చుటకు గాంధిజీ సమావేశమున కాహ్వానింపబడెను. ఈ క్రిందిది ఆయన చెప్పిన దాని సారాంశము :

"గ్రామీణుల కత్యావశ్యకమగు విద్యను గరపవలెనన్నచో విద్యాపీఠమును గ్రామములోనికి తీసికొనిపోవలెను. దానినొక ట్రెయినింగు స్కూలుగా చేసి, గ్రామావసరముల ననుసరించి దృష్టాంతపూర్వకముగ ఉపాధ్యాయులకు శిక్షణ నీయవలెను. పట్టణ ట్రెయినింగు స్కూళ్ళద్వారా ఈ పని జరుగదు. పట్టణవాసులకు గ్రామాభిమానమును కలిగించుట, వారిని గ్రామవాసులుగ చేయుట సులభముకాదు. సేగాన్‌లో నాకీ విషయము నిత్యము ఋజువగుచున్నది. సేగాన్‌లో మా ఈ సంవత్సర నివాసము మమ్ములను గ్రామస్థులుగ చేసినదనికాని, సర్వుల శ్రేయానికిగాను మమ్ములను వారితో ఏకముచేసినదని గాని నేను చెప్పజాలను."

"అక్షరములు వ్రాయించుటతో విద్యారంభము చేయుట మానసికాభివృద్ధికి ఆటంకమేయని నాగట్టి నమ్మకము. చరిత్ర, భూగోళము, నోటిలెక్కలు, నూలువడుకుట వంటి ఒక కళ-వీటిలో కొంత ప్రాథమిక జ్ఞానము కలుగనంతవరకు నేను పిల్లలకు అక్షరములు నేర్పను. పై విషయ జ్ఞానముద్వారా ముందర పిల్లల మనోశక్తిని పెంచుదును. తకిలీ లేక రాట్నము ద్వారా మనోవికాస మెట్లు కలుగునని మీరు ప్రశ్నించవచ్చును. దానిని కేవలము బండపనిగా నేర్పకున్న యెడల, అద్భుతమైన మనోవికాసము తప్పక కలుగును. బిడ్డకు ప్రతి పనిని హేతుయుక్తముగా నేర్పుచు, తకిలీ లేక రాట్నములోని ప్రతి భాగమును గూర్చియు బోధించవలెను. ప్రత్తియొక్క చరిత్రను, ప్రపంచ నాగరికతతో దానికి గల సంబంధమును బోధపరచవలెను. పిల్లవానిని గ్రామములోని ప్రత్తిచేనువద్దకు తీసికొని వెళ్ళవలెను. ఆసుకు చుట్టిన చుట్లను లెక్కించుట, నూలుపురి, సాఫీ పిల్లవానికి బోధపరచుటతో వానిలో నిజమైన అభిరుచి కలుగనారంభించును. ఇట్లు వానికండ్లకు, మనస్సుకుగూడ శిక్షణనిచ్చిన వారమగుదుము. ఈ ప్రారంభ శిక్షణకు ఆరునెల లీయవచ్చును. అప్పుడు బిడ్డ అక్షరములను చదువదగిన కాలము వచ్చిన దనవచ్చును. అక్షరములను వేగముగా చదువగలిగినప్పుడు సామాన్య చిత్రలేఖనము వ్రాయుటకు తగు సమయము వచ్చినట్లు. రేఖాగణితపు బొమ్మ

లను, పక్షులు మొదలగువాని చిత్రములను అతడు వ్రాయ
గలిగిన తరువాత, అక్షరముల నతడు ఏదోలాగున గీకివేయక,
చక్కగా చిత్రింపగలుగును. చిన్ననాట నే నక్షరములను
నేర్చిన దినములు నాకు జ్ఞప్తియం దున్నవి. ఆ పని నాకు
చాల కష్టమయ్యెను. నాలోని మానసికశక్తి ఎందులకు తుప్పు
పట్టుచుండెనో ఎవరును కనిపెట్టరైరి. దస్తూరీ ఒక లలితకళ
యని నా యభిప్రాయము. బిడ్డలకు బలాత్కారముగ అక్షర
ముల వ్రాతతో విద్యాప్రారంభము చేయుటవల్ల మనము
అందలి కళను చంపివేయుచున్నాము. వ్రాత యను కళ
యెడల దౌర్జన్యమును అవలంబించుచున్నాము. అకాలములో
అక్షరములు వ్రాయించుటవలన బిడ్డయొక్క అభివృద్ధిని అణచి
వేయుచున్నాము.''

''మనము విచారమును సిగ్గును పొందవలసిన విషయము
అజ్ఞానముకాని నిరక్షరత్వము కాదు. కనుక వయోజన విద్యకు
కావలసినది అజ్ఞాన నిర్మూలనమున కొక తీవ్రమగు కార్యక్ర
మము. గ్రామ వయోజనులకు మానసిక వికాసము కలిగించు
టకు సమర్థులగు ఉపాధ్యాయులు, చక్కని పాఠ్యక్రమము
అవసరము. వారికి అక్షరజ్ఞానముతో పనిలేదని కాదు. విద్యా
సాధనములలో నొకటిగ దాని విలువను నేను తగ్గించను.
అక్షరములను భాషను సులభగ్రాహ్యము చేయుటకు ప్రొఫె
సరు లాబాక్, ప్రొఫెసరు భాగవత్ గార్ల శ్రమతో చేసిన

కృషిని నే నభినందింతును. సేగాన్ లోని స్త్రీ పురుషులకును, పిల్లలకును తమ సులభ పద్ధతులను బోధించమని భాగవత్ గారిని నే నాహ్వానించినానుకూడ."

"గ్రామ పరిశ్రమలను విద్యకు కేంద్రముగా చేయవలసిన ఆవశ్యకతను గూర్చి నాకణుమాత్రమును సందేహము లేదు. ఇండియాలోని ప్రస్తుత విధానమును నేను విద్యయనక, మానసిక వ్యభిచారమందును. మానవునిలోని ఉత్తమశక్తులను బయటికి తీయుటయే నిజమైన విద్య. ఏదో ఇంత సమాచారముతో మనస్సును నింపుటయే నేటి విధానమున జరుగుచున్న పని. అట్లుగాక గ్రామాలలోని చేతిపనులద్వారా మొదటి నుండియు మానసిక శిక్షణనిచ్చు పద్ధతివలన సుశిక్షితమగు మానసికాభివృద్ధి కలుగును. దానివలన మనోశక్తులే గాక పరోక్షముగ ఆత్మశక్తికూడ భద్రపరుపబడును."

"ఇక్కడ లలితకళల ప్రాముఖ్యమును నేను తగ్గించు చున్నానని అనుకొనరాదు. కాని వానిని చోటు తప్పించి కానిచోట పెట్టను. చోటుకాని చోటనున్న పదార్థమే 'మురికి' యన్న నిర్వచనము సరియైనది. దీనికి తార్కాణముగ టన్నులకొలది పనికిమాలిన పుస్తకములు, నీతిబాహ్యములైనవి కూడ, ఎన్ని వచ్చి పైబడుచున్నవో చూడుడు. దీని ఫలితము అందరకు విదితమే."

హరిజన్ : 5-6-'37.

# 5

## చదువుమాట యేమి ?

విద్యనుగూర్చి నేను వెలిబుచ్చు భావములపై పలువురు తమ అభిప్రాయములను నాకు పంపుచున్నారు. ఒక పండిత విలేఖరి తెలిపిన ఆక్షేపణకు నేను జవాబియ్యవలసియున్నాను. వ్రాత, చదువు విషయమై నేను అలక్ష్యము చూపుచున్నానని ఆయన యూహ. అట్టి యభిప్రాయమును కలిగించు వ్రాత నే నెపుడును వ్రాయలేదు. నే నుద్దేశించిన పాఠశాలలలో బోధింపవలసిన ప్రతి విషయమును చేతిపనులద్వారా బోధింపవలెనని నేను నొక్కి చెప్పుటలేదా ? అందు చదువుట, వ్రాయుటకూడ విధిగా ఉన్నవి. నా విధానములో అక్షరములను చిత్రించుటకు అనగా వ్రాయుటకు ముందు చెయ్యి పనిముట్ల నుపయోగించును. కండ్లు ఇతరదృశ్యములను తెలిసికొనునట్లే అక్షరములను, మాటలను చదువనేర్చుకొనును. అట్లే వస్తువుల పేర్లను, వాక్యముల అర్థములను చెవులు గుర్తించును. ఈ శిక్షణ యావత్తు సహజముగను, సమగ్రముగను జరుగును; అది అతిచౌకగ లభించును కూడ.

నా పాఠశాల విద్యార్థులు వ్రాయుటకంటె ఎక్కువవేగముగ చదువనేర్చుకొందురు. వారి దస్తూరీ నా యుపాధ్యాయుల దయవలన నా కర్బినవ్రాతవలె అలికివేసినట్లుండదు. వస్తువులను చిత్రించినట్లువారు అక్షరములనుకూడ చక్కగ చిత్రించ

గలుగుదురు నేననుకొన్న పాఠశాల లెప్పటికైన ఏర్పడినచో, ఖ్యాతిగన్న ఇతరపాఠశాలల నవి మించగలవని చెప్ప సాహసించుచున్నాను సేగాఁవ్ గ్రామ బడిపిల్లలు పాత ఛాందస పద్ధతినే వ్రాయుచుందురు ఆ పని పలకలను, కాగితములను ఖరాబుచేయుటయే యని నా యభిప్రాయము.

హరిజన్ : 28-8-'37.

# 6

## నయీ తాలీమ్ వలని ఫలితము

[వార్ధాలోని హిందూస్థానీ తాలిమీసంఘ ప్రచురణ "నయీ తాలీమ్" అను మాసపత్రికా ప్రారంభ సమయమున గాంధిజీ పంపిన సందేశము — సం.]

నయీ తాలీమ్ (నూతనవిద్య) లోని క్రొత్తదనమేదో మనము తెలిసికోవలెను. పాతవిద్యా పద్ధతిలోని మంచి యంతయు నయీతాలీమ్‌లోనికి తీసికొనబడును. క్రొత్తవిషయములు కూడ అనేకములుండును. నయీతాలీమ్ నిజముగ క్రొత్తదే అయినచో అది ఈక్రింది ఫలితాలను ఈయవలెను: మనకు పట్టిన నిస్పృహ అంతరించి ఆశ ఉదయించవలెను. మన దారిద్ర్యము, కరువుపోయి తగినంత జీవనోపాధి కలుగవలెను. నిరుద్యోగముపోయి పని, పరిశ్రమ వర్ధిల్లవలెను. వైరభావము నశించి మైత్రి యేర్పడవలెను. అది మన బిడ్డలకు చదువుట వ్రాయుటయే గాక, జ్ఞానసంపాదనకు సాధనభూతమగు ఒక చేతి పరిశ్రమనుగూడ నేర్పగలుగును.

ఉట్మాంజీ : 14-10-'38.

# రెండవ భాగము : బేసిక్ విద్యా సమావేశము

# 7

## విద్యా సమావేశములో ఆలోచనీయాంశములు

వార్ధాలో నవభారత విద్యాలయమను మర్వాడీ హైస్కూలు 25వ వార్షికోత్సవమును జరుపుకొనుచున్నది. నేనీమధ్య ప్రతిపాదించుచున్న విద్యా ప్రణాళికను చర్చించుటకుగాను జాతీయభావములుగల విద్యావేత్తల సమావేశమొకటి ఈ సమయములో జరుపవలెనని పాఠశాల నిర్వాహకులు తలచినారు. కార్యదర్శి శ్రీమన్నారాయణ అగర్వాల్ అట్టి సమావేశముయొక్క ఆవశ్యకతనుగూర్చి నాతో సంప్రదించి, నా కంగీకారమైతే సమావేశమునకు నన్నధ్యక్షుడుగ నుండుమని కోరెను. నే నందుల కంగీకరించినాను. అక్టోబరు 22, 23 తేదీలలో ఆ సభ వార్ధాలో జరుగనున్నది. ఆహ్వానితులు మాత్రమే దానికి హాజరగుదురు. ఈ విషయమునం దత్యంత ఆసక్తియుండి, చర్చలో ఉపయుక్తమైన సలహాల నీయగల వారికి మాత్రమే ఇందు పాల్గొనుట కవకాశ మీయబడినది. బాహ్య ప్రదర్శనముకోసము ఉద్దేశింపబడినది ఇందేదియు లేదు. ఇందు ప్రేక్షకులుండరు. ఇది కేవలము కార్యాలోచన

సమావేశము. పత్రికా విలేఖరులకు కొద్ది టికెట్లు ఇయ్య బడును. విలేఖరులు ఒక రిద్దరు ప్రతినిధులను మాత్రమే పంపి, వారిద్వారా సభావృత్తాంతమును సేకరింపదగునని నా సలహా.

విశ్వాస వినమ్రతలతోను, నిష్కపట హృదయముతోను నే నీకార్యమున దిగుచున్నాను. అవసరమునుబట్టి నాయభి ప్రాయములను సరిదిద్దుకొనుచు క్రొత్త విషయములను నేర్చు కొనుటకు నేను సంసిద్ధుడను.

నా కిప్పటికి తోచినంతవరకు సభలో యోచింపదగిన విషయము లివి :

1. ప్రస్తుత విద్యావిధానము ఏ విధముగను, ఎంతమాత్ర మును దేశావసరములను తీర్చునదిగా లేదు. ఉన్నతవిద్యా బోధయంతయు ఇంగ్లీషులో జరుగుటచేత, కొలదిమంది విద్యాధికులకును అసంఖ్యాకులగు పామరజనులకును మధ్య శాశ్వతమైన అఖాత మేర్పడి, ప్రజానీకమునకు విద్య అంట కుండ జేసినది. ఇంగ్లీషు కీయబడిన అత్యధికప్రాముఖ్యము ఆ విద్య నేర్చినవారి జీవితాలను మానసికముగ మోడువార జేసి, స్వదేశమునందే వారిని పరాయివారుగ చేసినది. వృత్తి విద్య లేకుండుటచే నిర్మాణాత్మకమగు ఏ పనికిని వారిని పనికి రాకుండ జేసి, శక్తిహీనులుగగూడ చేసినది. ప్రాథమికవిద్యకై చేయబడుచున్న ఖర్చువృథా. పిల్లలకు నేర్పబడు ఆకొంచెము

విద్య గ్రామములకుగాని, పట్టణములకుగాని పనికిరాని దగుటచే, వారు దానిని త్వరలో మరచిపోవుదురు. ప్రస్తుతవిద్య వలన లాభమేదైన ఉన్నచో, అది ముఖ్యముగ పన్నులు చెల్లించు సామాన్యతరగతికి కలుగుటలేదు. వారి బిడ్డలకు ఇందువల్ల కలుగుచున్న ప్రయోజనము అతి స్వల్పము.

2. ప్రాథమికవిద్యకు ఏడేండ్లైనను కాలపరిమితి ఉండవలెను. ఇంగ్లీషును మినహాయించి మెట్రిక్యులేషన్ వరకుగల సామాన్య జ్ఞానమంతయు, ఉపయుక్తమగు వృత్తివిద్య యొకటియు గరప బడవలెను.

3. బాలబాలికల సమగ్రాభివృద్ధికి గాను, వీలైనంతవరకు ఆదాయము నిచ్చు వృత్తి విద్యద్వారా శిక్షణనీయవలెను. అనగా, వృత్తివిద్య రెండువిధాల ఉపయోగపడవలెను: విద్యార్థి చేయు చేతిపనివలన తన శిక్షణకగు వ్యయమును సంపాదించిపెట్టుట యొకటి. విద్యాలయమున నేర్చుకొన్న వృత్తివిద్యతో విద్యార్థులు పూర్ణమానవులుగ తయారగుట రెండవది.

పాఠశాల స్థలము, భవనములు, తదితర పరికరములు, వీనికగు ఖర్చుకూడ విద్యార్థుల పనిద్వారా రావలెనని కాదు.

దూది, ఉన్ని, పట్టుపరిశ్రమ తాలూకు అన్ని పనులు, అనగా సంగ్రహించుట, బాగుచేయుట, గింజలుతీయుట, (ఇవి ప్రత్తివిషయములో) ఏకుట, నూలుతీయుట, రంగులువేయుట,

ఆసు పోయుట, పడుగుచేయుట, జములుపోగు పేనుట, అంచులు, 'డిజైనులు' కట్టుట, నేత, అద్దకము, దుస్తులు కుట్టుట, కాగితపు పరిశ్రమ, పుస్తకముల బైండు, కోత, కొయ్యపెట్టెలు, ఆటవస్తువుల తయారు, బెల్లము పరిశ్రమ— ఇవన్నియు నిర్వివాదములగు గ్రామవృత్తులు. సులువుగ నేర్వ దగినవి, విశేష పెట్టుబడి కోరనివి.

విద్యార్థులు నేర్చుకొన్న వృత్తివిద్యనుబట్టి ప్రభుత్వము వారికి విధిగా పని కల్పించుటగాని, తయారైన వస్తువుల ధరలను నిర్ణయించి ప్రభుత్వము తీసుకొనుటగాని జరిగినచో విద్యార్థులు తమతిండి తాము సంపాదించుకొనగలరు.

4. వివిధపరిశ్రమలకు, సాంకేతిక కళలకు సాహిత్యమునకు, లలితకళలకు సంబంధించి, దేశావసరములను తీర్చు ఏయున్నత విద్యగాని ప్రయివేటు సంస్థలకు వదలిపెట్ట బడవలెను.

రాష్ట్ర విశ్వ విద్యాలయములు కేవలము పరీక్షలను జరుపుచు, పరీక్ష రుసుములవలన వచ్చు ఆదాయముతో స్వయం పోషకములు కావలెను.

విశ్వవిద్యాలయములు మొత్తము విద్యాశాఖనంతను పర్య వేక్షణచేయుచు, వివిధశాఖలలోని పాఠ్యక్రమమును నిర్ణ యించి అమలుపరచును. విశ్వవిద్యాలయపు ఆమోదము లేనిదే ఏ ప్రయివేటు స్కూలుగాని నెలకొల్పబడరాదు. నమ్మకస్థులు, సమర్థులుగ ఋజువుకాబడిన ప్రముఖులతో

ఏర్పడిన ఏ సంస్థలకైనను విశ్వవిద్యాలయాధికార పత్రములు విరివిగ ఈయబడవలెను. అయితే ఇందువలన ప్రభుత్వమున కెట్టి వ్యయమును కారాదు. కేంద్రవిద్యాశాఖ ఖర్చుమాత్రము ప్రభుత్వము భరించును.

ప్రభుత్వావసరములకు అవసరమగు ప్రత్యేక విద్యాకేంద్రములు నడుపు బాధ్యతను ప్రభుత్వమే వహించును.

ఈ ప్రణాళిక అంతయు ఆమోదింపబడినచో రాజ్యమునకు సంబంధించిన అతిముఖ్య సమస్య అనగా జాతియొక్క భావినిర్మాతలగు యువకుల శిక్షణనుగూర్చిన సమస్య పరిష్కరింపబడినట్లే.

హారిజన్ : 2-10-'37.

# 8

# ప్రధాన సమస్య

[1937 అక్టోబరు 22, 23 తేదీలను వార్ధాలో జరిగిన విద్యాసభలో గాంధిజీ యిచ్చిన ప్రారంభోపన్యాసము.]

ఆహ్వానముల నందుకొని దయచేసిన వారందరికిని నావందనములు. నేనిచట అధ్యక్షుడనైనను సభ్యుడనైనను, నా ప్రతిపాదనలకు మీ సలహాలను (ముఖ్యముగ మీలో వ్యతిరేకుల అభిప్రాయములను) వినుటకు నేను మిమ్ముల నాహ్వానించినాను. స్వేచ్ఛగా ధారాళమైన చర్చ జరుగవలెనని నేను కోరుదును.

నా ప్రతిపాదనలు ప్రాథమిక విద్యకును, కాలేజీవిద్యకును గూడ వర్తించును. కాని మీరు ముఖ్యముగ ప్రాథమికవిద్య విషయమే యోచించవలెను. హైస్కూలు చదువునుకూడ నేను ప్రాథమికవిద్యలో చేర్చినాను. ఎందువల్లననగా 1915 మొదలుగ పర్యటనలలో నేను చూచుచున్న అనేక గ్రామము లందు విద్యయనబడునది గ్రామ బాల బాలికలలో అత్యల్ప సంఖ్యకుమాత్రమే లభించుచున్నది. విద్యనెరుగని లక్షలాది గ్రామ బాల బాలికలనుగూర్చియే ముఖ్యముగ నేనిట మాట్లాడుచున్నాను. వందలకొలది కాలేజీ విద్యార్థులతో నాకు పరిచయమున్నది. మాకు హృదయపూర్వకమగు సంభాష ణలు, ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవి. వారి యవసరములు, వారిదోషములు, రోగములు నాకు తెలియును. కాని కాలేజీ విద్యనుగూర్చి మాత్రము నా కనుభవములేదు. ప్రస్తుతము ప్రాథమిక విద్యనుగూర్చి మనము యోచించిన చాలును. ఎందుకనగా, ఈ ముఖ్యసమస్య పరిష్కారమైనచో, దీనిని బట్టి కాలేజీ విద్యాసమస్యకూడ పరిష్కారమగును.

## చేతిపనిద్వారా విద్యాభ్యాసము

ప్రస్తుత ప్రాథమిక విద్యాపద్ధతి వ్యర్థమేకాక హానికరమని గూడ నా నిశ్చితాభిప్రాయము. ఎందరో బాలురు తల్లి దండ్రులకును, ఇంటి వృత్తికిని పనికిరాకుండ పోవుచున్నారు. దురభ్యాసాలకులోనై, పట్నవాసపు వేషభాషల ననుకరించు

చున్నారు. వారు నేర్చునది మరే మనదగునో కాని, విద్య మాత్రముకాదు. వృత్తి లేక చేతిపరిశ్రమద్వారా విద్యగరపుటయే దీనికి నివారణోపాయము. నాకిందు కొంత అనుభవమున్నది. దక్షిణాఫ్రికా టాల్‌స్టాయి ఫారములో నా కుమారులు, వివిధమతకులములకు చెందిన మంచివాళ్లు చెడ్డవాళ్లు అయిన తదితరులు ఉండిరి. వారికి వడ్రంగము చెప్పుల తయారు మొదలగు చేతిపనులద్వారా విద్య నేర్పితిని శ్రీకాలెంబాష్ పై రెండుపనులను తాను నేర్చుకొనివచ్చి నాకును నేర్పెను. అనేక ఇతరపనులుండి, నా కిందుకు సమయము చాలెడిది కాదు. కనుక ఈ శిక్షణ నాకును, వారికిని పూర్ణమగు సంతృప్తి నీయలేదు. అయినను ఈ విద్యవలన వారికెట్టి నష్టమును కలుగలేదని నా నమ్మకము.

నే నిచ్చు ప్రాధాన్యత కేవలము వృత్తులకుకాదు, చేతిపనుల మూలమున నేర్పబడు విద్యకు. అనగా, సాహిత్యము, చరిత్ర, భూగోళము, గణితము, ప్రకృతిశాస్త్రము మొదలగు విషయములు యావత్తు చేతిపనిద్వారా గరపబడవలెను. మధ్యయుగములో చేతిపని తప్ప ఏదియు నేర్పబడలేదని చెప్పి కొందరు ఆక్షేపించవచ్చును. అయితే అప్పటి వృత్తులకు విద్యాప్రాముఖ్యములేదు. ఈ నాటివారు కుటుంబ వృత్తులను మరచిపోయి, లేఖకవృత్తిలోచేరి, గ్రామసీమలకు దూరస్థులైనారు. కనుక ఎక్కడచూచినను గ్రామములలో ఒకమంచి

వడ్రంగికాని, కమ్మరికాని లభించుట దుర్లభము. చేతిపను లంతరించినవనియే చెప్పవచ్చును. ఇక్కడ నిర్లక్ష్యముచేయ బడిన శాల్నము లంకషైరుకు కొనిపోబడి, అక్కడ వృద్ధిగాంచి నది. యంత్రపరిశ్రమలనుగూర్చి నాయభిప్రాయముల నటుండ నిండు పరిశ్రమల నింతగా వృద్ధిచేసికొన్న ఆంగ్లేయులబుద్ధి యుక్తులు ప్రశంసనీయములు.

తకిలీ – నిర్మాణాత్మకమైన ఆటవస్తువు

వృత్తిని ఒకకళగాను శాస్త్రముగను దృష్టాంత పూర్వ కముగనేర్పుచు, తద్వారా మిగత విషయములన్నిటిని బోధించు టయే దీనికి సాధనము. ఉదాహరణ : తకిలీవడుకు నేర్పుటతో పాటు వివిధరకముల ప్రత్తి, ఇండియాలో రకరకముల నేలలు, ఈ పరిశ్రమ ఇక్కడ ధ్వంసముచేయబడిన చరిత్ర, దీని వెనుకనున్న రాజ్యాంగకారణములు (ఇందు బ్రిటిషు ఇండియా రాజ్యచరిత్రకూడ వచ్చును) గణితశాస్త్రము మొదలగు విషయములన్నియు చెప్పవలసి యుండును. నా చిన్న మను మనిపై నే నీప్రయోగమును చేయ యత్నించుచున్నాను. తనకేదో బోధచేయబడుచున్నదను స్పృహయే వానికిలేదు. ఆడుచు, నవ్వుచు, పాడుచునే వాడీ విషయములు గ్రహించు చున్నాడు.

నే నిచట ముఖ్యముగ తకిలీని ఉదహరించుటకు కారణ మున్నది. దానినిగూర్చి మీరు నన్ను ప్రశ్నలడుగ గోరు

మును. వానితో నాకు దగ్గర సంబంధమున్నది. దాని అద్భుత శక్తిని నేనుచూచితిని. ఖర్చులేనివస్తువది. వస్త్రనిర్మాణ పరిశ్రమ ఒక్కటే అందరికి నేర్పదగియున్నది. దాని విలువ నదిపూర్తిగ సార్థకపరచుకొన్నది. దేశములో నిర్వహింపబడిన నిర్మాణకార్యక్రమ ఫలితముగ ఏడు రాష్ట్రములందు కాంగ్రెసు మంత్రివర్గములేర్పడినవి. వానిని మనము బాగుగ నిర్వహింపగలుగునంతే మట్టుకే మంత్రివర్గముల కార్యక్రమము కూడ విజయవంత మగును.

ప్రాథమిక విద్యకు నేను పెట్టిన పరిమితి ఏడేండ్లు. తకిలీకి సంబంధించి. వస్త్రనిర్మాణములో మంచి అనుభవజ్ఞానము సంపాదించుటతో అది పూర్తియగును. నేయబడు వస్త్రమును ఖరీదుచేయువారు సిద్ధముగనే యుందురు.

విద్యార్థుల చేతిపనినుండి వచ్చు ఆదాయముతో ఉపాధ్యాయుని జీవనభృతి లభించవలెను. ఇందు విషయమై నేను తీవ్రముగ యోచించుచున్నాను. కోట్లకొలది పిల్లలకు విద్యాసౌకర్యము కలిగించుటకు దీనిని మించిన మార్గము లేదని నాదృఢవిశ్వాసము. కావలసిన ధనము చేకూరువరకుగాని, వైస్రాయి మిలటరీ వ్యయము తగ్గించువరకుగాని మనము వేచియుండలేము. పారిశుధ్యము, ఆరోగ్యము, మంచి ఆహారము, స్వాయం సహాయము, ఇంట తల్లిదండ్రులకు తోడ్పడుట మొదలగున వన్నియు ఈ ప్రారంభ విద్యలో కలసియున్నవని గమనింతురు

గాక! ఇప్పటి బాలురకు శుభ్రత, స్వాయం సహాయము అన నేమో తెలియదు, వారు దుర్బల శరీరులుకూడ. కనుక సంగీతము, కవాతు మొదలగు వానిద్వారా శరీరపరిశ్రమను నిర్బంధము చేయవలెను.

## ఏకైక మార్గము

సాహిత్యవిద్యకు వ్యతిరేకినను నిందయొకటి నాపైనున్నది. కాని ఈమాట సత్యముకాదు. సాహిత్యమునునేర్పు సరియైన పద్ధతి కనబరచవలెననియే నా యుద్దేశము. విద్యయొక్క స్వాయంపోషక విషయమునగూడ నా కెదుర్పాటు వచ్చినది. ప్రాథమిక విద్యపై కోట్లకొలది ధనము పెట్టవలసియుండగా, పిల్లలచే వెట్టిచాకిరి చేయించుట అక్రమమని వారి యుద్దేశము డబ్బు దుర్వ్యయమగునని కూడ వారి భయము. ఇది అనవసర భయమని అనుభవము చెప్పుచున్నది. పిల్లలను కష్టపెట్టి పని చేయించుటను గూర్చి ఒక మాట: వారిని విపత్తునుండి కాపాడుట గూడ వారిని కష్టపెట్టుటయేనా ? అని నా ప్రశ్న. తకిలీ చక్కని ఆటవస్తువు. ఉత్పత్తికూడ చేయు వస్తువగుటచే అది ఆటవస్తువు కాకపోదు. ఇప్పటికికూడ పిల్లలు తల్లిదండ్రుల పనిపాటులలో సాయపడుచునే యున్నారు. సేగాన్‌లో పిల్లలకు వ్యవసాయమునుగూర్చి నాకంటె బాగుగ తెలియును. తల్లిదండ్రులతో కలసి పొలము పనికి పోదురు. నూలు వడికి తల్లిదండ్రులకు సాయపడునట్లు పిల్లవానిని ప్రోత్సహించినచో,

వాని దృష్టి అంతటితో ఆగదు. తన ఇల్లేకాక, తన గ్రామము, దేశముకూడ తనవేయని, వారియెడల తనకు బాధ్యత లున్న వని తెలిసికొనును. ఇదొక్కటే మార్గము. బిడ్డలకు విద్యను బిచ్చముగ పార వేయుట వలన వారిని నిస్సహాయులుగ చేసి వేయుదురని నేను మంత్రులకు చెప్పదలచుకొన్నాను. తమ విద్యకగు ఖర్చును స్వయంకృషిద్వారా సంపాదించి యిచ్చుట వలన విద్యార్థులు ఆత్మవిశ్వాసులు, ధైర్యశాలురు అగుదురు.

ఈ విధానము హిందూ, ముసల్మాన్, పార్శీ. క్రైస్తవా దులందరికిని సమానముగ వర్తించును. మతబోధను గూర్చి నే నెందుకు నొక్కి చెప్పుటలేదని కొందరడిగినారు. స్వయం సహాయమను అనుభవపూర్వక మతమును బోధించుచునే యున్నానని నా జవాబు.

## నిర్బంధసేవలో చేర్చుట

శిక్షణపొందిన విద్యార్థులందరికిని, కావలసినచో, ప్రభుత్వము పని చూపించవలసినదే. ఉపాధ్యాయుల విషయమున ప్రొఫెసరు షా నిర్బంధ విధానమును సూచించినారు. ఇటలీ మొదలగు దేశముల దృష్టాంతముల నిచ్చి, ఆయన దాని విలువను నిరూపించినారు. దేశసేవకుగాను ఇటలీ యువకులను ముసోలినీ తయారుచేయ గలిగినపుడు మనమేల చేయలేము? యువకులు వృత్తిలో ప్రవేశించకముందు ఒకటి రెండేండ్లు

విధిగా దేశసేవకీయమని చెప్పుట వారిని బానిసలను చేయుట యగునా? కడచిన 17 సంవత్సరములలో మన యువకులు స్వాతంత్ర్యోద్యమ విజయమున కెంతో పనిచేసి యుండలేదా? ఒకయేడు దేశసేవకీయవలసినదిగ నేను వారిని హెచ్చరించుచున్నాను. దీనికి ప్రభుత్వశాసన మవసరమగుచో, ప్రజాప్రతినిధుల ఆమోదముతో జరుగును కనుక అది బలాత్కారము కాజాలదు.

కనుక చేతిపని మూలమున విద్య చెప్పు పద్ధతి మీకు నచ్చినదా యని నా ప్రశ్న. విద్యయొక్క స్వయంపోషకత్వము దాని సత్తాను ఋజువుపరచగలదని నా యభిప్రాయము. ఏడేండ్లు శిక్షణ పూర్తి యగుసరికి, పిల్లలు తమ శిక్షణకయిన ఖర్చును తాము భరించి యుండగలరు. అప్పటికి వారు సంపాదనపరులై కూడ ఉందురు.

కాలేజీవిద్య చాలవరకు పట్టణములకు సంబంధించిన విషయము. నేటి ప్రాథమిక విద్యావిధానము నిరర్థకమయినంతగ కాలేజీవిద్య కూడ అయినదని నే ననను. కాని దాని పరిస్థితులుగూడ ఆశాభంగకరముగ నున్నవి. ఏయొక్క పట్టభద్రునికిగాని ఉద్యోగ మెందుకు లేకుండపోవలెను?

తకిలీ ముఖ్యమైన ఉదాహరణముగ ఎందుకు తీసికొనబడినదనగా దానిలో మంచి అనుభవజ్ఞానముగల శ్రీ వినోబా మన సందేహములను తీర్చుటకు ఇక్కడనే యున్నారు. మనకు

తెలియని తాత్విక విషయములను చెప్పుటకు శ్రీ కాకా కవే ల్కారుకూడ ఇక్కడ నున్నారు. ఆరమ్‌స్ట్రాంగ్ వ్రాసిన "బ్రతుకు తెరువు చూపువిద్య" అను గ్రంథమును, ముఖ్యముగ అందలి "హస్తనైపుణ్య విద్య" అను అధ్యాయమును నా దృష్టికి తెచ్చినాడాయన. కీ। శే॥ మధుసూదనదాసు ఒక లాయరు. కాళ్లు, చేతులు ఉపయోగింపబడనిచో మెదడు మొద్దుబారునని, ఒక వేళ పనిచేసినను, అది సైతాను గృహమగునని ఆయన విశ్వాసము. టాల్‌స్టాయి అనేక కథలు వ్రాసి బోధించినది యిదే.

## అహింసపై ఆధారము

గాంధిజీ తన ప్రారంభోపన్యాసమును ముగించుచు ఇట్లనెను : మనలో కులకక్షలున్నవి.—మనలో మాత్రమే అవి యున్నవని కాదు. ఇంగ్లాండులోకూడ 'రోజెస్' యుద్ధములుండినవి. బ్రిటిషు సార్వభౌమత్వ మీనాడు ప్రపంచ శత్రువైనది. కుల కక్షలు, జాతి వైరములు నిర్మూలము కావలె నన్న బలమైన, పవిత్రమైన పునాదులు కావలెను. నేను సూచించిన విద్యావిధానము ద్వారా ఈ పని ప్రారంభము కావలెను. ఇది అహింసనుండి ఉత్పన్న మగుచున్నది. సంపూర్ణ మద్యపాన నిషేధము కావలెనని ఈ దేశము తీర్మానించుకొన్న సందర్భములో నే నీ ప్రణాళికను సూచించితిని.

కాని ఆదాయము తగ్గక, బొక్కసము నిండుగా నున్నను, మన బాలురు పట్నవాసులు కాగూడదనిచో, ఈ విద్యా విధాన మొక్కటే మనకు శరణ్యము. మన దేశ సాంప్రదాయమునకు, సంస్కృతికి, ప్రతిభకు వారిని మనము ప్రతినిధులుగ చేయ వలసియున్నాము. స్వయంపోషకమగు ఈ విద్యద్వారా తప్ప మరెట్లును ఈ పని జరుగదు. ఐరోపా మనకు ఆదర్శముకాదు. హింసలో దానికి నమ్మకమున్నది. కనుక అట్టి కార్యక్రమ ములనే అది నిర్ణయించుకొనును. రష్యా సాధించిన కార్య ముల ఘనతను నే నేమాత్రమును తగ్గించను కాని ఆ నిర్మాణ మంతయు పశుబలము, హింసపై ఆధారపడి యున్నది. ఇండియా హింసను విసర్జింపదలచినచో, తాను పొందవలసిన క్రమశిక్షణకు ఈవిద్యావిధాన మొక ముఖ్యాంగము కావలెను. ఇంగ్లాండు, అమెరికా విద్యకై కోట్లకొలది ఖర్చుచేయుదురని విందుము. కాని అదంతయు పరపీడన వలన సంపాదించినదని మనము మరువరాదు. పరపీడనము నొక కళగాను, శాస్త్రము గాను వారు తయారుచేసికొన్నారు. కనుక అంత ఖర్చుతో కూడిన విద్యను వారి బిడ్డల కీయగలరు. పరపీడనమును మనము తలపునకైన రానీయలేము, రానీయము. కనుక అహింసపై ఆధారపడు ఈ విద్యావిధానమును మించినది మనకు మరొకటి లేదు.

హరిజన్ : 30-10-'37.

# 9

## యంత్రయుగము

అపరాహ్న సమావేశమును ప్రారంభించుచు, గాంధిజీ కొన్ని విమర్శలకు సమాధానము లిచ్చెను. ఆయన ఇట్లనెను : తకిలీ ఒక్కటే వస్తువనికాదు. ప్రజలందరును ఉపయోగించ గల వస్తువ దొక్కటే. కాగితము, తాటిబెల్లము మొదలగు పరిశ్రమలుకూడ ఉన్నవి. ఏ చేతిపని ఏ పాఠశాలకు పనికి వచ్చునో చూడవలసినపని మంత్రులది. యంత్ర వ్యామోహ మున బడినవారికి నాదొక హెచ్చరిక : యంత్రప్రాముఖ్యము వలన మనుష్యులే యంత్రములుగ మారిపోగల అపాయ మున్నది. యంత్రయుగములో బ్రతుకదలచినవారికి నా పథ కము నిరూపయోగము. యంత్రములతో గ్రామస్థులను బ్రతి కించుట అసంభవమనికూడ నేను వారికి చెప్పవలెను. దేశమున ముప్పదికోట్ల సజీవయంత్రములుండగా నిర్జీవయంత్రములకై దేవులాడుట అర్థములేనిపని. ఈ ప్రణాళికయొక్క మూల తత్వమెట్లున్నను, విద్యాదృష్టిలో అది బాగుగనే యున్నదని జకిర్ హుస్సేన్ గారన్నమాట సరికాదు. 'ప్రోజక్టు' విధానము నకును, నా విధానమునకును చాల భేదమున్నదని ఒకరనిరి. ఇదినచ్చని వారెవరును దీనిని ఆమోదింపరాదు. మనవారు గట్టిగ పనిచేసినచో, బానిసలుగాక, పూర్ణులగు కళానిపు ణులు ఈ పాఠశాలలనుండి బయలుదేరుదురు. పిల్లలకీయబడు

ఏ పనిదైనను విధిగా గంటకు రెండుకానుల ఆదాయము తేవలెను.

నా యందలి గౌరవముచొప్పున మీరు దేనినిగూడ స్వీకరింపవలదని నా హెచ్చరిక. మృత్యుద్వారమును సమీపించుచున్న నేను నా భావముల నితరులపై రుద్దవలెనని కలనైన కోరను. ప్రాజ్ఞతతో పూర్తిగా యోచించిన మీదటనే ఈప్రణాళిక ఆమోదింపబడవలెను. మరల కొలదికాలముననే ఇది మూలబడరాదు. నిరుద్యోగులకు పని చూపించలేని ప్రభుత్వమెందుకును పనికిరాదన్న ప్రొఫెసరు షాగారి మాటతోనే నేకీభవింతును. బిచ్చము పారవేయుటవలన నిరుద్యోగము అంతరించదు. అందరికిని పనికల్పించి, అన్నము పెట్టుటయే నా విధానము. తినుచు, త్రాగుచు, విలాసముతో బ్రతుకుటకు దైవము మనలను సృష్టించలేదు. చెమటకారునట్లు పని చేసి మనము తిండి సంపాదించుకోవలెనని ఆయన యుద్దేశము.

హరిజన్ : 30-10-'37.

# 10

## విద్యాసమావేశము

### తీర్మానములు

సభయొక్క రెండవ (చివరి) దినమున ఆమోదింపబడిన తీర్మానములు :

(1) దేశమంతటను ఏడేండ్ల ఉచిత నిర్బంధవిద్య ఏర్పాటుచేయబడవలెనని ఈ సభవారి యభిప్రాయము.

(2) విద్యాబోధ మాతృభాషద్వారానే జరుగవలెను.

(3) ఏడేండ్ల పొడుగునను ఉత్పత్తినిచ్చు ఏదో ఒక చేతిపనిద్వారా విద్య గరపబడవలెను. పిల్లల వాతావరణమునకు అనుకూలించు చేతిపనులనే ఎన్నుకొనవలెను. విద్యార్థిలో వృద్ధికావలసిన ఇతరశక్తులు, అతడు పొందవలసిన శిక్షణ, విద్యార్థి యెన్నుకొను ప్రధానవృత్తికి పూర్తిగ సంబంధించియుండవలెను. మహాత్మాగాంధిజీచేసిన పై సూచనలను ఈ సభ ఆమోదించుచున్నది.

(4) ఉపాధ్యాయుల వేతనములను ఈ విద్యాపద్ధతిద్వారా క్రమశః సంపాదించుట సాధ్యమగునని ఈ సభవారు తలచుచున్నారు.

తరువాత, ఈ తీర్మానముల ననుసరించి నిర్దిష్టమగు ఒక పాఠ్యక్రమమును తయారుచేయుటకును, ఒక నెలలోగా సభాధ్యక్షునకు నివేదికను సమర్పించుటకును ఒక కమిటీ నియమింపబడినది.

హారిజన్ : 30-10-'37.

# 11

## సభ ముగింపు

సభకు దయచేసి నాకు సహకరించిన మీయందరికి నావందనములు. ఇది ప్రథమసమావేశము మాత్రమే. ఇట్టివి మరెన్నో జరుగవలసి యుండును. కనుక మీ సహకారము నాకింకను కావలసియుండును. మాలవ్యాగారు నన్ను మందలించుచు ఒక తంతినంపిరి. కాని, ఇది అన్వేషకుల సభయగుటచే, ఇవి తుది నిర్ణయములు కావని, సలహాలకును విమర్శలకునుమాత్రమే

విద్యాభిమానులు ఆహ్వానింపబడిరని, బదులువ్రాసి, వారి బాధను పోగొట్టితిని. ఉద్రేకముతో ఏపనినిగాని పూర్తిచేసి కొను ఉద్దేశము నా కెన్నడును లేదు. జాతీయవిద్య, మద్య పాననిషేధము—ఈ రెండు సమస్యలును అసహాయోద్యమ ప్రారంభమునుండియు వచ్చుచున్నవే. దేశములో కలిగిన మార్పులనుబట్టి ఈ విషయమీరూపమున నాకు గోచ రించినది.

హరిజన్ : 30-10-'37.

# 12

## ఒక ముందడుగు

నా విద్యాప్రణాళికను ప్రజల యెదుటను, కాంగ్రెసు మంత్రుల యెదుటను పెట్టుటలో ఈ విద్యాసభ ఒకమెట్టు. ఇందరు మంత్రులు సభకుహాజరగుట శుభదాయకము. స్వయం పోషకవిషయమును నే నెంత తక్కువలో బెట్టినను అభ్యంతర ములు, విమర్శలు దానినిగూర్చియే వచ్చినవి. కనుక నే సభా తీర్మానము అతి జాగరూకతతో చేయబడినది. సభానిర్వాహ ణముకష్టపరిస్థితుల నెదుర్కొనవలసి యుండెననుట స్పష్టము. ఇంతకు ముందెన్నడును ఇట్టి విషయవిచారణ జరిగియుండ లేదు. ఇందు మంచియున్నచో అది ఆచరణలోనికి రానే వచ్చును. స్వయంపోషక విషయమున విశ్వాసమున్నవారు, ఆ ప్రకారము పాఠశాలలను నడిపి చూపవలెను.

ఇంగ్లీషును తీసివేసి, హైస్కూలు విద్యతోసహా, ఒకచేతి పనిద్వారా సంపూర్ణ ప్రాథమికవిద్యను గరపు విషయములో తగినంత ఏకీభావము కుదిరినది. బాలబాలికల శక్తులన్నిటిని చేతిపనులద్వారా పెంపొందించుటవలన సహజముగ పాఠశాలలకు యంత్రాగారముల దుస్థితిపట్టదు. ఎందువల్లననగా, వృత్తివిద్యలో కావలసినంత నిపుణత సంపాదించుటకుతోడు బాలబాలికలు ఇతర పాఠములందుకూడ సరిసమానమగు యోగ్యత సంపాదింపవలసి యుండును.

ప్రణాళికను అమలుపరచుట యెట్లో, ఏయేట బాలబాలికలు నేర్వవలసిన పాఠ్యక్రమమెట్టిదో డాక్టరు జకీర్ హుస్సేన్ కమిటీవారు విశదపరచెదరు.

సభాతీర్మానము లిట్లుండునని ముందే తెలిసిపోయెనన్నట్లు ఒక ఆక్షేపణవచ్చెను. ఈ విమర్శలో విలువలేదు. విచక్షణ లేక, అక్కడక్కడి విద్యావేత్తలనందరిని సభకు ఆహ్వానించుట అసంభవము. వారిదృష్టిలో ఇది తలక్రిందు విద్యాపథకము కనుక, దీనినిగూర్చి వారి యభిప్రాయములు అప్పటికప్పుడు తెలుపమనుట అసంగతము. కనుక ఉపాధ్యాయులుగ వృత్తివిద్యతో ఏ కొంత సంబంధమో కలవారికిమాత్రమే ఆహ్వానములు పంపబడెను. జాతీయ విద్యాక్షేత్రమున పని చేయుచున్నవారుకూడ ఈ కొత్త ఆలోచనయెడల ఎంతవరకు సానుభూతి చూపుదురో నాకు తెలియకుండెను. ఈ ప్రణాళి

కను జఖిర్ హుస్సేన్ కమిటీద్వారా ఒక నిర్దిష్టరూపము ఏర్ప డినపిమ్మట, దానినిగూర్చి యోచించుటకు ఇతర విద్యా వేత్తలుగూడ ఆహ్వానింపబడుదురు. సహాయకరములగు సల హాల నీయదలచిన విద్యాధికులందరు తమ సలహాలను వార్ధాలో కమిటీకార్యదర్శి (శ్రీ) ఆర్యనాయకం గారికి పంపవేడుదురు.

సభలో మాట్లాడినవారిలో ఒకరు పిల్లల శిక్షణకు పురు షులకంటె స్త్రీలు, కన్యలకంటె తల్లులు ఎక్కువ ఉపయోగ పడుదు రన్నారు. మరియొక విధమున కూడ ప్రొఫెసరు షా గారి నిర్బంధసేవా ప్రణాళికకు జవాబిచ్చుటకు నాకంటె వారికే ఎక్కువ అర్హత యున్నది. తీరికయు దేశభక్తియుగలస్త్రీలు ఇట్టి మహోద్యమములో సేవచేయుట కిదియొక గొప్ప అవకా శము. వా రట్లు ముందుకు వచ్చినచో, వారు కొంత ప్రారంభ శిక్షణ పొందవలసియుందురు. తిండిలేక వృత్తికొరకు వెదకు లాడు స్త్రీలు, జీవనోపాధికై ఇందు చేరుటవలన ప్రయోజన ముండదు. ఇందు పాల్గొనదలచినవారు పవిత్ర సేవాదృష్టితో, దీనిని వారి జీవిత కార్యముగ చేసికోవలెను. స్వార్థముతో ఇందు చేరువారు విఫలులై చాల ఆశాభంగమును పొందు దురు. సంస్కారులగు భారత స్త్రీలు, ముఖ్యముగ తమ బిడ్డలద్వారా గ్రామస్థులతో ఒకటై వారి సేవచేసినచో, గ్రామ జీవితమునందు శాంతియుతమగు గొప్ప విప్లవమును తీసికొని రాగలరు. మరి వా రిందుకు పూనుకొందురా ?

హరిజన్ : 30-10-'37.

# మూడవ భాగము
# స్వయంపోషక విద్య
## 13
## విద్య × మద్యపానపు రాబడి

మద్యపానపు రాబడి పోయినచో విద్యాశాఖ నడచుట యెట్లను సమస్య బయలుదేరుట చాల దురదృష్టము కొత్త పన్నులు రాబట్టు మార్గములు లేకపోలేదు. ప్రొఫెసర్లు షా, ఖంబట్టా గార్లు, ఈ దరిద్రదేశములోకూడ క్రొత్తపన్నులు వేయవచ్చునన్నారు. అట్టి యవకాశముండుట నిజమే. ధనికులపై తగినన్ని పన్ను లిప్పుడు లేవు. ముఖ్యముగ మన దేశములో వ్యక్తులవద్ద వల్లమాలిన ధనము పోగుపడుట ఇండియా ప్రజల యెడల అపరాధముగ నెంచబడవలెను. ఇంగ్లాండులో ఒక హద్దును మించిన సంపాదనపై నూటికి 70 చొప్పున పన్ను విధింపబడునట. ఇండియాలో అంతకుమించికూడ ఆ పన్ను వేయవచ్చును. చావు సుంకములు ఎందుకుండరాదు ? వయస్సు వచ్చిన యువకులు కోటీశ్వరులగు తండ్రుల ఆస్తికి వారసులగుటయే అక్రమము. అది ప్రజకు రెండు విధాల నష్టము. నిజముగ ప్రజకు సంక్రమించవలసిన ఈ వారసత్వము వారికి రాకుండ పోవుచున్నది. ఆ తండ్రి కుమారుడు ధనభారముకింద నలిగిపోవుటచే వాని శక్తులు వికసింపక పోవుటయు సంఘమునకు నష్టమే.

విద్యలో మనజాతి చాల వెనుకబడి యున్నది. కేవలము డబ్బుపై విద్య ఆధారపడినచో అనుకున్న వ్యవధిలోపల మన బాధ్యతను నెరవేర్చుకోలేము. కనుక విద్య స్వాయం పోషకము కావలెననుచున్నాను. పిన్నపెద్ద లందరి మనశ్శరీర ములను ఆత్మలను వికసింపజేయుటయే విద్యయొక్క ఆశయము. అక్షరజ్ఞానము విద్యకు గమ్యముకాదు, ప్రారంభమునుకాదు. వివిధ సాధనములలో అదొకటి. కనుక ఉపయుక్తమగు ఒక చేతిపనిని నేర్పుటతో నేను విద్యను ప్రారంభింతును. మొదటి నుండియు పిల్లలు ఉత్పాదక శక్తిని కలిగియుందురు. ఇట్లు ప్రతి పాఠశాలను స్వాయంపోషకము చేయవచ్చును. విద్యా ర్థులు తయారుచేయు వస్తువులను ప్రభుత్వము తీసికొనవలెను.

అట్టి విద్యావిధానముక్రింద మహోన్నతమైన మానసికాభి వృద్ధి సాధ్యమని నా యభిప్రాయము. అయితే అందు ప్రతి చేతి పరిశ్రమయు ఈనాటివలె యంత్రవతుగా గాక, శాస్త్రీ యముగ నేర్పబడవలెను. అనగా ఏపని ఎట్లు, ఎందులకు చేయవలెనో బిడ్డలకు స్పష్టము కావలెను. అపనమ్మకముతో నే నీ మాట వ్రాయుటలేదు. దీనివెనుక తగినంత స్వానుభవ మున్నది కార్యకర్తలకు నూలు వడుకుట నేర్పబడు అన్ని చోట్ల ఈ పద్ధతి పూర్తిగ అవలంబింపబడుచున్నది. నేను స్వయముగ బిడ్డలకు నేర్పిన పాదరక్షల పరిశ్రమ, నూలు పరిశ్రమకూడ మంచి ఫలితముల నిచ్చినవి. ఈ విధానములో

చరిత్ర, భూగోళము ఉండకపోవు. కాని వాటిని నోటిమాట లతో నేర్పుట ఉత్తమము. చదువుట, వ్రాయుట ద్వారా నేర్పుదానికంటె పదిరెట్లుగ ఈ పద్ధతిని నేర్పవచ్చును. గింజ లేవో, పొల్లుయేదో ముందు తెలియవలెను. పిమ్మట అక్షర ములు నేర్పవచ్చును. అప్పటికి విద్యార్థిలో కొంత అభినివేశము కూడ ఏర్పడును. ఈ ప్రతిపాదన విప్లవాత్మకమైనదే. అయినను దీనివలన విద్యార్థికెంతో శ్రమ తప్పును. కొన్ని యేండ్లవిద్యను ఒక సంవత్సరములో ముగించవచ్చును. ఇది పొదుపైన విధానము, సర్వాంగ సుందరము. చేతిపనితోపాటు విద్యార్థికి గణితముకూడ వచ్చును.

ప్రాథమిక విద్యకు నే నత్యధిక ప్రాముఖ్యము నిత్తును. ఇంగ్లీషు వినా, ప్రస్తుత మెట్రిక్యులేషన్ లోని విషయము లన్నియు అందుండును. కాలేజీ విద్యార్థులు తమ చదువు వంతను ఆకస్మికముగ మరచిపోయినను ఏనష్టముండదు. సరియైన విద్యలేక ముప్పదికోట్ల ప్రజల నావరించియున్న అజ్ఞానాంధకారముతో పోల్చినచో, కొద్ది లక్షలమంది కాలేజీ విద్యార్థులకు కలుగు నష్టము నష్టమేకాదు.

కాలేజీ విద్యను పూర్తిగ మార్చవలెను. జాతియొక్క అవసరములను తీర్చుటకే అది వినియోగపడవలెను. మెకానికల్ ఇంజనీర్లకు తదితర ఇంజనీర్లకు పట్టా లీయబడును. ఇవి

వివిధ పారిశ్రామిక సంస్థలకు చేర్చబడి యుండును. తమకు కావలసిన పట్టభద్రుల శిక్షణకు వలయు ఖర్చు ఆ సంస్థలే భరించవలెను. ఈ విధముగ తాతా కంపెనీవారు, ఇంజనీర్ల తయారు కొరకు కాలేజీని ప్రభుత్వ అజమాయిషీకింద నడుపుదురు. ఇట్లే మిల్లు సంఘములు కూడి తమకు కావలసిన పట్టభద్రుల కొరకు కాలేజీని నెలకొల్పుదురు. మిగత పరిశ్రమలకు గూడ ఇట్టి యేర్పాట్లే యుండును. వర్తకశాఖకు ప్రత్యేక కళాశాల లుండును. ఇక కళలు, వైద్యము, వ్యవసాయము మిగిలినవి. ఈనాటి కళాశాల లెన్నో స్వయంపోషకములై యున్నవి. కనుక ప్రభుత్వము వేరుగ ఈ కళాశాలలను నడుపబని లేదు. వైద్యవిద్యాలయములు యోగ్యతాపత్రములు పొందిన ఆసుపత్రులకు చేర్చబడి యుండును. ఆసుపత్రులు ఎక్కువగ ధనికుల కవసరమగుటచే, విరాళములిచ్చి, వారే వైద్యవిద్యాశాలలను పోషింపవచ్చును. వ్యవసాయ కళాశాలల పేరు సార్థకము కావలెనన్న, అవి స్వయంపోషకములు కావలెను. కొందరు వ్యవసాయ పట్టభద్రులనుగూర్చి నాకు బాధకరమగు అనుభవము కలదు. వారి జ్ఞానము అనుభవము లేని పైపై వ్యాపారము. డిగ్రీలు తీసికొని స్వయంపోషకము లగు వ్యవసాయ క్షేత్రములలో దేశమున కవసరమైన పనులు వారు నేర్చుకొని యున్నచో, తరువాత ఉద్యోగకాలములో అనుభవము లేక తమ యజమానులను బాధపెట్టనక్కర లేదు.

ఇది నా యూహాచిత్రముకాదు. మనమానసిక మాంద్య మును పోగొట్టుకొన్నచో, కాంగ్రెసు మంత్రులను, తద్వారా కాంగ్రెసును ఎదుర్కొన్న విద్యాసమస్యను ఈ నూతన ప్రణాళిక పరిష్కరించగలదు. ఇది హేతుయుక్తము, ఆచరణ యోగ్యము. బ్రిటిషుప్రభుత్వ పక్షమున ఇటీవలచేయబడిన ప్రకటనలో సదుద్దేశమున్నచో, సమర్థులగు సివిలు సిబ్బందీ సహాయముతో, మంత్రులు ఈ పథకమును ఆచరణలో పెట్ట వచ్చును. కనుక బాగుగ యోచించి ఒక నిర్దిష్టవిధానమును నిర్ణయించుట మంత్రుల కర్తవ్యము. దానిని శ్రద్ధతో అమలు జరుపుట సివిలు ఉద్యోగుల ధర్మము.

ఇక ఉపాధ్యాయుల విషయమున్నది. ప్రొఫెసరు కె. టి. షాగారి సలహా బాగున్నది. విద్యావంతులగు స్త్రీ పురుషు లను, అర్హతలనుబట్టి, నాలుగైదు సంవత్సరములు అధ్యాప కత్వముచేయునట్లు నిర్బంధించవచ్చును. వారి ముఖ్యావసరము లకు మించని జీవనభృతిని వారికీయవలెను. ఉన్నతవిద్యా శాఖలలోని ప్రొఫెసర్లు, అధ్యాపకులుతీసికొను పెద్దజీతముల పద్ధతి అంతరించవలెను. ప్రస్తుత గ్రామపాఠశాలోపాధ్యాయు లను తప్పించి సమర్థులను నియమించవలెను.

హరిజన్ : 31-7-'37.

# 14

## విద్యనుగూర్చిన తికమక

[కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడినప్పటినుండియు గాంధిజీ చేయుచువచ్చిన ప్రసంగములలో ఇదొకటి.]

"మనబిడ్డల విద్యకు కల్లు సారాయిల ఆదాయమొక్కటే గతియగుట కడు శోచనీయము. నూతన సంస్కరణముల దారుణ విధానమిది. అయినను ఈ చీకాకువలన మనము నిరుత్సాహపడరాదు. దీనిని మనమెట్లో పరిష్కరించితీర వలెను. ఏది యేమైనను మనముపెట్టుకొన్న మద్యనిషేధ ఆదర్శమునుమాత్రము వదలుకొనరాదు. మత్తుద్రవ్యముల ఆదాయము వచ్చిననేగాని, బిడ్డలవిద్య సాగదనుకొనుట చాల అవమానకరము. పిల్లలకు విద్య లేకుండపోయినను పోనిండు. కల్లు సారాయిల పెద్ద చెడుగు ముందు ఇదొక చిన్న చెడుగుగ పరిగణింపబడవలెను. ఇందునిమిత్తము తయారుచేయబడు లెక్కలనుచూచి కంగారుపడరాదు."

ఒకరి ప్రశ్న : "అయితే హైస్కూలు తరగతులను పూర్తిగ ఎత్తివేసి, మెట్రిక్యులేషన్‌తో సమానమగు విద్య నంతను గ్రామపాఠశాలలలో నేర్పుదురన్నమాటా?"

జవాబు (గాంధిజీ) : "అవును తప్పక అట్లే. హైస్కూలు విద్య అనగానేమిటి? మాతృభాషలో రెండేండ్లలోపల నేర్చు కొనగల విషయములను పరభాషతో చెప్పి, పాప మా బిడ్డ

లను బాధించుట తప్ప మ రేమిటి ? వారికీ నిర్బంధముతప్పించి కాలు చేతులను ఉపయుక్తముగ ఉపయోగించుట నేర్పితిమా, ఈ చిక్కంతయు విడిపోవును. కల్లు సారాయిల ఆదాయము మట్టుకు మీరు ముందుగ త్యజింపవలెను. విద్యానిర్వాహణ మునుగూర్చి పిమ్మట యోచించవచ్చును. పెద్దసంకల్పముతో మీ కార్యము ప్రారంభము కావలెను."

హరిజన్ : 21-8-'37.

# 15

## స్వయం పోషక విద్య

డాక్టరు ఏ. లక్ష్మీపతి గారిట్లు వ్రాయుచున్నారు :

"క్రైస్తవ ప్రచారకులు నడుపుచున్న కొన్నిసంస్థలను నేనుచూచితిని. ఉదయము పూటమాత్రమే పాఠశాలయుండును. సాయంకాలము వ్యవసాయము లేక చేతిపనులు ఉండును. విద్యార్థులుచేయు శ్రమ, చూపు నైపుణ్యమునుబట్టి వారికి కొంత ప్రతిఫల మీయబడును. ఇట్లు ఆ విద్యాలయములు ఇంచుమించు స్వయంపోషకములుగ నున్నవి. విద్య పూర్తిచేసి కొన్న యువకులు నీటియటబడ్డ చేపలవలె బాధపడరు. పనిచేసి తిండి సంపాదించుకొను స్థితిలోనుందురు. బండబారిన పాతపద్ధతిలో నడుపబడు సర్కారు పాఠశాలలకును వీటికిని పోలికయే లేదు. ఈ విద్యార్థులు ఉపయుక్తమగు కొంతపని చేయగలుగుచున్నామను తలంపుతో, సంతోషముతోను ఆరోగ్యవంతులుగను ఉందురు. వారి శరీరములుకూడ పుష్టివంతములైయున్నవి. వ్యవసాయ తరుణమున కొలది దినములు ఈ పాఠశాలలు మూయబడును. అప్పుడు విద్యార్థులు ఆపనుల కుపయోగపడుదురు. అభిరుచి కల విద్యార్థులను వివిధవ్యాపారవృత్తులకు బంపుటవలన, వారి నిత్యకార్య

క్రమములో కొంతమార్పు కలిగింపవచ్చును. కావలసినవారికిగాని, అందరికి గాని ఒకపూట భోజనముకూడ పాఠశాలలో ఏర్పాటుచేయవచ్చును. ఈ విధమున బీదవిద్యార్థులను బడికి ఆకర్షించవచ్చును. తల్లి దండ్రులును వారిని సంతోషముతో బడికిపంప గలుగుదురు.''

''ఇట్లొకపూట కార్యక్రమమును అమలులో పెట్టినచో, కొందరు ఉపాధ్యాయుల సమయము ఆయా గ్రామవయోజనుల విద్యకై వినియోగింపవచ్చును.''

''నేను మద్రాసు విద్యామంత్రిని దర్శించి ఒక వ్రాతమూలకమగు వినతినందించితిని. పాఠశాలలందు కాలనిర్ణయము సరిగాలేనందున, విద్యార్థుల ఆరోగ్యము చెడినదని అందు వ్రాసితిని. పాఠశాలలు, కాలేజీలు ఉదయము 6 మొదలు 11 వరకే పని చేయవలెనని నాయభిప్రాయము. 4 గంటల పాఠశాలచదువు చాలును. అపరాహ్నము ఇంటివద్ద గడపవలెను. సాయంకాలము ఆటలకు, శరీరపరిశ్రమకు వినియోగపడవలెను. కొందరు పిల్లలు కుటుంబపోషణకై పాటుపడవచ్చును. కొందరు తల్లిదండ్రుల వ్యాపారములో సహకరించవచ్చును. విద్యార్థులకు తల్లిదండ్రులతో ఎక్కువ సంబంధముండవలెను. కుటుంబవృత్తి వర్ధిల్లి బిడ్డలకు దానియందు అభిరుచి మెండగుటకు పై యేర్పాటు చాల అవసరము.''

''శరీరనిర్మాణమే జాతి నిర్మాణమని మనము గుర్తించినచో, పైమార్పు అవసరము. పైకిది విప్లవచర్యగా కనబడినను మనదేశాచారవనకును శీతోష్ణస్థితికిని తగినదగుటచే, చాలమంది దీని నేకోరుకొందురు.''

పాఠశాలకు ప్రొద్దుటిసమయమే మంచిదన్న డాక్టరు లక్ష్మీపతిగారి అభిప్రాయముతో నాకు ఏకీభావమే. విద్యాధికారులట్లుచేయుట మంచిది. విద్యాసంస్థలు ఎంతోకొంత స్వయంపోషకములు కాకుండగను, విద్యార్థులచే ఉపయుక్తమగు పనిపాటులను చేయించకను ఎట్లుండగలవు? అయినను

నా సూచన కొందరు విద్యావేత్తలకు ఘోరముగ కనుపించి నది. మామూలుపద్ధతినిమించి మరియొకపద్ధతి వారెరుగరు. విద్య స్వయంపోషకమగుటతో దాని విలువయే నశించుననని వారి యభిప్రాయము. ఇది కూలిపనిగ వారికగపడుచున్నది. నే నిపుడే ఒక విషయమునుగూర్చి చదువుచుంటిని. యూదుల పాఠశాలలలోని వృత్తి – విద్యనుగూర్చి అందిట్లు వ్రాయబడి యున్నది :

"ఇట్లు చేతిపరిశ్రమ గౌరవనీయమని వారు గుర్తించినారు. అది మానసిక పరిశ్రమతో కూడియుండుటవలన తేలికయనిపించును. దేశసేవా దర్శనము దానికి ఔన్నత్యము నిచ్చుచున్నది."

సరియైన ఉపాధ్యాయులున్నచో మనబిడ్డలు కాయకష్టము లోని గౌరవమును గ్రహింతురు. మనోవికాసమున కది సాధన మని, అందొక ప్రధానాంగమని తెలిసికొందురు. తమ శిక్షణ కగు వ్యయమును తమ పనిద్వారా సంపాదించుట దేశారాధన యని భావింతురు. నా ప్రతిపాదనలోని ప్రధానాంశమిది : చేతి పనులు చేయించుట వస్తూత్పత్తికోసమే కాదు; విద్యార్థుల మనోవికాసముకొరకుగూడ. 7, 14 ఏండ్లమధ్యవయసు పిల్ల లను ప్రభుత్వముతీసికొని, ఉత్పాదక పరిశ్రమలద్వారా వారి మనశ్శరీరములకు శిక్షణనిచ్చుటలో పాఠశాలలు స్వయం పోషకములు కాజాలకున్నచో, నిశ్చయముగ అవి బూటక ములు, అధ్యాపకులు మందబుద్ధులు అనవలసినదే.

ప్రతిబాలుడు, బాలిక యంత్రవతుగా గాక, బుద్ధికుశలతతో సమర్థులగు అధ్యాపకుల క్రింద కలయికతో పనిచేసిన చో, రెండవసంవత్సరము మొదలు ప్రతివిద్యార్థియు గంటకొక అణాపని చూపగలడు. ఇట్లు దినమునకు నాలుగు గంటల చొప్పున 26 దినములు పనిచేయు నెలలో ఒక్కొకడు రు 6–8–0 సంపాదించును. కోట్లాది పిల్లలను ఇంత లాభదాయకముగ పనిలో పెట్టగలమాయని ప్రశ్న. కాని శిక్షణలో ఒక సంవత్సరము గడచినతరువాత, గంటకొక అణాపని విద్యార్థులచేత చేయించలేనిచో, మనము వట్టి తెలివిమాలిన నిర్భాగ్యుల మన్నమాట. ఇండియాలోని గ్రామీణులు గంటకొక అణాయు సంపాదింపలేరు. కలిమిలేముల మధ్యగల దారుణ వ్యత్యాసముతో సమాధానపడి బ్రతుకుచుండు మనచేతగాని తన మొకటి, పట్నవాసులు (తెలియకనే అనండి) ఆంగ్లేయులతోకలిసి గ్రామములను పీడించుటయొకటి ఇందుకు కారణములు.

హరిజన్ : 11-9-'37.

# 16

## స్వయంపోషకవిద్య—సంభాషణలు

విశ్రాంతి కావలసిన బలహీన స్థితిలోకూడ గాంధిజీ స్వయం పోషక విద్యా సిద్ధాంతమునుగూర్చి చర్చలు జరుపుచున్నే

యుండెను. దాని విజయమునకు తోడ్పడు సలహాల నీయగోరు వారితో ఆయన తప్పక ముచ్చటించును. వీలైనంత త్వరలో మద్యపాన నిషేధమును అమలు జరిపించవలసిన ఆవశ్యకతను బట్టి, స్వయంపోషక విద్యాసిద్ధాంత మొకటి బయలు దేరదీయ బడినదనుచుండు కొందరి అభిప్రాయమును ఖండించుచు గాంధిజీ ఇట్లనెను :

"దేనికదే స్వతంత్ర విషయము. రెండును ఆవశ్యకములే. విద్యతోను, దానికి కావలసిన ఆదాయముతోను సంబంధము లేకుండ సంపూర్ణ మద్యనిషేధము జరిగితీరవలెనను విశ్వాస ముతో మనము బయలు దేరవలెను. అట్లే గ్రామావసరము లను బట్టి గ్రామీణవిద్య నిర్బంధవిద్య కావలసియున్నచో, అది విధిగా స్వయంపోషకము కూడ కావలెనను విశ్వాసముతో గూడ మనము బయలు దేరవలెను."

చర్చలో పాల్గొన్న ఒక విద్యావేత్త ఇట్లనెను :

"మొదటి విషయమును గూర్చి నాకు గట్టి విశ్వాస మున్నది. మద్యనిషేధము దానికదే పరమావధి. దానిమట్టు కదే ఒక గొప్ప విద్యయని నే నందును. కనుక నేను విద్య నైనను నిలిపివేసి, మద్యనిషేధమును జయప్రదము గావింతును. కాని విద్య స్వయంపోషకము కాగలుగుటనుగూర్చి నాకింకను విశ్వాసము కుదరలేదు."

గాంధిజీ ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "ఇక్కడ కూడ మీరట్టి నమ్మకముతోనే బయలుదేరవలెను. పని సాగించినచో, మార్గము అదే కనబడును. ఇంత వయస్సు మళ్ళిన తరువాత దీని యావశ్యకత నాకు గోచరించినందుకే నేను విచారించుచున్నాను. లేకున్న నేనే ఈ ప్రయోగమును చేసి యుండువాడను. ఇప్పుడైనను, ఈశ్వరానుగ్రహ మున్నచో, చేతనైనంతగ పనిచేసి అది స్వయంపోషకము కాగలదని చూపుదును. అయితే ఇతర ముఖ్య వ్యవహారములకై నా సమయము పోవుచున్నది. ఈ సేగాఁ నివాసములోనే దీని యందలి నా విశ్వాసము దృఢతరమయ్యెను. పిల్లల మనస్సులను రకరకములగు విషయములతో ఊదరగొట్టితిమే కాని వారి శక్తులను ఉద్దీపింపజేయు తలంపే మనకు కలుగలేదు. ఇప్పటికైనను చేతిపనులద్వారా వారికి విద్య గరపుటలో ఏకాగ్రచిత్తుల మయ్యెదము గాక! చేతి పరిశ్రమ చదువుతో పాటు జరుగు రెండవకృషిగాక, మనోవికాసమున కది సాధనము కావలెను."

"అవును, అదియు నాకు బోధపడినది. అయితే అది పాఠశాలను గూడ ఎందుకు పోషింపవలెను?"

"దాని విలువ అట్లే ఋజువు కావలెను. ఏడేండ్ల శిక్షణ నిచ్చి 14 ఏండ్ల కుర్రవానిని సంపాదన పరునిగ జేసి ఇంటికి పంపవలెను. ఇపుడుగూడ బీదలబిడ్డలు తల్లిదండ్రుల పనిలో

సాయపడుచునే యున్నారు. 'నేను నా తల్లిదండ్రులకు సాయ పడనిచో, వా రేమి తిందురు ? నా కేమి పెట్టుదురు ?' అను ఆలోచనయే బిడ్డలలో పనిచేయుచుండును. అదియు విద్యయే. ఇట్లు ప్రభుత్వము ఏడేండ్ల బిడ్డలను తీసికొని, సంపాదనపరులుగ జేసి తల్లిదండ్రులకు అప్పజెప్పవలెను. విద్యద్వారా నిరుద్యోగ మునుకూడ నిర్మూలించుట జరుగవలెను. పిల్లల నేదో యొక వృత్తియందు ఉత్తీర్ణులను చేయవలెను. ఒక్కొక వృత్తిద్వారా ఒక్కొకని మానసిక, శారీరకశక్తులను, కళాభిరుచిని వృద్ధిపరచ వలెను. ఎవరు నేర్చువృత్తియందు వారు ఉత్తీర్ణులుకావలెను."

"కుర్రవాడు ఖాదీకళను, శాస్త్రమును నేర్చుచున్నాడను కొందము. ఏడేండ్లును ఖాదీపనికే పట్టునని మీ యభి ప్రాయమా ?"

"అవును దాని నతడు బండపనిగా నేర్చుకొనకున్నచో, ఏడేండ్లును కావలసినదే. చరిత్రను, భాషలను ఏండ్లతరబడి ఎందుకు చదువవలెను ? ఇంతవరకు కృత్రిమ ప్రాముఖ్యమీయ బడిన ఈ విషయములకు వృత్తిపని ఏమైన తీసిపోయినదా ?"

"అయితే, మీరు ముఖ్యముగ వడుకు, నేతపనులను గూర్చియే ఆలోచించుచుండుటచే, పాఠశాలలన్నిటిని నేత పరిశ్రమాలయములుగ చేయదలచు చున్నారని స్పష్టమగు చున్నది. కుర్రవానికి దీనియందుగాక, మరొక పరిశ్రమయం దభిరుచి యుండవచ్చును కదా !"

"అవును, నిజమే. వానికి మరియొక వృత్తి నేర్పవలెను. కాని ఒకే విద్యాలయము అనేక వృత్తులు నేర్పుట కవకాశ ముండదు. 25గురు పిల్లలకొక అధ్యాపకుడుండును. అల్లెందరు ఉపాధ్యాయులుందురో, 25గురు విద్యార్థులుగల అన్ని తరగతులు లేక పాఠశాలలు ఉండవచ్చును. ఒక్కొక పాఠశాల ఒక్కొక వృత్తి నేర్పును—వడ్రంగము, కమ్మరము, చర్మముల బాగు లేక పాదరక్షలు చేయుట. ఒక్కొక వృత్తి ద్వారా పిల్లవానికి మనోవికాసమును కలిగించవలెనని మనము మరువరాదు. మరొకమాట నొక్కి చెప్పుదును. పట్టణములను మరచిపోయి, మనదృష్టిని పల్లెలపై కేంద్రీకరించవలెను. అవి యొక మహా సముద్రము. అందు నగరములొక బిందువు. అందుచే ఇటుకల పరిశ్రమవంటి వానినిగూర్చి మనము యోచింపలేము. సివిలు ఇంజనీర్లు, యంత్రాగారపు ఇంజనీర్లు కాగోరు విద్యార్థులు ఈ యేడేండ్ల శిక్షణతరువాత ఆ యున్నత విద్యల కేర్పడ్డ ప్రత్యేక కాలేజీలకు వెళ్ళుదురు."

"ముఖ్యవిషయము మరొకటున్నది. విద్యను, పరిశ్రమను విడదీసి యుండుటవలన మనము గ్రామ పరిశ్రమలను నీచముగ చూచుట కలవాటు పడితిమి. వర్ణధర్మము చెడి, నూలువడుకువారు, నేయువారు, వడ్రంగులు, చర్మకారులు అధమకులస్థులుగ నెంచబడుచున్నారు. కనుకనే మనకు క్రాంటనులు, హార్గ్రీవులు లేకపోయిరి. భాషాపాండిత్యమునకున్న గౌరవ

స్వాతంత్ర్యములు ఈ వృత్తులకుగూడ ఉండినచో, మన కార్మికులలో నుండి గొప్ప వస్తు నిర్మాతలు బయలు దేరి యుండువారు. (ఇంగ్లాండులో) నూలువడుకు యంత్రము (స్పిన్నింగ్ జెన్నీ), నీటిశక్తి మొదలగు వానిని కనుగొని ప్రయోగించుటకు దారిచూపెను. మిల్లువచ్చి వేలాది పని వాండ్ర పాటును నశింపజేసినది. ఇదియొక రాక్షసకృత్యము. మన దృష్టిని గ్రామసీమలపై కేంద్రీకరించినచో, చేతిపనిలోని శ్రద్ధ పెరిగి నిర్మాణ కౌశలమునకు దారితీయును. గ్రామ సౌభాగ్యము చేకూరును."

హరిజన్ : 18-9-'37.

# 17

## స్వయంపోషక పాఠశాలలు

ఒక విఖ్యాత విశ్వవిద్యాలయ ప్రొఫెసరు ఇట్లు వ్రాయు చున్నారు :

"మనజనాభాకు తగినంత వస్తూత్పత్తికి తగినన్ని అవకాశములు కల్పింపలేకున్నది మన దేశపు ఆర్థికస్థితి. ఉదాహరణకు : వ్యవసాయమునకు పనికివచ్చు బంజరుభూములు మనకు కొల్లలుగ లేవు; వలసరాజ్యములుగాని, మూలధనముకాని లేవు. కనుక ఉన్న అవకాశములను వినియోగపరచు హక్కు యోగ్యులగువారికే ఉండవలెను. నూరు చిన్న పొలములను విడివిడిగ నూర్గురు దున్ని, వందమందికి ఆహారమును సమకూర్చగలరు. కాని ఇరువది మందికలిసి ఆ భూమినంతను చేర్చి, ఒక ఎరువుల నిపుణుని, ఒకనీటి సప్లై ఇంజనీరు, ఒక మొక్కల పెంపకపు నిపుణుని సహాయంతో సేద్యముచేసి

నూరుమందిని పోషించగలరు. ఉత్పత్తిని పెంచుటకుగాను వైజ్ఞానిక కల్పనలువచ్చినవి. అవి పనివాండ్ర గృహజీవనమునకుగాని, స్వేచ్ఛకుగాని అడ్డురాకుండ వారి ఉత్పాదకశక్తిని పెంచును. వాటిరాకవల్ల అనేకులను శ్రమనుండి తప్పించవలసిన అవసరమేర్పడినది. ఏబదియేళ్లవయస్సు దాటిన వారిని ఉద్యోగము విరమించుమని నిర్బంధించుట చాల నష్టదాయకము. సాధారణముగ శారీరక మానసికశక్తులు ఆవయస్సు తరువాతనే చురుకుగ పని చేయును. తగిన అనుభవమును సంపాదించువరకు మానవులను జీవిత బాధ్యతలను వహించకుండ చేయుటయే మంచిది.''

''పనివాండ్రు పసితనమునందు వృత్తులకు దిగుటయే ఇండియాయొక్క ఆర్థికక్షీణతకు ముఖ్యకారణము. వండ్రంగి తనకుమారుని చిన్నప్పుడే పనిలో పెట్టును. పన్నెండేళ్ల వయస్సునాటికే వాని సంపాదకశక్తి పూర్తియగును. పెండ్లిచేసుకొని వెంటనే స్వంత కార్ఖానా పెట్టును. ఇక క్రొత్తపద్ధతులు వాని మనసులో చొరవు. వికసింపకుండ పనిలోపెట్టబడుమనస్సు ముడుచుకొని మొద్దుపారును. పనియొక్క ఆర్థిక ప్రాముఖ్యము వానికి గోచరించదు. ఎవడైనను వానిని వలలో వేసుకొనగలడు. వాడల్లే తృప్తిపడి చాలీచాలని ఆదాయముతో బ్రతుకును. ఇండియాలోని సంకుచితభావములు, తృప్తి, పూర్వకర్మసిద్ధాంతము, కులతత్వము, త్రాగుడు, ఇన్నిటికిని ఇదేకారణము. సిలోనుతోటలలో పిల్లలచే పనిచేయించుట నేనుచూచిన ఒక ఘోర దృశ్యము. పాఠశాల లుండెనుకాని, పిల్లల నేదో ఒకపనిలో బెట్టుట తల్లిదండ్రుల కలవాటు. వ్యక్తులకు లాభకరమైనను, సంఘమునకు హానికరమగు పనులను ప్రభుత్వము నిషేధించవలెను. పసిపిల్లలను పనిలో బెట్టుటవలన వయోజనులకు పనిలేకుండ పోవచ్చును.''

''అమ్మకమునకు వస్తువులను తయారుచేయుచు స్వయంపోషకములగు కార్ఖానాలను విద్యాసంస్థలనుకొను భ్రమలో మనము పడరాదు, నిజమునకిది పిల్లలచే చేయించు బలాత్కారపు చాకిరియే. నూలువడుకుటలో ఆదేపనిగ చక్రముతిప్పుట నిర్జీవమగు అభ్యాసమైపోవును. పడుగులోని

పుంజములను లెక్కించుటద్వారా గణితము, ప్రత్తి రకములు, పెంపకము పరిశోధించుటద్వారా భూగోళము విజ్ఞానశాస్త్రము నేర్పవచ్చునన్న 'హరిజన్' ప్రతికాసంపాదకుని అభిప్రాయముతో నేనేకీభవించలేను. ఇట్టి విషయములు మొదట్లో పిల్లలమనస్సుల నాకర్షింపవచ్చును. ఏండ్ల తరబడి ఒకేపని చేయుటతో మనస్సు మొద్దుబారి గానుగెద్దువలె తిరుగును. తన ప్రత్యేక అభిరుచులను తృప్తిపరచుకొనగలుగుటవలన గాదు మానవుడు సృష్టిపరిణామములో నిలువగలిగినది. జీవితపరిణామమున కలుగు నిత్యపరివర్తనల నెదుర్కొని సమర్థించగల సామర్థ్యము, సంస్కృతి వలననే అతడు నిలువగలిగినాడు. కన్ను, చెవి, చేయి—ఈ యవయవములకు శిక్షణ తప్పక అవసరమే; అన్ని పాఠశాలలలోను చేతిపరిశ్రమలను నిర్బంధము చేయవలసినదే. చేతికిచ్చుచున్నామన్న శిక్షణ నిజముగ మెదడు శిక్షణయే యని మనము మరువరాదు. విద్యయే పాఠశాలయొక్క ఆశయమైనచో అమ్మకముకొరకు రకమువారీ వస్తువులను తయారుచేయించు పనిని పెట్టుకొనరాదు. ప్రయోగములకొరకును, కొంత పాడుచేయుటకునుగూడ రకరకములగు ముడిసరుకులను, యంత్రసాధనములను పిల్లలకు అప్పగించవలెను. పాడగుట యెట్లునుతప్పదు. శ్రీ నరహరి పరీఖ్ గారి 'హరిజన్' వ్యాసములోని లెక్కలనుబట్టి ఒక ప్రత్యేకవృత్తికై పెద్దపిల్లలను తయారుచేయుటలోగూడ ముడిపదార్థము కొంతవరకు పాడగుటతప్పదు. ప్రకృతి విజ్ఞానకళాశాలలోవలెనే వృత్తి విద్యాశాలలోకూడ ప్రయోగములు చేయుటలో వస్తువులు పాడగుచునే యుండును. ఉత్పత్తిసాధనములు విరివిగాలేని ఇండియాలో అట్టిసంస్థలను మితముగా ముఖ్యకేంద్రములలో మాత్రమే నెలకొల్పవలెను. గోరక్‌పూరు, బెనారస్‌లనుండి విద్యార్థుల నెన్నుకొని తోళ్లపరిశ్రమకై కాన్పూరుకు పంపుటలో నష్టమేమియులేదు. అంతేకాని ఒక్క పరిశ్రమకు చాలచోట్ల శిక్షణకేంద్రములు పెట్టుట చాలనష్టము."

"మరొక విధముగకూడ వస్తుసామగ్రి పాడగుచున్నది. ఒకపోను

దూదితో ఆరితేరిన పనివాడు మిల్లుసహాయమున నలుగురికి సరిపడు బట్ట తయారుచేయగలడు. పనిచేతకానివాడు తయారుచేసినది ఇద్దరికికూడ సరి పోదు. అనగా ఇండియాకు సరిపడు ప్రత్తిపంటకొరకు రెట్టింపుభూమి కేటాయించవలెనన్నమాట. అనగా చేతగాని పనివాండ్రతో ప్రత్తిని పండించుభూమి సమర్థులగు పనివాండ్రతో దేశానికి సరిపడుప్రత్తిని, ఆహారధాన్యములనుకూడ పండించగలదు."

"మూడవరకపు నష్టమునుగూడ మనము గుర్తించవలెను. పిల్లలు రంగురంగుల చిత్రవస్తువులను తయారుచేయవచ్చునందురు. ఒక పారిశ్రామిక పాఠశాల పూర్వవిద్యార్థి యొకడు పొరలచెక్కతో ఆటవస్తువులను చేయుట నేనుచూచితిని. ఆ చెక్క, మేకులు, పనిముట్లు విదేశములనుండి వచ్చినవి. ఇట్టిపరిశ్రమలు విదేశీవస్తు విక్రయమునకు పనికివచ్చును. పొరల చెక్కను మనమే తయారుచేసికోగలమందురేమో! అట్టి అడవులను పెంచ దగినంతచోటు అమెరికాకున్నట్లు మనకులేదు. మనకున్న ముడిసరుకు తోను, పెట్టుబడితోను అనవసర వస్తూత్పత్తిని నిరుత్సాహపరచవలెనే కాని ప్రోత్సహించరాదు."

"విద్యార్థులమనస్సు వస్తుప్రాశస్త్యమునే చూడవలెగాని వాటి బజారుధరలలో మునిగిపోరాదు. ఇట్టి లేతవయసులో వస్తునిర్మాణము, బజారుధరలు, ధనసంపాదన ఆదర్శముగా చూపబడినచో వారి యభివృద్ధి ఆగిపోవును. నిరంతరము ఒకేపనిలో మునిగియుండువారు, సంపదయున్నను దారిద్ర్యమునే అనుభవింతురు. శ్రీ రామకృష్ణపరమహంస వృత్తివిద్యకు ప్రాముఖ్యమీయకుండుట గమనార్హమగు విషయము."

"పిల్లవాడిప్పుడు ఏడేండ్లలో నేర్చువిద్యను రెండేండ్లలోనే నేర్ప వచ్చుననుట వింతగొల్పుభ్రమగా కనబడుచున్నది. పదార్థముతో నింపబడు ఖాళీజాడీవంటిదికాదు పిల్లలమనస్సు. పదహారేండ్లవయస్సున నేర్వవలసిన విషయములను పిల్లలు ఎనిమిదవయేటనే నేర్చుకోలేరు, నేర్చుకోరాదు. చదువు వెనుకబడుటకు కారణము పరభాషకాదు. కొందరూహించు

చున్నంత ఎక్కువసమయము ఆంగ్లమున కీయబడుటయేలేదు. మనస్సును, భావములను ఉత్తేజింపజేయుటకిచ్చు శిక్షణయే వ్యాసరచన. అది సహజముగ నెమ్మదిగనే జరుగును. ఇంగ్లాండుబడులలో వివిధపాఠముల కీయబడు కాల విభాగములు ఈ క్రిందివిధముగ నిర్ణయింపబడినవి :

| | | గంటలు |
|---|---|---|
| సమావేశము, రిజిస్టరుపని, మతబోధ. | ... | 2½ |
| ఆంగ్లము (చదువు, వ్రాత, వ్యాకరణము, వ్యాస రచనతోసహా) | ... | 10 |
| అంకగణితము, ప్రాథమిక గణితపాఠములు | ... | 5½ |
| చరిత్ర, భూగోళము | ... | 3 |
| విజ్ఞానము, కళ (చేతిపనియందు శిక్షణతో సహా) | ... | 3 |
| శరీరవ్యాయామము, నియబద్ధమైన ఆటలు | ... | 3½ |
| | మొత్తము | 27½ |

"శిక్షణకేర్పాటైన కాలములో సగభాగము ఇంగ్లీషుకు ఈయబడినది. ప్రతిపాఠము ఇంగ్లీషుపాఠమేయని మనము గమనించవలెను. భాష ఎంతజటిలమో, దానిలో మనమెంతప్రవీణత సంపాదింతుమో అంతగ మానసికశక్తులు తేటపడి వృద్ధిచెందును. మనోవికాసమునకై అవలంబింపబడు శిక్షణపద్ధతి ఫలరహితముగను, నష్టదాయకముగను, జాప్యముగను కనబడును. మనస్సును బలపరచుటయు, సంఘముయొక్క మనస్తత్వమునకనుగుణ్యముగ సంఘవ్యవస్థను నిర్మించి నడుపుటయు విద్యయొక్క ఆశయము. పాఠశాలలు మానవులను తయారుచేయుటయే గాక, బజారు సరుకులనుగూడ తయారుచేయవలెనని మనము కోరకుందుము గాక!"

"పాఠశాలలకు ఆర్థికస్తోమతును, జాతికి దివాలాతనమును తెచ్చిపెట్టు హ్రస్వదృష్టి సరియగు ఆర్థికసిద్ధాంతము కాదు.

"ఒక ప్రొఫెసరు"

పై వ్యాసముతో పంపిన లేఖలో విలేఖరి సంతకమున్నది కాని, వ్యాసము చివర సంతకము లేదు. కనుక నే నాయన పేరు తెలుపుటలేదు. విలేఖరి నా ప్రణాళికను అర్థము చేసికొను ప్రయత్నమైన చేయలేదు. నే ననుకొన్న పాఠశాల విద్యార్థులను సిలోసు తోటలలోని నిర్బంధ పారిశ్రామిక బాలురతో పోల్చి ఈ విలేఖరి ఆత్మనింద చేసికొన్నవా రగుచున్నారు. ఆ బాలురు విద్యార్థులుగ పరిగణింపబడరని ఆయన మరచి నట్లున్నారు. ఆ పిల్లలుపడు శ్రమ విద్యయనదగదు. నే నభిమానించు పాఠశాలలోని బాలురు ఇతర హైస్కూళ్ళలో నేర్చు విషయము లన్నియు (ఒక్క ఇంగ్లీషు వినా) డ్రిల్లు, సంగీతము, చిత్రలేఖనము, ఒక చేతి పరిశ్రమతోసహా నేర్చుకొందురు. ఈ పాఠశాలలను కార్ఖానాలనుట ప్రత్యక్ష సత్యమును చూచుట కిష్టపడని మూర్ఖపు పట్టుదలయే.

నా ప్రతిపాదన క్రొత్తదని నేనంగీకరింతును. క్రొత్తతనము నేరము కాదుకదా! దీనివెనుక విశేష అనుభవము లేకపోవచ్చును. కాని నేను, నా సహచరులు కలిసి సంపాదించిన అనుభవముతో ఈ ప్రణాళిక విశ్వాసముతో నడుపబడినచో, అది జయప్రదమగునను ధైర్యము నాకున్నది. చివరికిది విఫలమైనను, ప్రయత్నించి చూచుటలో దేశమున కెట్టి హానియు లేదు. ప్రయోగము కొంతవరకు సఫలమైనను, జాతికి అపార లాభము కలుగును. ప్రాథమిక విద్యను మరేవిధమునను ఉచి

తము, నిర్బంధము, సార్థకము చేయలేము. ప్రస్తుత ప్రాథమిక విద్య పట్టి భ్రమయని, ప్రమాదకరమగు ఉరియని అందరొప్పు కొన్న మాటయే.

శ్రీ నరహరి పరీఖ్‌గారిచ్చిన లెక్కలు ఈ ప్రణాళికను వీలైనంతవరకు బలపరచుట కుద్దేశింపబడినవి. అవి తుది తీర్మానములు కావు. ఉత్సాహముతో పనిచేయువారి కవి ప్రోత్సాహ కరములు, సహాయకారుల . ఈ శిక్షణకు ఏడేండ్ల పరిమితి తుదినిర్ణయము కాదు. కాలపరిమితి పెంచినను పెంచవచ్చును.

ప్రణాళికలో పరస్పర సంబంధముకల ముఖ్యభాగములివి :

1. బాలబాలికల సమగ్రాభివృద్ధికి వృత్తిపనియే ఉత్తమ మైన సాధనము. కనుక పాఠ్యక్రమమంతయు చేతిపరిశ్రమకు సంబంధించియే తయారుచేయబడవలెను.

2. ఇట్లుద్దేశింపబడిన ప్రాథమిక విద్య మొత్తముపై విధిగా స్వయంపోషకము కావలసియున్నది మొదటి ఒకటి రెండు సంవత్సరములలో అది పూర్తిగ స్వయంపోషకము కాకపోవచ్చును. పైన చెప్పినదే ఇక్కడ ప్రాథమిక విద్య యొక్క నిర్వచనము.

గణితము మొదలగు శాస్త్రజ్ఞానము వృత్తి విద్యద్వారా యిచ్చుట అసంభవమని ప్రొఫెసరుగారి అభిప్రాయము. ఇది అనుభవములేని మాట. ఇందు స్వానుభవముతో నేను మాట్లాడగలను. ట్రాన్సువాలులోని టాల్‌స్టాయి 'ఫారము'లో

బాలబాలికలకు సమగ్రాభివృద్ధి కలిగించుట నాకు కష్టమని పించలేదు. వారి శిక్షణబాధ్యతను స్వయముగ నేనే వహించి యుంటిని. దినమున కెనిమిదిగంటల వృత్తివిద్య అందలి ముఖ్య విషయము. ఒకటి లేక రెండు గంటల పుస్తకవిద్య యుండెడిది. తవ్వుట, వంటచేయుట, తోటీపని, పాదరక్షలు చేయుట, సామాన్య వడ్రంగము, వార్తలను తీసికొని వెళ్లుట, వచ్చుట— ఇవి అక్కడి పనులు, పరిశ్రమలు. పిల్లల వయస్సులు 8 నుండి 16 వరకు ఉండెడివి. ఈ ప్రయోగము కాలక్రమమున వృద్ధి యగుచు వచ్చినది.

హరిజన్ : 18-9-'37.

## 18

## చేయుటయే గాని, సోమరి ఆలోచన కాదు

డాక్టరు G. S. అరండేలుగారు "ఓరియంట్ ఇలస్ట్రేటెడ్ వీక్లీ"కి వ్రాసిన తమ వ్యాసముయొక్క నకలును, ఒక లేఖను నాకు పంపినారు. వారి లేఖలో ఇట్లున్నది :

"ఈ దేశవిద్య ఇకముందు మునుపటివలె కృత్రిమముగాక, నిజమగు విద్యగ మారవలెనని మీ కోరిక. విద్యా విషయములతో ముప్పదియేండ్లకు పైగా నాకు సంబంధ మున్నది. 'ఓరియంట్ ఇలస్ట్రేటెడ్ వీక్లీ' లో ప్రచురింపబడనున్న ఒక వ్యాసము నకలును మీకిందుతో పంపుచున్నాను. ఇది కొంతవరకు మీ భావములనే వ్యక్తపరచుచుండవచ్చును. ఇండియాకు జాతీయ విద్యాప్రణాళిక తయారుకావలెనని, ప్రతి దేశీయమంత్రియు తన రాష్ట్రములో శక్తివంచనలేక దానిని అమలు పరచుట ధర్మమని

సేనందును. అక్కడక్కడ స్వతంత్రముగ ఎవరికి వారు తమకు తోచినట్లు కొంతఅతుకుల పని చేయుచునే యున్నారు. కాని ప్రధాన సూత్రము ప్రకటనయొకటి వెంటనే వెలువడవలెను. ప్రభుత్వమును ప్రజలును ఏకమై ఒకేసూత్రమునకు బద్ధులై ఒకే ప్రయత్నము చేయవలెను."

వ్యాసమునందలి అత్యంత ముఖ్యభాగము లిక్కడ తెలుపుచున్నాను :

"జాతీయ విద్యలోని మూలసూత్రముల స్వభావమును సూచించుటకు ప్రస్తుత మిచట చోటు చాలదు. బాలబాలికా పాఠశాలలోనైనను, ఆది నుండి అంతము వరకును, చేతిపనియందే లక్ష్యముంచవలెను. క్రమశః 'స్కూలు' 'కాలేజీ' అను కృత్రిమ భేదము అంతరించవలెను.

"శక్తియెంతగా పెరిగినను, అది క్రియాశక్తిగ పరిణమించనిచో, నిరర్థకమగును. ఉత్తేజనములు, భావనల విషయముకూడ ఇట్లే జరుగవలెను. ప్రస్తుత విద్యాపద్ధతులలో ఇవి చాలవరకు అలక్ష్యము చేయబడినవి. యువకులు క్రియాశీలురు కావలెనని ఇండియా ఆశయము. విద్య సహజముగ క్రియారూపమును, శక్తియుతమైన ప్రత్యక్షసేవా రూపమును దాల్చవలెను. పరిసరములనుబట్టి, వంశానుగతముగ తమకు ప్రాప్తించు వృత్తులయందు సమర్థతతో పనిచేయగల యువకపౌరు లిప్పుడు ఇండియాకు అవసరము. పాఠ్యక్రమమంతయు ఋజువర్తనమునకు దారిచూపవలెను. జీవితనియమము, జీవితక్రమము, జీవితోద్దేశము ప్రతి పాఠమునందును ద్యోతకము కావలెను. యదార్థ విషయము లనబడువాని కాఠిన్యములో తగుల్కొని, ఉపాధ్యాయులు పై సంగతిని మరువరాదు. మనోప్రపంచమున 'యథార్థవిషయము' లనునవి లేవు. సాంప్రదాయసిద్ధములగు ఆచారములు మాత్రమే యున్నవి. ఇది ఉపాధ్యాయులు తెలిసికోదగినది. విజ్ఞానశాస్త్రము రూఢినుండి బయలుదేరి, అనుమానములోనికి వెళ్లు మహాకార్యమునకు పూనుకొన్నదన్న ఆర్థరు ఎడింగ్టన్ మాట సత్యము. కనుక మన విద్యావిధానము రూఢి

విషయము లనబడు వానితో విద్యార్థి హృదయమును నొక్కి వేయక, సత్ప్రవర్తనకే అవియు ఉపయోగపడునట్లు చేయవలెను. వ్యక్తులేమి, జాతులేమి నిలువబడుట కిదొక్కటే శ్రేయోదాయకమగు పునాది.

"సచ్ఛీలము నెలకొన్న మీదట, క్రియాభిలాష పెరిగి, స్వయంపోష కత్వముగను, స్వార్థత్యాగముగను పరిణమించును. భూమాతతో సాధ్యమైనంత దగ్గర సంబంధము పెట్టుకొనవలెనను కోరిక జనించును. వ్యావసాయిక యజ్ఞరూపమున ఆమెను ఆరాధించి, వాంఛలలో పవిత్రతను, నిరాడంబరత్వమును సంపాదించుకొని, ఆ తల్లికి బరువుకాకుండ బ్రతుకవలెనను కోరిక పెరుగును. మాతయొక్క సంతానమందరును ఆమె కెంతో కొంత ప్రత్యక్షసేవ చేయుచు, ఆమె ప్రసాదమును బడయవలెనని నా యభిప్రాయము. పట్టణవిద్యాలయములందు కూడ భూమాతతో సన్నిహిత సంబంధ ముండవలెను.

"విద్యనంతను నిష్ప్రయోజకముగ చేసిన మూఢాచారములనుండి మనము పూర్తిగ తప్పుకోవలెను. ఇప్పటి జాతీయ మంత్రివర్గముల శుభ వాతావరణములో నిజమగు విద్యావిధానమును మన మేర్పాటుచేసికో వలెను. విద్యయనగా వట్టి బోధకాదు. నేటి విద్యలో పనికిమాలిన బాహ్య కలాపములు, ఛాందసములు పెరిగిపోయినవి. మనమొక ఇరుకు గొందెలో చిక్కకొన్నాము. గాంధిజీ ప్రతిపాదించుచున్న స్వయంపోషక విద్యను హృదయపూర్వకముగ నే నామోదింతును. ఈ విషయమున ఆయన సూచించినంత దూరము మనము పోగలమో లేదో అని నా సందేహము. ఏడేండ్ల శిక్షణ తరువాత విద్యార్థిని సంపాదనపరునిగ ఇంటికి పంపవలెనను సిద్ధాంతముతో నేను పూర్తిగ ఏకీభవింతును. ప్రతివాడును విద్య మూలమున తనలోని నిర్మాణశక్తిని కొంతవరకు తెలిసికొనవలెను. దేవుని మహోన్నత గుణమగు నిర్మాణకౌశలమును తాను కలిగియుండుటచేత నే మానవుడును దేవుడగుచున్నాడు. మానవునిలోని ఈశక్తి రగుల్కొల్పబడనిచో,

విద్యయొక్క ప్రయోజనమేమి ? అది బోధకావచ్చునుగాని, విద్యమాత్రము కానేరదు.

"తలలోనున్నంత మెదడు చేతిలోగూడ ఉన్నది. చాలకాలము నుండి మేధాశక్తినే మనము దైవముగ పూజించియుంటిమి. మెదడు మన నిరంకుశ నియంతయై యుండినది. ఈ నూతన విధానములో అది మన సేవకులలో సేవకుడై యుండవలెను. నిరాడంబర జీవనమునకే మనము ఉన్నత పీఠము నీయవలెను. కళానిపుణుడు, కార్మికుడు, పాలముకాపు మొదలగువారికున్న హస్తకౌశలమును సంపాదించి చేతులతో బ్రతుకగల రమ్యమగు సమాజజీవనము మనకు వాంఛనీయము.

"ఇట్టి శిక్షణ చిన్నపుడు నా కీయబడియుండినచో, తప్పక నా జీవితమింతకంటె ఎక్కువ సుఖవంతము, సార్థకము అయియుండెడిదని చెప్పగలను."

మామూలుమనిషిగ నేను సామాన్య చదువరులకు చెప్పుచున్నచే, విద్యావేత్తగ డాక్టరు అరండేలుగారు విద్యావేత్తలకును, బిడ్డల విద్యాబాధ్యత వహించినవారికిని చెప్పుచున్నారు. విద్యాశాలల స్వయంపోషకత్వమునుగూర్చి జాగరూకతతో ఆయన చెప్పినమాట నా కాశ్చర్యము కలిగించుటలేదు. నాకున్న క్లిష్టసమస్యయే అది. కడచిన 40 సంవత్సరముల నుండి అస్పష్టముగ నేను చూచుచుండిన విషయమును, నేటి స్థితిగతులనుబట్టి ఇప్పు డతిస్పష్టముగ చూడగలుగుచున్నాను.

ప్రస్తుత విద్యావిధానమునుగూర్చి 1920 లోనే చాల వ్యతిరేకముగ మాట్లాడియుంటిని. ప్రఖ్యాతమగు దేశస్వాతంత్ర్య పోరాటములో నాతో పాల్గొన్న సహసేవకులు, సహశాధి

తఃలునగు మిత్రులిప్పుడు ఏడు రాష్ట్రములలో మంత్రులైనారు. అంతో ఇంతో వారిని ప్రోత్సహించి పనిచేయించగల సదవకాశము నాకిపుడు చిక్కినది. కిందినుండి పైవరకు పూర్తిగ తప్పుదారిబట్టియున్న ఈ విద్యావిధానము సంస్కరింపబడవలెనను అనివార్యమగు ప్రేరణయొకటి నాలో కలిగినది. దానియందలి సత్యము నాలో అంతకంతకు దృఢతరమగుచున్నది. కనుక నా రెండు ప్రతిపాదనలను ధారాళమగు దృష్టితో పరిశీలించమని విద్యావేత్తల నడుగుచున్నాను. తమలో ఇదివరకు స్థిరపడియున్న అభిప్రాయములను ఈ పరిశీలన కడ్డురానీయకుండ, నిష్పక్షపాతముగ వారు యోచన చేయుదురని అర్థించుచున్నాను. విద్యనుగూర్చిన సాంకేతిక, శాస్త్రీయజ్ఞానము నాకు లేనికారణమున, నామాటలను, వ్రాతలను తోసివేయకుందురు గాక! జ్ఞానము తరుచుగ శిశువుల నోట వెలువడుచుండునని ఒక సామెత. ఇది కవుల అతిశయోక్తి కావచ్చును. కాని ఒక్కొకప్పుడైనను అది శిశువులనుండి బయల్పడుచుండుట నిస్సందేహము. నిపుణులు దానికి మెరుగుపెట్టి, శాస్త్రరూపమునిత్తురు. కావున నా ప్రతిపాదనలను, కేవలము వాటి యర్హతనుబట్టియే, పరిశీలింపగోరుదును. వానిని క్లుప్తముగ నాకిపుడు స్ఫురించినట్లు మరల చెప్పుదును.

1. మెట్రిక్కువరకు చెప్పబడు అన్ని విషయములతో సహా ఏడేండ్లుకాని, అంతకుమించికాని కాలపరిమితిగల ప్రాథమిక

విద్య నెలకొల్పబడవలెను. అందు ఇంగ్లీషుకు స్థానముండరాదు. బాలబాలికలకు అన్నివిధములగు జ్ఞానమును, ఉపయుక్తమగు నేదోయొక చేతిపరిశ్రమద్వారా కలిగించవలెను. ప్రస్తుతము ప్రాథమిక, మధ్యమ, ఉన్నత తరగతు లనబడునవన్నియు కలిసి నూతన ప్రాథమికవిద్యగా ఏర్పడును.

2. మొత్తముమీాద, ఈ విద్య స్వయంపోషకము కాగలదు, కావలెను. స్వయంపోషకత్వమే దాని నిజాయతీకి గుర్తు.

హరిజన్ : 2-10-37.

# 19

## బొంబాయిలో ప్రాథమిక విద్య

ప్రాథమిక విద్యావిషయమున నే నింతవరకు ఉద్దేశపూర్వకముగ గ్రామములనుగూర్చియే చెప్పుచుంటిని. ఇండియాలో అత్యధికజనాభా గ్రామవాసులైయుండుట దీనికి కారణము. గ్రామసమస్య తీరినచో పట్టణసమస్యకూడ తీరినట్లే. బొంబాయి నగర ప్రాథమిక విద్యాభిమానియగు మిత్రుడొకరు ఇట్లు వ్రాయుచున్నారు :

"కాంగ్రెసు మంత్రివర్గమిప్పుడు ప్రాథమికవిద్యకు డబ్బు మంజూరు విషయమున శ్రద్ధచేయుచున్నారు. అది స్వయంపోషకము కావలెనను నినాదము వినవచ్చుచున్నది. బొంబాయి నగరమున ఇదియెంత వరకు నెరవేరగలదో పరిశీలించవలెను. ఈ కార్పొరేషనుకు సంవత్సర విద్యా

బడ్జెటు 35, 36 లక్షలని వింటిమి. నిర్బంధప్రాథమికవిద్యను ప్రవేశ పెట్టవలెనన్నచో, అదనముగ లక్షలాదిసొమ్ము కావలెను. ఉపాధ్యాయ వేతనములకిప్పుడు ఏటేట 20 లక్షలగుచున్నది. ఇట్లు ఒక్కొక విద్యార్థికి గాను సగటున 40, 42 రూపాయలగుచున్నది. విద్యార్థి శిక్షణకాలములో తాను చేయుపనివల్ల ఈ మొత్తము సంపాదించగలడా? లేనిచో విద్యను స్వయంపోషకము చేయుటెట్లు?"

ప్రాథమికవిద్యకు చేతిపరిశ్రమను సాధనముగ జేసికొనుట బొంబాయికి లాభదాయకమగుట నిస్సందేహము. ప్రస్తుతము విద్యార్థులు చూపగలిగిన అభివృద్ధి చెప్పుకోదగినది కాదు. ఈ విద్య వారిని పౌరులుగ తయారుచేయజాలదు.

పట్టణములలోకూడ వృత్తివిద్యతో ప్రాథమికవిద్య గరపుట శ్లాఘనీయము. 35 లక్షల ఖర్చులో చాలభాగము దీనితో తగ్గిపోవును. ఒక్కొక పిల్లవాని కగువ్యయము రు 40 అైనచో మంజూరైన మొత్తముతో 87,500 మంది పిల్లలువిద్య నేర్చుచున్నారన్నమాట. నగరజనాభా 10 లక్షలైతే, బడికివెళ్లగల పిల్లలసంఖ్య కనీసము లక్షన్నర ఉండవలెను కనుక 62 వేలమంది పిల్లలైనను విద్యలేకుండఉన్నారని యర్థము. ఇందు కొందరు ఇంటివద్ద ప్రైవేటుగ చదువుచున్నారనుకొన్నను, ఇంకను 50 వేలమందికిపైగా విద్యాసౌకర్యము కల్పింపబడవలెను. ప్రస్తుత స్కేలునుబట్టి మరి 22½లక్షలసొమ్ము కావలసియుండును. ఆ మొత్తము ఈ కల్పాంతములోగా వచ్చునని తోచదు.

ఇండియాకు నిర్బంధోచిత ప్రాథమికవిద్య కావలెనను దృఢవిశ్వాసిని నేను. ఉపయుక్తమగు చేతిపనులద్వారా బిడ్డల శారీరక, మానసిక, ఆధ్యాత్మికశక్తులను వికసింపజేయు విద్య నిచ్చుటవలననే మనమీ యాదర్శమును చేరగలమని నావిశ్వాసము. విద్యావిషయమున ఇట్టి ఆర్థిక మదింపులు నీచములని, అనవసరములని ఎవరును తలపకుందురు గాక! ఆర్థిక అంచనాలలో నీచత్వమేమియు లేదు. నిజమైన అర్థశాస్త్రము ఉన్నత నీతిధర్మమున కెన్నడును వ్యతిరేకముకాదు. అట్లే నిజమైన నీతిశాస్త్రము, సార్థకముకావలెనన్నచో, మంచి అర్థశాస్త్రముగకూడ ఉండవలెను. బలహీనులను బాధించి ధనసంచయముచేయు బలవంతుల అర్థశాస్త్రము భయంకరమగు కృత్రిమవ్యాపారము. అది చావుమంత్రములు చదువును. నిజమైన అర్థశాస్త్రము సంఘ ధర్మమును నిలబెట్టి, దిక్కులేని దీనులతోసహా, అందరి క్షేమాభివృద్ధికై పనిచేయును. యోగ్యమగు జీవితమున కది అత్యావశ్యకము కనుక, బొంబాయి తన బిడ్డలకు ఉపయుక్తమగు చేతిపరిశ్రమను నేర్పుచు, ప్రాథమిక విద్యను స్వయంపోషకము చేయగలిగినచో దేశమంతకును ఆదర్శప్రాయము కాగలదు. విద్యార్థి రోజుకు నాలుగు గంటలు పనిచేసినచో, ఇరువదియైదు పనిదినముల నెలలో గంటకు రెండుకానులు, అనగా నెలకు రు 3-2-0 పాఠశాలకు సంపాదించి యిచ్చును. ఇట్టి పరిశ్రమ విద్యార్థి

మనస్సును నిర్మలముగను, చురుకుగను ఉంచుచు, లోని శక్తులను వికసింపజేయును. మొదటినుండియు కాకపోయినను, మొత్తము ఏడేండ్ల శిక్షణకాలములో విద్యార్థి గంటకు రెండు కానులచొప్పున పాఠశాలకు చెల్లించును.

ఈ పరిశ్రమ వలన విద్య మందగించునని గాని, మనస్సు ముకుళించునని గాని తలచుట పొరపాటు. సమర్థులగు అధ్యాపకులవద్ద, కళాకాంతులుగల ముఖములతో, వృత్తి విద్యను బడసిన విద్యార్థులు నా కిప్పటికిని జ్ఞప్తియందున్నారు. అట్లుగాక అసమర్థులగు అధ్యాపకులు ఆకర్షణీయములగు పాఠములనుగూడ తప్పుడు మార్గమున బోధించి, విద్యార్థులను బాధించుటగూడ నే నెరుగుదును. కాని సమర్థులగు అధ్యాపకులెట్లు లభించగలరని ప్రశ్న. అవసరమున్నచో, కావలసిన వస్తువు తప్పక తయారగునని పై ప్రశ్నకు నా జవాబు. విద్యాసంస్కరణముయొక్క సంస్కరణావశ్యకతను మనము గుర్తించిన తక్షణమే, దాని సాధనమార్గముకూడ సులభముగ గోచరించును. విద్యనుగురించి ప్రస్తుతము మనము వ్యయపరచు కాలములోను, డబ్బులోను ఒక అంశమాత్రపు ఖర్చుతో మనకు కావలసిన అధ్యాపకుల నందరను సులభముగ తయారు చేయవచ్చును. బొంబాయి విద్యావేత్తల కిందు ఆసక్తి యున్నచో, వా రొక కమిటీగా యేర్పడి, నా ప్రతిపాదనల దృష్టిలో ప్రణాళిక నొకదానిని తయారుచేసి వెంటనే అమలు

జరుపుటలో కష్టమేమున్నది ? ఈ నూతన విధానములో నాకు గల సజీవమగు విశ్వాసము వారికిని ఉండవలెను—అంతే. ఆ విశ్వాసము లోపలినుండి రావలసినది. అది అన్యులద్వారా రాదు. సజీవమగు విశ్వాసములేక, ఎక్కడను ఎప్పుడును ఏ ఘనకార్యమును సాధింపబడలేదు.

పట్టణపాఠశాలలలో నేర్పదగు చేతిపనులనుగూర్చి ఇదమిద్ధమను సిద్ధాంతమేదియు లేదు. కాని ఒకటిమాత్రము స్పష్టము. ఇండియా-గ్రామములను పునరుద్ధరింపవలెనని నా ఆశయము. ఈనాడు మనగ్రామములు పట్టణములకు కేవలము అనుబంధములుగ తయారైనవి. పట్టణములచే పీడింపబడుటకే అవి యున్నావా అన్నట్లుండి, పట్నవాసుల కటాక్షముచే అవి బ్రతుకుచున్నవి. పల్లెలమీదనే తమ బలమును భుక్తియు ఆధారపడియున్నవని పట్నవాసులు గుర్తించిననేగాని, రెంటి మధ్యను ఆరోగ్యకరమగు నైతిక బాంధవ్యము ఏర్పడదు. కనుక ఈ సంఘనిర్మాణకార్యమున నగర బాలబాలికలు పాల్గొనవలెనన్నచో, పాఠశాలలోని పరిశ్రమలు పల్లెప్రజల జీవితావసరములను తీర్చునవైయుండవలెను. ప్రత్తిని బాగు చేసి గింజలుతీయుట, ఏకుట, వడుకుట మొదలగు పనులన్నిటితోగూడిన ఖాదీపరిశ్రమను మించినది మరొకటిలేదని నా యుద్దేశము. ఇప్పటికిగూడ ప్రత్తి పల్లెలలో పండుచున్నది. గింజలుతీయుట, వడుకుట, నేయుట నగరములలో జరుగు

చున్నవి. ఇవన్నియు మిల్లులలో జరుగుచుండుట శోచనీయము. అట్లు మనుష్యశక్తి, సామగ్రి, యంత్రశక్తి— ఎంతవృథా!

ఈ ప్రణాళిక గొప్పఫలితముల నిచ్చి శాంతియుత సాంఘిక విప్లవమునకు దారితీయును. పట్టణములకును పల్లెలకును మధ్య సౌమనస్యముకలిగించి, నైతికసంబంధమునది కాపాడును. సంఘమున కాపాదిల్లిన దారుణదురవస్థలలో కొన్నిటి నది చాలవరకు రూపడగించగలదు. వర్గభేదములు తెచ్చిపెట్టిన విషమావస్థలనుండి ప్రజల నది రక్షింపగలదు. అంతకంతకు హెచ్చిపోవుచున్న పల్లెటూళ్ళక్షయమును నివారించి, న్యాయబద్ధమైన నూతన సాంఘికవ్యవస్థ కది పునాదికాగలదు. కలవారికి లేనివారికి మధ్యయేర్పడిన కృత్రిమభేదములను నశింపజేసి, ప్రతివ్యక్తికిని సరిపడిన జీవనాధారమును, స్వేచ్ఛతో బ్రతుకుహక్కును కలిగించగలదు. ఒకరినొకరు కొట్టుకొని చచ్చు భయంకర వర్గపోరాటముగాని, ఇండియావంటి భూఖండమును యంత్రమయము చేయుటలో నగు వల్లమాలిన ధనవ్యయముగాని అవసరము లేకుండగనే ఈ పనిని మనము సాధింపగలము. విదేశ యంత్రసామగ్రిని, దానికివలసిన ఇంజనీర్లను దిగుమతి చేసికోవలసిన అగత్యమును కానక్కరలేదు. యంత్ర మహానిపుణుల ఆవశ్యకతను తప్పించి, ప్రజానీకపు భావిభాగ్య కర్తృత్వభారమును అది ప్రజలచేతియందే బెట్టును. అయితే ఇందుకు ముందంజ వేయునదెవరు? అసలు ఈ నగరప్రజలు

నామాటవిందురా? లేక అది వట్టి అరణ్యరోదనమగునా? ఈ ప్రశ్నలకు జవాబులు నానుండికంటె పై విలేఖరివంటి నగర విద్యాభిమానులనుండియే రావలెను.

హరిజన్ : 9-10-'37.

# 20

## స్వయంపోషకత్వము పరీక్ష కాదు

చేతిపరిశ్రమద్వారా గరపబడు విద్యనుగూర్చి ఒకప్పుడు మాట్లాడుచు గాంధిజీ ఇట్లనెను :

ఇట్టి నూతనవిద్యయొక్క ఫలితము అది తప్పక స్వయంపోషకమగుటయే. కాని దాని విజయమునకు స్వయంపోషకత్వము కారణముకాదు శాస్త్రీయముగ నేర్పబడు చేతిపరిశ్రమద్వారా విద్యార్థిలోని శక్తులు పరిపూర్ణవికాసము నొందును. ఈవికాసమే విద్య సఫలమైనదానికి గుర్తు. ఏదోయొక విధమున విద్యను స్వయంపోషకము చేయగలమను అధ్యాపకులు నా కక్కరలేదు. విద్యార్థి తనశక్తులను సరిగా ఉపయోగింప నేర్చుకొనుటతో విద్య దానంతట అదేవిధిగా స్వయంపోషకముకావలెను. దినమునకు మూడుగంటలు చేతిపరిశ్రమచేసిన బాలుడు తనతిండి తాను సంపాదించుకోగలిగియుండగా, పనితోపాటు మనస్సును, ఆత్మనుగూడ వికసింపజేసికొన్న వానికి మరెంత ఫలితము చేకూరునో!

హరిజన్ : 11 6-'38.

# 21

## తుది నిశ్చయములు

ఈ దేశములో మనల నావరించియున్న వాతావరణమునకు జవాబే బేసిక్ విద్య. మన యేడులక్షల గ్రామాలలోని ప్రజాజీవితమునకు సరిపడునట్లుగనే ఈ విద్యావిధానము ఉద్దేశింపబడినది. గ్రామప్రజలను మరచితిమా, ఇండియాను మరచినట్లే. ఇండియా అనగా పట్నవాసములు కాదు. అసంఖ్యాకములైన గ్రామములలోనే ఇండియాను చూడగలము.

ఈ క్రిందివి బేసిక్ విద్యయొక్క ముఖ్యాంగములు :

1. నిజమైన విద్యయంతయు స్వయంపోషకము కావలెను. అనగా తుదకు దానిఖర్చులనది భరించగలుగును. మొదటి పెట్టుబడి ఈ ఖర్చులకిందికిరాదు అది శాశ్వత మూలధనము.

2. అందు చివరివరకును హస్తనైపుణ్యమున కొక ప్రాముఖ్యముండును. అనగా విద్యార్థులు నిత్యమును కొంతసేపు ఏదో యొక పరిశ్రమయందు నిపుణతతో పనిచేయుచుందురు.

3. విద్యయంతయు ఆయాప్రాంతీయ భాషలద్వారానే గరపబడును.

4. ఇందు ఏ ప్రత్యేక సాంప్రదాయిక మతబోధకును తావులేదు. సార్వజనికములగు ముఖ్య నీతిధర్మములను బోధించుటకు పూర్తి యవకాశముండును,

5. విద్యనుపొందువారు పిన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు ఎవరైనను, వారి వారి గృహముల కది వ్యాపించవలెను.

6. ఈ విద్యను బడయువారు కోట్లకొలదిగ నుండి, తామే అఖండ భారత దేశమని భావించుకొందురు. కనుక అంతర రాష్ట్రీయభాష నొకదానిని వారు నేర్చుకొనవలెను. ఇట్లు ఇండియాఅంతయు మాట్లాడవలసిన భాష హిందూస్థానీ ఒక్కటే. నాగరి లేక ఉర్దూలిపిలో అది వ్రాయబడవలెను. కనుక విద్యార్థులు ఆ రెండు లిపులను నేర్చియుండవలెను.

**హరిజన్ : 2-11-'47.**

# నాల్గవ భాగము
# ఉపాధ్యాయులు

## 22

## విజ్ఞప్తి

నేను ప్రతిపాదించు ప్రాథమిక విద్యావిధానమునందు విశ్వాసముగల అధ్యాపకులు పలువురున్నారు. వృత్తిపరిశ్రమ ద్వారా శిక్షణప్రయోగములు చేయుచున్నవారినిగూడ నే నెఱుగుదును. ఇట్టి యుద్దేశములుండియు అనివార్యపరిస్థితులవలన అధ్యాపకవృత్తిని వదలి వేసినవారు కొందరున్నారు. ఇప్పటి కాంగ్రెసు మంత్రివర్గములు ఈ విధానముయెడల సుముఖత చూపుచున్నట్లున్నారు. కనుక, ఇందు సేవచేయుటకుద్యుక్తులైనవారి పేర్లను సేకరించుట అవసరము. అట్టి మిత్రులు తమపేర్లు, అర్హతలు, కావలసిన వేతనములు, మరి యితరవివరములేవైనయున్నచో, వాటితోసహా నాకు తెలియపరచ గోరుచున్నాను.

హరిజన్ : 25-9-'37.

## 23

## ప్రాథమిక విద్యోపాధ్యాయ దరఖాస్తుదారులకు

నూతన విద్యాప్రణాళికలో పనిచేయుటకిష్టపడు అధ్యాపకులకొరకు నేజేసిన విజ్ఞప్తిపై దినదినమును నాకు ప్రత్యుత్త

రములు వచ్చుచుండుట సంతోషదాయకము. కాని వారి లేఖలనుబట్టి చూడగా నా విజ్ఞప్తి వారికర్థమైనట్లు తోచదు. ఉపయుక్తమగు ఒక చేతిపరిశ్రమద్వారా నేర్పవలసి ప్రాథమిక విద్యావిధానములో పూర్ణవిశ్వాసము లేనివారును, జీవన భృతిమాత్రమే తీసికొనుచు పనిచేయలేని, లేక, చేయుట కిష్టములేనివారును నా కక్కర లేదు. నూలు వడుకుటలోను, దానికి సంబంధించిన ప్రత్తి దూది పనులన్నిటిలోను ఉత్తీర్ణులై యుండుడని వీరికి నేనిచ్చు సలహా. ఈలోగా అందరిపేర్లను నేను జాబితా వ్రాసి యుంచుకొందును. విధానమును అమలులో పెట్టునపుడు నేనీ మిత్రులకు మరల వ్రాయుదును. కాంగ్రెసు రాష్ట్రప్రభుత్వములు ఏదును ఈ ప్రయోగమునుచేయుట కిష్టపడినచో, వారికేమేమి అవసరమో తెలిసికొనుటకు నేనీ విజ్ఞప్తి చేసియుంటిని.

హరిజన్ : 9-10-'37.

## 24

## బేసిక్ విద్యావిధానములోని ఉపాధ్యాయులకు

[దరఖాస్తుదారులకు గాంధిజీ యిచ్చిన హిందూస్తానీ ఉపన్యాస సారాంశము.]

మీ ప్రతిజ్ఞ చాల ఆశ్చర్యమును గొల్పుచున్నది. ఐదు వేలకు మించిన ఈ దరఖాస్తుల సంఖ్య దేశభక్తిని ఋజువు చేయజాలదు. అట్లైనచో, నిజముగ బాగుండును. విద్యా

వంతులలోను, కొలదిగ చదివిన వారిలోను వ్యాపించిన నిరుద్యోగమునే ఇది ఋజువుచేయుచున్నది. ప్రభుత్వోద్యోగ వ్యామోహము కూడ ఇందు కనబడుచున్నది. పోలీసు కానిస్టేబుల్ పనికిని, ఉపాధ్యాయోద్యోగములకును దరఖాస్తులు చేయు వారు అక్రమమగు పై సంపాదనకూడ చేసికొను ఆశతో వత్తురు. మీలో నెవరును అట్టి ఆశతో రాలేదని యను కొందును. నాకెంత దేశభక్తి యున్నను, రు 15 ల నెలజీతపు ఉపాధ్యాయ వృత్తికి కట్టువడి యుండగలనో లేదో! పాఠశాలలలో ఏవో లాభములు మిగులవచ్చునని, అది మీకు పంచిపెట్టబడునను భావమును మీరు మీ మనసులోనికి రానీయవలదు. కనుక మీలో నెవరైన మీరిచ్చిన కాంట్రాక్టుకు విచారపడుచున్నచో, వెంటనే మిమ్ము విడుదల చేయవలసినదిగ మంత్రిగారి నడుగుడు. నేను మీవైపున వాదించి మిమ్ము విడుదల చేయించగలను. నేనీ మాట చెప్పి, కాంట్రాక్టును జరుపదలచుకొన్న వారికి నా శుభాశీస్సుల నిచ్చుచున్నాను. మీ ప్రతిజ్ఞలను నిలుపుకొను శక్తిని భగవానుడు మీకొసంగును గాక!

కాంగ్రెసు కార్యక్రమము ననుసరించి, ఈ విద్యాప్రణాళిక తయారైనదని మీరెరిగియున్నారు. సత్యాహింసల ద్వారా స్వరాజ్యమును సాధింతుమని కాంగ్రెసు ప్రతిజ్ఞ చేసి యున్నది. కనుక సత్యాహింసల సాధనయే ఈ విద్యా ప్రణా

శిక్షయొక్క పునాది. మీ విద్యార్థులతో మీకున్న నిత్య సంబంధములో, మీరు ఈ రెండు ధర్మములను, తదనుగుణ్య మగు నడవడిని పాటింపకున్నచో, మీరు మీ పాఠశాలలతో సహా విఫలు లగుదురు. జర్మనీలో హిట్లరేమి చేయుచున్నాడో మీ రెరుగుదురు. హింస అతని మత మనుటలో రహస్యము లేదు. ఖడ్గమే వారి యాత్మయని మనము వినియున్నాము. అచటి బాలబాలికలకు మొదటినుండియు హింసా శాస్త్రము నేర్పబడును. బాలుర గణితపాఠములోకూడ శత్రుద్వేషమే బోధింపబడును. లెక్కలలోని ఉదాహరణలు కూడ సైని కోద్రేకమును రగుల్కొల్పునవై యుండును. ఆ మతమును మన మామోదించినచో, మన బిడ్డలకుగూడ మొదటినుండియు హింసనే బోధింపవలెను. ఇటలీలో జరుగుచున్న పనియు ఇదే. మనమును వారివలె నిష్కపటముగ నుండవలెను. ఇండియా అంతటను ఈ విద్యావిధానమును పూర్తిగ అమలులో పెట్టి నచో, శాంతియుతమైన విప్లవము జరిగి, స్వరాజ్యము తప్పక చేకూరును.

హరిజన్ : 30-4-'38.

# 25

## అహింసపై ఆధారము

కొత్తగా ఏర్పడిన 'జాతీయ విద్యామండలి' సమావేశమున

నూతన విద్యయొక్క అంతరార్థమును, ఆశయమునుగూర్చి వ్యాకులహృదయుడై గాంధిజీ ఇట్లు చెప్పెను :

"నూతన విద్యాప్రణాళిక ప్రారంభింపబడినపుడు నేను పూర్ణమగు ఆత్మవిశ్వాసముతో నుంటిని. ఇప్పుడది లేనట్లగ పడుచున్నది. అప్పుడు నా మాటలలో శక్తియుండెను. ఇప్పుడది కొరవడినట్లున్నది. ఈ యధైర్యము బాహ్యాకారణముల వలన కలిగినది కాదు. ఇవి లోపలికారణములు నా యింద్రియములు మొద్దుపారలేదు. వృద్ధుడనైనను మానసేంద్రియము బాగుగ పనిచేయుచున్నది. అహింసలో నా విశ్వాసమేమియు తగ్గలేదు. అది అంతకంతకు తేజోవంతమగుచున్నది. కాని నేనీ నిమిషమున ఆత్మవిశ్వాసమును కోల్పోతిని. కనుక అనాలోచితముగ నామాటపై మీరు దేనినికూడ స్వీకరింపరాదు. మీకు నచ్చినదానిని మాత్రమే స్వీకరింపుడు. సరియైన పద్ధతిలో మనము లెక్కకు రెండు పాఠశాలలు నడుపగలిగినను నేను పరమానందముతో నృత్యము చేయుదును."

సరియైన పద్ధతులేవో సూచించుచు గాంధిజీ ఇట్లు చెప్పెను :

"ఈ ట్రెయినింగుస్కూలును స్వరాజ్యమును సంపాదించు సంస్థగా మనము చేయవలెను. సంఘములోని సమస్త అనర్థములను నిర్మూలించుటకది ఉపయోగపడవలెను. వీనిలో ముఖ్యమైనది మన కులమతభేదములు, బాధలు. ఇందులకై మనము అహింసపై దృష్టి నిలుపవలెను. హిట్లరు, మసోలినీల

పాఠశాలలు హింసనే ముఖ్యసూత్రముగ జేసికొన్నవి. కాంగ్రెసు సిద్ధాంతము ననుసరించి మనది అహింసా సూత్రము. కనుక మన సమస్యలన్నిటిని ఆ మార్గముననే పరిష్కరించుకొనవలెను. మనగణితము, విజ్ఞానశాస్త్రము, చరిత్ర అహింసా దృష్టితోనే నేర్పబడును. వీనికి సంబంధించిన సమస్య లన్నియు అహింసరూపమునే ధరించును. మేడమ్ హాలీద్ ఎడిబ్ హానమ్ గారు జమియా మిలియా ఇస్లామియాకు టర్కీ విషయమై ఉపన్యసించినపుడు నే నిట్లంటిని : 'సాధారణముగ చరిత్ర యంటే రాజులు, వారు చేయు యుద్ధములు అని యర్థము. కాని భవిష్యత్తులో మానవుని చరిత్రయే చరిత్ర యనబడును. అది హింసాయుతమే కాగలదు, అగును కూడ. అప్పుడు మన దృష్టిని పట్టణపరిశ్రమలపై గాక, గ్రామపరిశ్రమల మీదనే గట్టిగానిలుపవలెను. అనగా దేశములోని ఏడు లక్షల గ్రామములను సజీవముగ నుంచదలచినచో, మన గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించవలెను. వానిద్వారా విద్యగరపినచో గొప్ప మార్పురాగలదు. మనపాఠపుస్తకములు కూడ ఆ యుద్దేశముతోనే తయారుకావలెను '

"దీనిని మీరు శ్రద్ధతో పరిశీలించి, మీకు నచ్చనిదానిని తోసివేయుడని నా కోరిక. ఇది ముసల్మాన్ సోదరులకు నచ్చనిచో, వారు దానిని పూర్తిగ నిరాకరింపవచ్చును. నేను కోరు అహింస బ్రిటిషర్లతో పోరాడునంతవరకే కాదు.

మన స్థానిక సమస్యలన్నిటిని అదే పరిష్కరింపవలసి యుండును. నిజమైన అహింస కార్యరూపము దాల్చినచో శాశ్వత హిందూ ముసల్మాను సఖ్యత యేర్పడును. హిట్లరు మసోలినీలమధ్య పరస్పర భయమువలన కుదిరిన సంధివంటిది కాదిది."

హరిజన్ : 7-5-'38.

# 26

## బేసిక్ విద్యలోని ఉపాధ్యాయులు

ప్రొఫెసర్ టో గాంధిజీవద్దకు వచ్చెను. గ్రామీణ విద్యా ప్రచారము నిమిత్తము తన విశ్వవిద్యాలయపు పనిని విసర్జించితిననియు, బేసిక్ విద్యాప్రణాళికలో తనకత్యంత అభిమానమున్నదనియు చెప్పి, ప్రణాళికయొక్క సారాంశమేమని ఆయన గాంధిజీని అడిగెను.

గాంధిజీ జవాబు : ఉపయుక్తమగు ఏదోయొక చేతి పరిశ్రమను నేర్పుటద్వారా బాలబాలికలలోని మానవత్వమును సంపూర్ణముగ వికసింపజేయుట ఇందలి ప్రధాన విషయము.

ప్రొఫెసర్ టో : అయితే ఉపాధ్యాయులులేని ఇబ్బంది యొకటున్నది.

గాంధిజీ : (నవ్వుచు) మాకును అదే యిబ్బంది.

ప్రొ. టో : ఉపాధ్యాయులు చేతిపరిశ్రమను నేర్చుకొనవలెననియా, లేక పరిశ్రమ నేర్చినవారు బోధకులుకూడ కావలెననియా మీ యుద్దేశము ?

గాంధిజీ : విద్యావంతోడు పరిశ్రమను సులువుగా నేర్చుకొనుట కవకాశమున్నది. మీవంటి విద్యావంతులు ఏ పరిశ్రమనో నేర్చుకొనగలిగినంత తక్కువ కాలములో పారిశ్రామికులు బోధనా నైపుణ్యమును సాధింపలేరు.

ప్రొ. టో : కాని చదువుకొన్నవారు పెద్ద యుద్యోగముల వెంటను, ధనసంపాదన వెంటను బడుదురు. ఇట్టి పనియందు వారికేమి రుచి ?

గాంధిజీ : ఈ ప్రణాళికలో సత్తాయుండి, చదువుకొన్న వారికది నచ్చినచో, అది యువకుల నాకర్షించి, వారిని ధనాశ నుండి మరలించగలదు. విద్యావంతులలో తగినంత దేశభక్తిని అది పురికొల్పనిచో, విఫలమై పోవును. మాకొక సుఖమున్నది. స్వదేశభాషలద్వారా విద్యనేర్చినవారు కాలేజీలలో ప్రవేశింపరు. వారికి ఈ ప్రణాళిక ఆకర్షణీయముగ నుండగలదు.

హరిజన్ : 27-8-'38.

---

# అయిదవ భాగము
# విమర్శలు, విశదీకరణములు
# 27
## ప్రణాళికను బలపరచుట

"మీ ప్రతిపాదన విప్లవాత్మకమైనది. అయినను నేను దానిని పూర్తిగ బలపరతును. శాస్త్రీయముగను, జాతి సంస్కృతికి తగినట్లును ఏదో యొక చేతిపరిశ్రమను ప్రతిబిడ్డకును నేర్పవలెనని, విద్యారంభము నుండియు వస్తునిర్మాణశక్తి బిడ్డలకు అలవడవలెనని మీతోపాటు నేనును వినమ్రతతో వాదింతును. వ్యక్తులకును జాతికినిగూడ ఈ విధానముయొక్క నైతిక, సాంస్కృతిక, ఆర్థికవిలువ అపారము. అది శరీరశ్రమకు గౌరవ మిచ్చుటయేగాక, ఆత్మవిశ్వాసమును, జీవితమునకు నిజమైన విలువను ఈయగలదు. బిడ్డయొక్క శరీరము, మనస్సు, నీతి, వృత్తిసంబంధములగు అవసరములన్నిటిని తీర్చుటయే మన ఆశయము. వృత్తిశిక్షణలో వస్తు నిర్మాణమునకు సంబంధించిన సాధారణసూత్రములన్నియు నేర్పబడును. వివిధపరిశ్రమలకు సంబంధించిన సామాన్యపరికరములను ఉపయోగించుట కూడ నేర్పబడును. బోధనను, వస్తునిర్మాణమును సమన్వయింపవలెను. వానిని రెండుగ విడదీయరాదు.

"మన ప్రాథమికవిద్యయందు ఈ క్రింది విషయములు బోధింప బడవలెను :

1. మాతృభాష, 2. అంకగణితము, 3. ప్రకృతిశాస్త్రము, 4. సాంఘికశాస్త్రము, 5. భూగోళము, చరిత్ర, 6. చేతిపని లేక వివిధ సాంకేతిక పరిశ్రమలు, 7. శరీరవ్యాయామము, 8. కళ, సంగీతము, 9. హిందూస్థానీ.

"బిడ్డల విద్యాభ్యాసము ఎప్పుడు ప్రారంభముకావలెనన్న దొకచే ప్రశ్న. 5 లేక 6 యేండ్ల వయస్సున చేతిపరిశ్రమ ప్రారంభముకాదగునా? దానికి ధనమెక్కుడిది? అక్షరజ్ఞానవ్యాప్తికంటె ఇది సులభముకాదు. ఖర్చుకూడ తక్కువకాదు. పనిముట్లను వివేకముతో వాడగల యుక్తవయస్సున, అనగా 8 లేక 10 యేండ్లప్పుడు దానిని ప్రారంభించుట మంచిది. కాని ప్రాథమికవిద్య 5 లేక 6వ యేటనే ప్రారంభించవలెను. అంతకు మించరాదు. మనము నేర్పదలచిన సాంకేతిక విద్యతోసహా మెట్రిక్యులేషన్ తరగతికి సరిరావలెనన్నచో ఈ విద్యకు పదేండ్లకాల మీయవలెను. ప్రారంభదశలో బిడ్డలు తయారుచేయువస్తువుల ప్రాశస్త్యమును గూర్చి నాకు సందేహామే. అందమైన మంచివస్తువులుకానిచో, సొగసులకును, విలాసములకును అలవాటుపడిన ప్రజలు వాటినికొనరు. ప్రభుత్వమే ఈ వస్తువులను తీసికొనవలెనన్నచో అవి వారికెందుకు పనికివచ్చును? ఈ పద్ధతికంటె ప్రభుత్వము ప్రతిఫలాపేక్ష లేక, వ్యయమునంతను తామే భరించుటమంచిది. 12, 16 మధ్యవయస్సు బాలురుచేయు వస్తువులను అమ్మకముచేయవచ్చును. ఆదాయమును తీయుటకిదొక ముఖ్యమార్గము కాగలదు.

"అక్షరజ్ఞానవ్యాప్తి ఒక ప్రత్యేకవిషయము. దానికిగాను క్రొత్త పన్నుల విధింపుకుగాని, వ్యయమునకుగాని నేను వెనుదీయను.

"ఉపయుక్తమగు చేతిపరిశ్రమను కొన్నియేండ్లు గడచినపిమ్మట పై తరగతులలో ప్రారంభించవచ్చును. తయారైనవస్తువుల విలువనుబట్టి విద్యను క్రమక్రమముగ స్వయంపోషకముచేయుటకు ప్రయత్నింపవచ్చును. అయితే ఒక ప్రమాదముమాత్రము రాకుండ చూచుకోవలెను. బిడ్డల శారీరక, మానసిక, ఆధ్యాత్మికాభివృద్ధి పాఠశాలయొక్క ఆర్థిక లాభమునకు పూర్తిగ లోబడిపోరాదు.

"ఈ ప్రాథమికవిద్య ఇంగ్లీషులేని మెట్రిక్యులేషన్‌తో సమానముగ నుండవలెననెడు మీ యుద్దేశముకూడ నాకు సమ్మతమే. హిందూస్థానీ

కూడ దానికి చేర్చవలసియుండును. ఈ ప్రాథమికవిద్యలో హైస్కూలు విద్యకూడ చేరియుండును. దీనికి మీరిచ్చుకాలము పది సంవత్సరములను కొందము. విద్యయంతయు మాతృభాషద్వారానే (మరేభాషయు పనికి రాదు) చేర్పబడవలెను. మాతృభాషతో బిడ్డమనస్సు విశాలమగును. జ్ఞానసంపాదన విషయమున బిడ్డకది సజీవమగు అభిరుచి కలిగించును. జీవితమంతయు నిర్మాణాత్మకముగ మార్పుచెందును.

"మధ్యయుగములో విద్య చాలవరకు స్వయంపోషకముగ నుండె నని నేనొప్పుకొందును. ఇపుడుకూడ ఆ మధ్యయుగపు సాంఘిక, ఆర్థిక, రాజ్యాంగవ్యవస్థలు, అనగా ఆనాటి పాతసంకుచిత వర్గ, కులభావములు నిలిచియుంటే, విద్య స్వయంపోషకము కావచ్చును. కాని ఈనాటి సార్వ జనిక జాతీయ సామ్యభావములతో విద్య స్వయంపోషకము కాజాలదు. సర్వాధికారి, సర్వసంపత్సమృద్ధము అగు బలీయమైన ఏకైకసంస్థ ప్రభు త్వమే. కనుక ప్రభుత్వమే ఈ పనిచేయవలెను కులము, వర్గము, కార్మిక సంఘము, దేవాలయమువంటి పూర్వకాలపు అధికారసంస్థలు తమ పర పతిని కోల్పోయినవి. ప్రజలకుకూడ వాటిపై విశ్వాసముపోయినది. ఇండి యాలోకూడ సంఘాధికారమును, ఆర్థిక యాజమాన్యమును ఇండియాలో కూడ రాజకీయవర్గమునకు సంక్రమించినవి. మధ్యయుగమున దొకటి; ఆధునికకాలమున దొకటి; అట్లే బహువిధ ప్రవృత్తులుగలదొకటి, ఏక దృష్టిగలదొకటి అయిన రెండు భావప్రపంచములు కలిసి పనిచేయజాలవు.

"పూర్వము సార్వజనిక విద్యలేదు; ఏకైక ప్రజాప్రభుత్వములేదు; జాతీయమగు సామ్యభావములేదు.

"చదువు కొన్నవారందరు విద్యాసేవకు విధిగా కొంతకాలము ఇచ్చుపద్ధతి కొత్తదికాదు. అది అనుసరణీయమే. ప్రజలలో విద్యావ్యాప్తి కావలెనను విశ్వాసముకల విద్యావంతులందరు ఇట్టిసేవకు సంసిద్ధులుకావలె నని కాంగ్రెసు, కాంగ్రెసురాష్ట్రముల మంత్రులు విజ్ఞప్తిచేయవచ్చును. ఇందువలన ప్రజానీకముతో ఆర్థిక, రాజకీయసంబంధము మాత్రమేగాక

ఒక నూతనసంబంధము ఏర్పడగలదు. ఇట్లు ప్రజాశక్తిని, జ్ఞానమును సంఘటితపరచి ఉన్నతస్థాయికి నడుపవచ్చును."

చేతిపరిశ్రమద్వారా స్వయంపోషకమగు ప్రాథమికవిద్యను గూర్చి మొదట నేను వ్రాసినపుడు విద్యావేత్తలగు మిత్రులు తమ అభిప్రాయములను తెలుపవలసినదని నేను కోరియుంటిని. అట్టి అభిప్రాయములను మొదట తెలిపినవారిలో ప్రొఫెసరు యస్. వి. పంతంబేకరు ఒకరు. ఆయనలేఖ హేతుయుక్తము, దీర్ఘము అయియుండెను. చోటులేక దానినింతవరకు ప్రచురించలేకపోతిని. అందలి అతిముఖ్య విషయములను పైన పేర్కొన్నాను. క్లుప్తపరచు యుద్దేశముతో, అక్షరజ్ఞానమును గూర్చి, కాలేజీ విద్యనుగూర్చి ఆయన వ్రాసిన విషయము లిక్కడ వదలివేసితిని. ఎందువల్లననగా ఈ నెల 22, 23 తేదీలలో జరుగనున్న విద్యావిషయిక సభలో ముఖ్యముగ జరుగబోవు చర్చ వృత్తిపరిశ్రమతో గూడిన స్వయంపోషక ప్రాథమిక విద్యను గూర్చియే.

హరిజన్ : 16-10-'37.

# 28

## ఒక విమర్శకు జవాబు

విద్యాశాఖలోని ఒక పెద్ద ఆఫీసరు నా ప్రాథమిక విద్యా ప్రణాళికపై యోచనతో గూడిన దీర్ఘవిమర్శను వ్రాసి పంపినారు. తనపేరు మాత్రము వెల్లడించవద్దన్నారాయన. నా

ప్రణాళిక సారాంశమును ఆయన ఈక్రింది రీతిని తేల్చినారు :

"(1) ప్రాథమిక విద్యకు వృత్తిపనియే ఆది, అంతముకూడ. సామాన్య విషయజ్ఞానము ప్రారంభదశలో అప్రధానముగను, వ్రాయుట చదువుటద్వారా నేర్పబడు చరిత్ర, భూగోళము, గణితమువంటి పాఠములు చిట్టచివరను వచ్చును.

(2) ప్రారంభ విద్య మొదటినుండియు స్వయంపోషకము కావలెను. పిల్లలు తయారుచేయు వస్తువులను ప్రభుత్వము తీసికొని విక్రయించుటద్వారా పై యుద్దేశము నెరవేరును.

(3) ప్రాథమికవిద్య, ఇంగ్లీషు లేకుండ, మెట్రికు్యలేషను తో సమానమై యుండవలెను.

(4) యువతీయువకులను ప్రాథమిక విద్యాబోధకులుగ నిర్బంధముపై తీసికొనవలెనని ప్రొఫెసరు కె. టి. షా గారి సలహాను బాగుగా పరిశీలించి, వీలైనచో దానిని అమలు జరుపవలెను."

ఆయన ఇంకను ఇట్లనుచున్నారు :

"పరిశీలించగా, ఇందలివి కొన్ని మధ్యయుగపు భావములుగనున్నవి. కొన్ని ప్రాతిపదికలు అసలు పరీక్షకే నిలువవు. మూడవ విషయములో నిర్ణయింపబడిన ప్రమాణము చాల హెచ్చుగా కనబడుచున్నది."

విలేఖరి నా మాటలలోని భావముల దెల్పుటకంటె నేనన్న మాటలనే సరిగా వ్రాసియుండిన బాగుండెడిది. ఆయన పేర్కొన్న మొదటి విషయములోని అంశములన్నియు సత్యదూరములు. నే జేసిన ప్రతిపాదన, విద్య చేతిపనులతో ప్రారంభము కావలెనని, మిగతవన్నియు రెండవ పక్షముగ నుండవలెనని కాదు. నే నన్నది సాధారణ విద్యయంతయు చేతి

పనులద్వారా వాటితో కలిసియే జరుగవలెనని. నేనన్నదొకటి; విలేఖరి నాకారోపించినది మరియొకటి. మధ్యయుగములో నేమి జరిగెనో నే నెరుగను. కాని మధ్యయుగమునకాని, మరి ఏ యుగమునకాని చేతిపరిశ్రమల ద్వారా పూర్ణమానవుని తయారుచేయవలెనను ఆశయ ముండలేదు. ఈ భావము క్రొత్తది. క్రొత్తదానిని పరిశీలించి ప్రయోగించి చూచుట మంచిదికాని, అసంభవమని చెప్పి మొదటనే కొట్టివేయుట భావ్యము కాదు.

చదువుట, వ్రాయుట శిక్షణ కాలములో చిట్టచివర వచ్చునని నే ననలేదు. సాధారణ విద్యకూడ మొదటినుండియు ఉండును. అదియు అందలి ముఖ్యభాగమే. నేను చెప్పినది, ఇపుడు మరల చెప్పునది యేమనగా, చదువుట కొంచెము ఆలస్యముగాను, వ్రాయుట చివరను రావచ్చునని. అయితే ఇదంతయు మొదటి సంవత్సరాంతములోగానే జరుగవలెను. నే నుద్దేశించిన పాఠశాలలో ఏడేండ్ల బాలబాలికలు ఒక సంవత్సరము లోపల సంపాదించు జ్ఞానము ఇతర పాఠశాలల లోని బాలురు నేర్చుకొనుదానికంటె అధికముగ నుండును. వీరు తప్పులు లేకుండ చదువగలరు. చక్కని దస్తూరీ కుదుర్చు కొందురు. కూడిక, తీసివేత, గుణకారములపై చిన్న లెక్కలు చేయగలరు. ఉత్పాదకమగు ఒక పరిశ్రమను (నూలువడుకుట వంటిది) ఐచ్ఛికముగ నేర్చుకొందురు.

విలేఖరి వ్రాసిన రెండవ విషయముకూడ శోచనీయముగ నున్నది. చేతిపరిశ్రమలద్వారా నేర్పబడు విద్య మొత్తము ఏడేండ్ల పరిమితిమీద స్వయంపోషకముగ నుండగలదని, ఉండవలెనని నా ప్రతిపాదన మొదటి రెండు సంవత్సరములలో కొంత నష్టము రావచ్చునని నేను చెప్పియే యుంటిని.

మధ్యయుగపు పద్ధతులలో చెడుగుండవచ్చును. కాని ఆ కాలపు వస్తువులైనంతమాత్రాన నేను వాటిని తోసివేయను. రాట్నము నిస్సందేహముగ పాతయుగపు వస్తువే. కాని అది చిరస్థాయిగ నుండుటకే వచ్చినట్లు కనబడుచున్నది. వస్తువదే. అయినను ఇప్పుడది స్వేచ్ఛకు, ఐకమత్యమునకు గుర్తు అయినది. బ్రిటిషు తూర్పు ఇండియా కంపెనీ రాకతో అది బానిసత్వమునకు చిహ్నమయ్యెను. అట్లే చేతిపను లొకప్పుడు యంత్రాగారపు కూలిపనులై యుండినను, ఇప్పుడవి జాతీయ విద్యకు పూర్ణమైన గురుతులు, ప్రాతిపదికలు కాగలవు. విద్యాశాఖలోని పెద్ద ఆఫీసర్లు, తదితరులు, సదుద్దేశంతోనైనను, అపోహతో దీనికి వ్యతిరేకత చూపినను, రాష్ట్రమంత్రులలో భావనాపటిమ, ధైర్యము ఉన్నచో ఈ ప్రణాళికకు అవకాశమిచ్చి అమలు జరిపించి చూడనగును.

ప్రొఫెసరు కె. టి. షాగారి నిర్బంధ విద్యాసేవావిధానము మంచిదే కావచ్చునని మొదట ఒప్పుకొనికూడ తరువాత మరల దానికై విచారించుచు విలేఖరి ఇట్లనుచున్నారు :

"చదువుకున్నవారిని నిర్బంధించి ఉపాధ్యాయత్వము చేయుమనుట మాదృష్టిలో చాల దౌర్జన్యము. విద్యాసేవకై ఐచ్ఛికముగ జీవిత మర్పించి (అట్టిది సాధ్యమైనంతవరకు) బిడ్డల మనోబుద్ధులను ఉత్తేజింపజేయగల స్త్రీ పురుషులు పాఠశాలను నడుపవలెను. మన మింతకుపూర్వము మన యువతీయువకులతో లెక్కలేని విద్యాప్రయోగములు చేసియున్నాము. కాని ఈ నూతనప్రయోగముయొక్క ఫలితము మనకు సర్వవినాశకరమే. కనీసమొక అర్ధశతాబ్దకాలము ఈ నష్టమునుండి మనము కోలుకొనలేము. విద్యాబోధకునికి ప్రత్యేకశిక్షణ అక్కరలేదని, పుట్టుకతోనే ప్రతివాడును అధ్యాపకుడు కాగలడను అభిప్రాయముపై ఇదంతయు ఆధారపడియున్నది. కె. టి. షా వంటి సుప్రసిద్ధునికిట్టి ఆలోచన యెట్లుతట్టినదో బోధపడదు. ఇదొకదిగ్భ్రమ. దీనిని ఆచరణలో పెట్టినచో విషాదకరమగు ఫలితము తప్పదు. మరియు ప్రతిఒక్కడును పిల్లలకు చేతిపనులు నేర్పుటకెట్లు పనికివచ్చును ?"

ప్రొఫెసరు షా తన ప్రతిపాదనను తానే సమర్థించుకొనగలరు. కాని ఈ విలేఖరి కొకమాట జ్ఞప్తికి తేవలసియున్నది. ఇప్పటి ఉపాధ్యాయులు ఐచ్ఛికముగ గాక, పొట్టకూటికై పనిచేయు కూలివారు. ప్రొఫెసరు షా ప్రణాళికలో అధ్యాపకులగుటకు ముందు దేశభక్తి, త్యాగము, కొంతసంస్కృతి, ఒక చేతిపరిశ్రమలో కొంతశిక్షణ ఉండవలెను. ఆయనసలహా సారవంతము, పూర్తిగ అనుసరణీయము, కనుక బాగుగ యోచింపదగినది. పుట్టుకతోనే అధ్యాపకులగువారు కావలెనన్నచో కల్పాంతమువరకును వేచియుండవలసినదే. సాధ్యమైనంత తక్కువ వ్యవధిలో అధ్యాపకులు చాలమంది తయారు

కావలెనని నా వినమ్ర ప్రతిపాదన. విద్యావంతులగు యువతీ యువకులను నెమ్మదిగ ప్రోత్సహించవలెను. ఐచ్ఛికముగ పని చేయుటకు వారు ముందుకురానిచో, అదియు కష్టమే. శాసనోల్లంఘనోద్యమములో వారు ఎంతోకొంత పాల్గొనినవారే. జీవనభృతిమాత్రము స్వీకరించుచు, దేశ నిర్మాణసేవకై ఇప్పుడీ పిలుపును నిరాకరింతురా?

మరియు విలేఖరి ఇట్లడుగుచున్నారు :

"(1) చిన్నపిల్లలు చేయుపనిలో ముడివస్తువుల తరుగుదలకు మనము చాల అవకాశ మీయవద్దా?

(2) తయారైన వస్తువుల అమ్మకము ఏదైన కేంద్రసంస్థద్వారా జరుగునా? దానికి డబ్బెక్కడిది?

(3) ఈ సంస్థలలో వస్తువులు కొనవలెనని ప్రజలను నిర్బంధించవలెనా?

(4) ఇవే వస్తువులను స్వయముగ తయారుచేసికొనుచున్న ఇతర సంఘముల గతి యేమికావలెను? ఆ సంఘములపై వీని ప్రభావమెట్లుండును?"

నా జవాబు లివి :

1. ముడిపదార్థములలో తరుగు ఉండనేయుండును. కాని మొదటి సంవత్సరాంతములోపలనే ప్రతి విద్యార్థివలనను కొంత లాభముకూడ వచ్చును.

2. తయారైన సరుకులను చాలవరకు ప్రభుత్వము స్వంత ఉపయోగమునకై తీసికొనును.

3. స్వజాతి బాలబాలికల చేతులతో తయారగు వస్తువు

లను కొనవలెనని ఎవరిని నిర్బంధింపబని లేదు. తమ దేశపు బిడ్డలు దేశముకొరకు తయారుచేసిన వస్తువులను క్షమనీయమగు గర్వముతోను, దేశ భక్తియుతమగు ఆనందముతోను వారు కొనవలసియే యుందురు.

4. గ్రామపరిశ్రమల విషయమున పోటీయెప్పుడును ఉండదు. ఇదివరకు వాడుకలోనున్న గృహపరిశ్రమలతో అక్రమమగు పోటీకిపోకుండ తయారుకాగల వస్తువులే తయారగును. ఇట్లు ఖాదీ, చేకాగితము, తాటిబెల్లము మొదలగు వాటిలో ఎవరికిని పోటీయుండదు.

హారిజన్ : 16-10-'37.

## 29

## ఒక అమెరికనునితో సంభాషణ

డాక్టరు జాన్ డి బోయర్ దక్షిణఇండియాలో ఒక విద్యాసంస్థను నడుపుచున్నారు. బేసిక్ విద్యావిధానమును శ్రద్ధతో పరిశీలించినవారాయన. వార్ధాలో శ్రీ ఆర్యనాయకం, కాకా కలేల్కరు గార్లతో కొన్ని ముఖ్యవిషయములు చర్చించి గాంధిజీనికూడ కొలది నిమిషములపాటు దర్శింపగోరెను. నూతన విద్యావిధానము అహింసాయుతమగుటచే, అది తనను అత్యంతము ఆకర్షించినదని ఆయన గాంధిజీతో అనెను. కాని పాఠ్యక్రమములో దానికంత తక్కువస్థానమేల ఈయబడెనో ఆయనకు బోధపడలేదు.

గాంధిజీ ఇట్లు జవాబు చెప్పెను : "అది మిమ్ము ఆకర్షించిన దానికిగల కారణము చాల సమంజసము. అయితే పాఠ్య క్రమమంతయు అహింసను కేంద్రముగ నుంచుకోనక్కర లేదు. అహింసాయుతమగు మేధస్సునుండి అది ఉత్పన్నమైన దని తెలిసికొన్న చాలును. దాని నామోదించిన వారందరు అహింసావాదులు కానక్కరలేదు. ఉదాహరణకు : కమిటీ సభ్యులందరి మతము అహింస కాదు. శాకాహారులందరును అహింసలో నమ్మకమున్నవారు కారు. ఆరోగ్యముకొరకు వారు శాకాహారులు కావచ్చును. అట్లే ఈ విధానము నంగీక రించువారందరును అహింసావ్రతులు కా బనిలేదు."

డాక్టరు బోయర్ :—ఈ ప్రణాళిక అహింసా జీవిత సిద్ధాంత ముపై ఆధారపడియున్నందుచే దీనితో సంబంధము పెట్టు కొనుట కిష్టములేని విద్యావేత్తలుకూడ కొందరున్నారు.

గాంధిజీ:—అవును. నా జీవిత సిద్ధాంతముపై ఖాదీ ఆధార పడియున్నందున ఖాదీని స్వీకరింపని కొందరు ప్రముఖులను నే నెరుగుదును. దానికి నే నేమి చేయగలను? ప్రణాళిక యొక్క హృదయము నిశ్చయముగ అహింసయేయని ప్రత్యక్ష ముగ నేను నిరూపించగలను. అయితే దీనియెడల ఉత్సా హము చూపువారెవరు? కోట్లాదిప్రజలకు తిండిలేని దేశ ములో ఈ విధానము తప్ప తమబిడ్డల శిక్షణకు వేరొక మార్గములేదని నమ్మకమున్నవారు గుర్తించినారు. దీనిని

అమలుజరిపినచో ఇదియొక నూతన ఆర్థికవ్యవస్థకు దారి తీయుననికూడ వారెరుగుదురు. నాకిదే చాలును. కాంగ్రెసు వారు అహింసను జీవితవిధానముగ గాక స్వాతంత్ర్య సంపాదనకు మాత్రమే సాధనముగ అంగీకరించినట్లే ఇదియును. ఇండియా అంతయు అహింసను మతధర్మముగను, జీవిత మార్గముగను జేసికొన్నచో ఇప్పటికిప్పుడు మనము ప్రజాస్వామ్యమును స్థాపించుకొనగలము.

డాక్టరు బోయర్ :—నాకొక విషయము బోధపడలేదు. నేను సామ్యవాదిని. నేను అహింసావాదినికూడ అగుటచే నాకీ ప్రణాళిక పూర్తిగ నచ్చినను, సామ్యవాదదృష్టిలో దీనివలన ఇండియాకు ప్రపంచముతో సంబంధము విడిపోవునేమో యని తోచుచున్నది. యావత్ప్రపంచముతో మనము కలిసియుండవలె గదా! ఈ కలయిక సామ్యవాదము ద్వారా జరిగినట్లు మరి దేనివలనను జరుగదు.

గాంధిజీ :—నాకా భయములేదు. ప్రపంచమునుండి విడివడవలెనని మేము కోరము. అన్ని జాతులతో మాకు సంబంధబాంధవ్యము లుండును. కాని ఈ ప్రస్తుత బలాత్కార సంబంధము పోవలెను. మే మొకరిని పీడింపము. ఒకరి పీడ సహించము. ఈ ప్రణాళికద్వారా బిడ్డలనందరిని నిర్మాణకుశలురుగ చేసి ఈ జాతియొక్క రూపము మార్చివేయవలెనని మా ఆశయము. ఈ మార్పు ప్రజలందరిలో వ్యాపించవలెను.

ఇది ప్రపంచమునుండి విడిపోవుట కాజాలదు. కొన్ని సరుకులను తయారుచేయలేని జాతులు ఇతర జాతులతో వస్తు మార్పిడి చేసికొందురు. కాని, ఇచ్చువారు పుచ్చుకొనువారిని బాధింపరాదు.

డాక్టరు బోయర్ :—కాని, ఇతర దేశవస్తువు లేవియు అవసరము లేనంతగ మీ జీవితావసరములను తగ్గించుకొన్నచో, మీ కా దేశములతో సంబంధము తెగిపోవును. అమెరికా యెడల మీ బాధ్యతను గుర్తింతురుగాక యని నేను కోరుదును.

గాంధిజీ :—పరులను పీడించక, పరులపీడ బడకుండుట వలననే మే మమెరికాకు బాధ్యులము కాగలము. అప్పుడు అమెరికాకూడ మమ్ముల ననుసరించును. ఉభయుల మధ్యను స్వేచ్ఛతో ఇచ్చిపుచ్చుకొను సంబంధముండును.

డాక్టరు బోయర్ :—కాని, మీ జీవితమును సరళ మొనర్చుకొని, యంత్ర విధానమును మీరు నిర్మూలింపదలచినారు.

గాంధిజీ :—మా దేశమునకు కావలయు వస్తువుల నన్నిటిని మూడు కోట్లమందికి బదులు, ముప్పదివేల మందితో చేయించగలిగినచో నాకభ్యంతరము లేదు. కాని ఇందువలన మిగతవారందరును నిరుద్యోగులుగ, సోమరులుగ చేయబడరాదు. సామ్యవాదులు యంత్రములను తెచ్చిపెట్టి పనిచేయు గంటలు దినమున కొకటి రెండు మాత్రమే అనగలరు. కాని నా కది యిష్టముండదు.

బోయర్ :—వారికి విశ్రాంతి యుండవలె కదా!

గాంధిజీ :—విశ్రాంతి హాకీ యాడుటకేనా?

బోయర్ :—దానికేకాదు; నిర్మాణాత్మకములగు చేతి పరిశ్రమలవంటి పనులకు గూడ.

గాంధిజీ :—నే నన్నదికూడ అంతే. కాని దినమున కెనిమిది గంటలు వారు చేతితో వస్తూత్పత్తి చేయవలెను.

బోయర్ :—ఇంటికొక రేడియో, మనిషికొక మోటారు కారు ఈయగల సాంఘిక వ్యవస్థను మీరు వాంఛించరు. అది అమెరికా అధ్యక్షుడు హూవరు సూత్రము. అతడన్నది ఒకటికాక రెండు రేడియోలు, రెండు కార్లు.

గాంధిజీ :—అన్ని కార్లైనచో, ఇక నడచుటకు చోటుండదు.

బోయర్ :—నిజమే. ఇట్టి ప్రమాదముల వలన మా దేశమున ఏడాదికి 40,000 చావులు, అంతకు మూడురెట్లు అంగవైకల్యములు కలుగుచున్నవి.

గాంధిజీ :—ఏమైనను, గ్రామము లన్నిటికి రేడియోలు వచ్చువరకు నేను బ్రతుకబోను.

బోయర్ :—పండిత జవహర్‌లాల్ సర్వ సమృద్ధిని కలిగించు ఆర్థికదృష్టితో యోచించుచుండును కదా!

గాంధిజీ :—అవును. కాని, సర్వసమృద్ధి యననేమి? లక్షలాది టన్నుల గోధుమలను, మీ దేశములోవలె, నాశనము చేయుట కాదు.

బోయర్ :—ఔను. ధనికతత్వము యొక్క పాపఫలిత మది. వారిప్పుడు గోధుమలను ధ్వంసము చేయుటలేదు. గోధుమపంట పెట్టకుండుటకుగాను వారికి లంచమీయబడు చున్నది. గ్రుడ్లధర పడిపోవుటచేత ప్రజ లొకరిమీద నొకరు వేడుక కొరకు గ్రుడ్లను రువ్వుకొనుచుండెడువారు.

గాంధిజీ :—అదే మాకక్కర లేనిది. సమృద్ధి యనగా వలసినంత తిండి, బట్ట, మనోవికాసము కలిగించు విద్య అని మీ రంగీకరించినచో, నాకు చాలును. జీర్ణించుకొనలేని తిండిని పొట్టకెక్కించుటగాని, అవసరమునకు మించిన వస్తుసంచయము గాని కూడనిపని. ఇండియాలో దారిద్ర్యము, దుఃఖము, మురికి, దుమ్ము—ఇవియు నేను కోరను.

బోయర్ :—కాని మీరు దరిద్రనారాయణుని పూజించుచు, పేదరికమును శ్లాఘింతురని పండిత జవహార్‌లాల్ స్వీయచరిత్రలో వ్రాసినారు.

గాంధిజీ :—(నవ్వుచు) ఔనౌను.

హరిజన్ : 12-2-'38.

# 30

## మత విద్య

ఒక ముస్లిం విలేఖరి ఇట్లు వ్రాయుచున్నారు :

"నాలుగు నెలలనుండి వార్ధావిద్యా విధానమును గూర్చిన అభిప్రాయములు ఉర్దూ పత్రికలలో ప్రచురింపబడుచున్నవి. ఆ విద్యా నివేదిక

నెవ్వరును శ్రద్ధతో చదివినట్లుగాని, తగు యోచన చేసినట్లుగాని తోచదు. ఇది మామూలే. ఆక్షేపణలు మూడు విషయములకు సంబంధించి యున్నవి:

(1) మతవిద్య పూర్తిగ వదలివేయ బడినదని,

(2) బాలబాలికలను కలిపి శిక్షణ నీయవలెనని,

(3) అన్ని మతములను గౌరవించుట నేర్పవలెనని,

ఈ యాక్షేపణలు ఉర్దూ పత్రికలనుండి సేకరింపబడినవి.''

ప్రత్యేక సాంప్రదాయములకు చెందిన మతబోధ బుద్ధిపూర్వకముగ వదలివేయబడినది. రాజమత మనునది ఒకటుంటేనేగాని మతబోధ కష్టమైనపని. ఎందువల్ల ననగా అప్పుడన్ని మతములకు స్థానమీయవలెను. ఆ బోధ గృహమునందు జరుగుట ఉత్తమము. విద్యార్థులట్టి తర్ఫీదు పొందుటకు సరిపడిన సమయమును వారికి ప్రభుత్వము వదలవలెను. పాఠశాలలోనే ప్రత్యేకముగ అట్టి శిక్షణ పొందుటకుగూడ ప్రభుత్వము అవకాశము కల్పించవచ్చును. కాని అధ్యాపకుల కీయవలసిన ప్రతిఫలమునకు ఆయా మత సాంప్రదాయకులే బాధ్యులగుదురు.

బాలబాలికలను కలిపి విద్య చెప్పుటను గూర్చి జకీర్ హుస్సేన్ కమిటీవారు ఎట్టి నిర్బంధమును చేయలేదు. ప్రత్యేక బాలికా పాఠశాలలు కావలెనన్నచోట ప్రభుత్వము అట్టి అవకాశము గలిగించవలెను. ఇందునుగూర్చి ఇదమిద్ధమను నిర్ణయము లేదు. కాలానుగుణముగ అది క్రమపద్ధతికి రాగలదు. నే నెరిగినంతలో కమిటీ సభ్యులలో ఏకాభిప్రాయము లేదు. నామట్టుకు మనసులో దాపరికము లేదు. బాల

బాలికలను కలుపరాదనుటకున్నన్ని కారణములు కలుపవచ్చు ననుటకును ఉన్నవి. ఈ ప్రయోగ మెచట చేయబడినను నేను దాని కెదురు చెప్పను.

మతములయెడ సమాన గౌరవమును బోధించు విషయమున నా యభిప్రాయములు చాల నిశ్చితములైనవి. అట్టి శుభ సమయము వచ్చిననేగాని, వర్గములమధ్య నిజమైన ఏకీభావ మేర్పడదు. మతములలో తమ మతమే శ్రేష్ఠమని పిల్లలకు బోధించినచో, వారిలో స్నేహభావము పెంపొందదు. విరోధభావము జాతి మొత్తమునకు వ్యాపించినచో, ప్రతిమతము పేరిట ప్రత్యేక పాఠశాలలును, పర మతములను దూషించు హక్కును ఏర్పడును. లేక, మత మను మాటను ఉచ్చరించుట గూడ నిషేధింపబడవలెను. ఇట్టి స్థితి తలచుకొనుటకే భయంకరము. ప్రధానములగు నీతి ధర్మసూత్రములు అన్ని మతములందును సమానమే. వీనిని పిల్లలకు తప్పక బోధింపవలెను. నూతన విద్యావిధానమున ఈ మాత్రపు మతబోధ చాలును.

హరిజన్ : 16-7-'38.

# 31

## బేసిక్ విద్యా ప్రణాళికకు అగ్నిపరీక్ష—I

### బూజు దులుపుట

ప్రతినిధులు గాంధీజీని చాల ప్రశ్నలడిగిరి. వారి మొదటి సందేహమిది : బేసిక్ విద్య చిరకాలము నిలువగలదా, లేక

అది తాత్కాలికపు ఏర్పాటా? కాలక్రమమున చేతిపరిశ్రమ లంతరించి, యంత్రపరిశ్రమలు రాకతప్పదని ప్రఖ్యాత విద్యా వేత్తల అభిప్రాయము. న్యాయము, సత్యము, అహింసపై ఆధారపడి బేసిక్ విద్యనుపొందు సంఘము బలీయమగు యంత్ర విధానపు తాకిడికి నిలువగలదా?

గాంధిజీ జవాబు: "ఈ ప్రశ్న అనుభవపూర్వకమైనది కాదు. మన ప్రస్తుతకార్యక్రమమున కది అడ్డురాదు. తరములు గడచినపిమ్మట ఏమగునని కాదు మనప్రశ్న. గ్రామ సీమలలో బ్రతుకు ప్రజాకోట్ల అవసరాలను ఈ విద్యావిధానము తీర్చగలదా యన్నదే సరియైన ప్రశ్న. గ్రామాలను నశింపజేయునంతటి యంత్రపరిశ్రమ ఈ దేశమును నింపునని నే ననుకొనను. ఇదెప్పటికిని పల్లెల దేశముగనే యుండును."

'నూతన కాంగ్రెస్ అధ్యక్షుని యెన్నికతో కాంగ్రెసు విధానము మారినచో బేసిక్ విద్య అప్పుడేమగును?' అని తరువాతి ప్రశ్న.

గాంధిజీ:—"ఇది లేనిపోని భయము. కాంగ్రెసు ఉద్దేశములలోని మార్పు బేసిక్ విద్యాప్రణాళికను తాకదు. అసలు మార్పున్నచో, అది ఉన్నత విషయములనుగూర్చి యుండును. మీరిచట మూడువారాల ఉపాధ్యాయ శిక్షణనుపొంది, తిరిగి వెళ్లి మీ విద్యార్థులకు బేసిక్ శిక్షణ నిచ్చు యుద్దేశముతో వచ్చియున్నారు ఇది మీ యుద్దేశమును సార్థకపరచగలదను

విశ్వాసము మీకుండవలెను.

"యంత్రపరిశ్రమల యోచనలు జరుగుట సంభవమేయైనను, ఈ నాడు కాంగ్రెసు పెట్టుకొన్న గమ్యము ఇండియాను యంత్రపరిశ్రమలతో నింపుట కాదు. జాతీయ కాంగ్రెసు బొంబాయి సభలో చేసికొన్న తీర్మానము ప్రకారము గ్రామ పరిశ్రమల పునరుద్ధరణయే దాని ఆశయము. వల్లమాలిన యంత్రపరిశ్రమల ప్రణాళికలతో మీరు ప్రజలలో చైతన్యము తీసికొనిరాలేరు. దానివలన వారి ఆదాయము ఒక డబ్బుకూడ పెరుగదు. కాని అఖిలభారత చరఖాసంఘమును గ్రామపరిశ్రమల సంఘమును ఒక సంవత్సరములోపల కొన్నిలక్షలు వారి చేతపెట్టగలరు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును, మంత్రులును ఏమైనను, కాంగ్రెసు నిర్మాణ కార్యప్రణాళికకు ఏ యాపదకాని వచ్చునని నే ననుకొనను ఈ ప్రణాళికలను ప్రారంభించినది కాంగ్రెసేయైనను చాలకాలముగ అవి స్వతంత్రముగ వాటి బ్రతుకవి బ్రతుకుచు, తమ ఉనికిని పూర్తిగ సార్థకముచేసికొన్నవి. బేసిక్ విద్య వీటినుండి ఉద్భవించిన శాఖయే. విద్యామంత్రులు మారుచున్నను దీనికి మార్పుండదు. కనుక బేసిక్ విద్యయందభిమానమున్నవారు కాంగ్రెసు రాజకీయములనుగూర్చి బాధపడరాదు. ఈ కొత్త ప్రణాళిక దాని మంచినిబట్టి బ్రతుకును, లేదా చెడ్డనుబట్టి నశించును.

"ఈ ప్రశ్నలు నాకు తృప్తినీయవు. బేసిక్ విద్యతో వాటికి సూటి సంబంధము లేదు. అవి మనల నే మాత్రమును ముందుకు నడుపజాలవు. ఈ ప్రణాళికనుగూర్చిన సూటిప్రశ్నలుంటే అడుగుడని నేను కోరుచున్నాను. అందుపై నాసలహాలను నే నీయగలను."

## ముఖ్యభావము

సభకువెళ్లకముందు ఒక మిత్రుడు గాంధిజీ నిట్లు ప్రశ్నించెను : "తకిలీతో సమన్వయింపలేని ఏ విషయమునుగాని విద్యార్థులకు బోధింపరాదనియా ఈ ప్రణాళికలోని ప్రధాన విషయము ?"

సభాముఖమున, పై ప్రశ్నకు సమాధానముగ గాంధిజీ ఇట్లనెను : "ఇది నాపై నొక అపవాదు. బోధన అంతయు ఏదో ఒక ముఖ్యమగు చేతిపరిశ్రమకు సంబంధించి యుండవలెననియే నే నన్నది. ఏడు లేక పదేండ్ల పిల్లవానికి చేతిపరిశ్రమద్వారా విద్యగరపునపుడు ఆ పరిశ్రమతో కలియని విషయములన్నిటిని ప్రారంభదశలో వదలివేయవలెను. అట్లు చేయుటవలన మొదట వదలివేసిన చాల విషయాలను క్రమక్రమముగ ఆ పరిశ్రమతో కలుపుటకు సాధ్యమగును. ప్రారంభములో ఇట్లు విడిచివేయుపద్ధతి నవలంబించుటవలన మీ శక్తిని, విద్యార్థులశక్తిని భద్రపరచుకొనగలరు. ఈనాడు మనకీవిషయమున పనికివచ్చు పుస్తకములు లేవు. దారిచూప

గల పూర్వానుభవములు లేవు. కనుక మనము నిదానముగ పురోగమించవలెను. ఉపాధ్యాయుడు తన మనస్సును నిర్మల ముగ నుంచుకొనుట ఇందు ప్రధానవిషయము. చేతిపరిశ్ర మతో మీరు సమన్వయింపలేని విషయములున్నచో మీరు నిరుత్సాహపడరాదు. వాటి నట్లేవదలి, అప్పటికి సమన్వయింప గలిగిన విషయములతోనే ముందుకుపోవలెను. వాటిని సరిగా సమన్వయింపగలిగిన మఱియొక ఉపాధ్యాయుడు బయలుదేరి మార్గదర్శి కావచ్చును. ఇట్లు పలువుర అనుభవజ్ఞానమును మీరు సమీకరింపగలిగినచో కావలసిన పుస్తకములుకూడ తయారగును. మీ తరువాతివారి పని తేలికయగును.

"క్లిష్టముగ కష్టపట్టువానిని వదలివేయుచుండుట ఎంత కాలమని మీ రడుగవచ్చును. 'జీవితకాలమంతయు' అని నా జవాబు. మొదట వదలివేసిన విషయములు చాలవరకు మరల మరల చేతిపరిశ్రమతో కలుపబడినవని, అప్పటికిని కలుపబడని వానిని పూర్తిగ వదలివేయవలసినదేయని స్పష్ట మగును. నేనుపొందిన జీవితానుభవమిది. నే నిట్లెన్నో విష యములను వదలివేసియుండనిచో, నే నెన్నో పనులు నెరవేర్చ గలిగియుండెడు వాడనుకాను.

"మన విద్యాపద్ధతి పూర్తిగ మార్పు చెందవలసియున్నది. చేతిపనులద్వారా మెదడు శిక్షణ పొందవలసియున్నది. నేను కవినైతే, అయిదువ్రేళ్లలోని శక్తినిగూర్చి పద్యములు కట్టి

యుందును. మనస్సే ముఖ్యమని, కాలు చేతులలో ఏమియు లేదని మీరేల భావించవలెను? చేతికితగిన శిక్షణనీయక పుస్తకపుచదువను బళ్లగాడిలోపడి యుండువారి జీవితములో మాధుర్యము లేదు. వారి సర్వశక్తులు సుశిక్షితములు కాజాలవు. వట్టి పుస్తకజ్ఞానములో బిడ్డలకు రుచియుండదు. అది వారిదృష్టినంతను ఆకర్షింపలేదు. మాటలతో పిల్లవాని మెదడు విసిగిపోయి, మనస్సు అటు నిటు పరుగిడును. చేయి చేయరాని పనులు చేయును; చెవి వినరానివానిని వినును; కన్ను చూడదగనివానిని చూచును. చేయవలసిన పనులనుమాత్రమవి చేయవు. సరియైన పని నెన్నుకోగల శిక్షణ వానికీయబడలేదు. అట్టివిద్య తరుచు వాని వినాశముకే దారితీయును. మంచి చెడుగుల విచక్షణ చేయలేనిది, మంచిని తీసికొని చెడుగును విసర్జింపచేయలేనిది అగు విద్య విద్యకాదు.''

### చేతులద్వారా మానసిక శిక్షణ

చేతిపని మనస్సునెట్లు వికసింపజేయగలదో స్పష్టపరచుమని శ్రీమతి ఆశాదేవి గాంధిజీని అడిగెను. గాంధిజీ ఇట్లు జవాబిచ్చెను :

''నేటి పాఠశాలలలోని మామూలు పాఠ్యక్రమమునకు తోడుగ ఒక చేతిపనినిగూడ చేయించుటయనునది పాత భావము. అనగా రెండును పరస్పరసంబంధములేని రెండు పనులగును ఇది ప్రమాదకరమగు పొరపాటుగ నాకు తోచు

చున్నది. ఉపాధ్యాయుడు చేతిపరిశ్రమను నేర్చుకొని తన జ్ఞానమును ఆ పరిశ్రమతో సమన్వయింపవలెను. అపుడా పరిశ్రమద్వారా అతడు విద్యార్థికి జ్ఞానమును ఈయగలుగును.

"ఉదాహరణకు నూలువడుకు పరిశ్రమను తీసికొందము. నాకు గణితము తెలిసిననేకాని తకిలీతో ఎన్ని గజముల దారము వడికితినో చెప్పలేను. చెప్పవలెనంటే అంకెలు, వాని కూడిక, తీసివేత, గుణకార, భాగహారములు రావలెను. చిక్కులెక్కలు చేయవలెనన్న బీజగణితముకూడ నేర్చుకొనవలెను. ఇక్కడ రోమను లిపికాక, హిందూస్థానీ లిపివాడమని నే నందును.

"తరువాత రేఖాగణితమును తీసికొందము. తకిలీకంటె ప్రత్యక్షమగు వృత్తము మరేమున్నది. యూక్లిడ్ పేరు ఉచ్చరించకుండ తకిలీబిళ్లద్వారా వృత్తమునుగూర్చిన విషయములన్నియు విద్యార్థులకు చెప్పవచ్చును.

"నూలువడుకుటద్వారా భూగోళము, చరిత్ర పిల్లవానికెట్లు బోధింపనగునని మీరడుగవచ్చును. 'ప్రత్తి—మానవచరిత్ర' అను గ్రంథము నొకసారి నేను చూచితిని. అది యొక అద్భుతమగు కథవలె నన్ను ముగ్ధునిచేసెను. ప్రాచీన చరిత్రతో అది ప్రారంభించెను. ఎక్కడ, ఎట్లు ప్రత్తి మొదట పండించబడెనో, అది వృద్ధిచెందిన దశలు, వివిధదేశముల మధ్య జరిగిన దూదివ్యాపారము — ఇత్యాది విషయము

లన్నియు అందుండెను. ఈ దేశముల పేర్లను పిల్లవానికి చెప్పుటలో, వాటికి సంబంధించిన చరిత్ర, భూగోళజ్ఞానము కొంత యిచ్చుచున్నట్లేకదా! ఏ రాజుల పరిపాలనలో ఎట్టి వర్తకపు ఒడంబడికలు జరిగెను? కొన్ని దేశములు దూదిని, మరికొన్ని దేశములు బట్టలను ఏల దిగుమతి చేసికోవలెను? ప్రతిదేశము తన ప్రత్తిని తానెందుకు పండించుకొనలేదు? ఈప్రశ్నలు అర్థశాస్త్రమునకును, ప్రాథమిక వ్యవసాయశాస్త్ర జ్ఞానమునకు మనలను తీసికొనివెళ్లును. వివిధరకముల ప్రత్తి అది పండుభూముల స్వభావము, పండించువిధము, ఆ రక ములు దొరకుచోట్లు మొదలగు విషయములను పిల్లవానికి చెప్పవలసియుండును. ఇట్లు తకిలీపనిలో బ్రిటిషు తూర్పు ఇండియా సంఘచరిత్ర అంతయుకూడ వచ్చును. ఆ సంఘము ఇచటి కెందుకువచ్చెను? మన వడుకు పరిశ్రమ నెట్లు ధ్వంసము చేసిరి? మొదట వ్యాపారదృష్టితో వచ్చినవారికి క్రమముగ రాజ్యకాంక్ష యెట్లుకలిగెను? మొగలు, మహారాష్ట్ర రాజ్య ముల పతనమునకది కారణమై, బ్రిటిషు రాజ్యస్థాప యెట్లు జరిగెను? తరువాత మన కాలమున ప్రజాందోళన, స్వాతంత్ర్యో ద్యమము ఏట్లు బలపడెను? ఒకదాని వెంట నొక చరిత్ర వచ్చును ఇట్టి నూతన ప్రణాళికలోని విద్యావకాశములకు అంతుండదు. మామూలు పుస్తకపఠనములో మనస్సును, జ్ఞాపకశక్తిని నొక్కి-వేయనక్కర లేకుండ, ఎంత త్వరలో

పై విషయములు అవగాహనకాగలవో చూడుడు.

"దీనినే మరికొంత విపులపరచెదను. జీవశాస్త్రజ్ఞుడు ఆ శాస్త్రమున ఘటికుడు కావలెనన్నచో, దానితోపాటు మరెన్నో ఇతర శాస్త్రములను కూడ నేర్వవలసి యుండును. ఇట్లే బేసిక్ విద్య కూడ ఒక శాస్త్రమైనచో, అనేక ఇతర విద్యలతో మనకది పరిచయము కలిగించును. తకిలీ ఉదాహరణమును గూర్చి మరికొంచెము ఆలోచింతము. ఉపాధ్యాయ విద్యార్థి ఏదో యింత దారము వడికివేయుట చాలదు. ఇందును అతడు ఉత్తీర్ణుడు కావలసినదే కాని, తకిలీయొక్క అంతర్యమును గ్రహించుటయందు ముఖ్యముగ అతడు దృష్టి నిలిపి అన్ని విషయములు తెలిసికోవలెను. తకిలీకి ఇత్తడిబిళ్ళ, ఉక్కుకదురు ఎందుకుండవలెనని తన్నుతాను ప్రశ్నించుకొనవలెను. పూర్వకాలపు తకిలీబిళ్ళ మట్టి లేక పలకరాతితోను, కదురు వెదురుపుల్లతోను చేయబడుచుండెను. తరువాత శాస్త్ర దృష్టితో దానిని మార్చినారు. బిళ్ళను ఇత్తడితోను, కదురు ఉక్కుతోను చేయుటకును, బిళ్ళవ్యాసము మార్చకుండ అట్లే యుంచుటకును కారణమేమని ఉపాధ్యాయుడు ప్రశ్నించుకొనవలెను. ప్రశ్నలకు తృప్తికరమగు సమాధానము వచ్చి, అందలి గణితభాగము అవగాహనమైనపుడు విద్యార్థి మంచి ఇంజనీరు కాగలడు. తకిలీ అతని కామధేనువగును. దానిద్వారా నేర్వగల విషయము లనంతముగ నుండును. మీా సామర్థ్యముపై,

విశ్వాసముపై అది ఆధారపడును. ఈ ప్రణాళికను మీరు గట్టిగ చేపట్టినచో మీ విశ్వాస సామర్థ్యములు సద్వినియోగ మగును. 'నేనీ కార్యమును సాధింతును; లేదా చనిపోదును' అని మీకు మీరు ప్రతిజ్ఞ చేసికోగలరు

"నూలు పరిశ్రమ నే నెరిగినదగుటచే, దానివిషయ మింతగా చెప్పితిని. నేను వడ్రంగినైనచో నా పిల్లవాని కీవిషయము లన్నియు వడ్రపుపని ద్వారా బోధింతును. కాగితపు అట్టపని చేయువాడనైతే దాని ద్వారా బోధింతును.

"స్వతంత్రయోచనాపరులైన విద్యావేత్తలు మనకిపుడు కావలెను. విద్యార్థుల కేమిచెప్పుదుమా యని అనుదినమును పట్టుదలతో యోచించువారు కావలెను. పాతపుస్తకముల నుండి ఉపాధ్యాయుడీజ్ఞానమును పొందలేడు. తనంత తాను చూచి, ఆలోచించి గ్రహించిన విషయములను తననోట తాను, ఒక చేతిపని సహాయమున పిల్లలకు బోధింపవలెను. బోధనా పద్ధతిలోను, ఉపాధ్యాయుని దృక్పథములోను ఇదియొక గొప్ప మార్పు ఇంతవరకు మీరు ఇన్‌స్పెక్టర్ల రిపోర్టులపై ఆధార పడియుండిరి. వారి ఆజ్ఞల ప్రకారము పనిచేసి మీకును మీ సంస్థలకును అధిక రాబడి కొరకు యత్నించినారు. నూతన ఉపాధ్యాయుడు వానికై చూడడు. 'నా సర్వశక్తులనుపయో గించి, నా విద్యార్థిని బాగుచేయగలిగినచో, నా బాధ్యత నెర వేరినట్లే. అది నాకు చాలును' అని యతడు తలచును."

హరిజన్ : 18-2-'39.

## బేసిక్ విద్యా ప్రణాళికకు అగ్నిపరీక్ష—II

### చేతిపని ద్వారా ఉపాధ్యాయ శిక్షణ

ప్రశ్న :—ఉపాధ్యాయ విద్యార్థుల కీయబడు శిక్షణంలో ముందొక చేతిపరిశ్రమను వేరుగ నేర్పి, తద్వారా శిక్షణ విధానమును నేర్పుట సులువైన మంచి పద్ధతి కాదా? అట్లుగాక తాము ఏడేండ్ల బాలురైనట్లు భావించుకొన వలసినదనియు, అక్కడినుండి విద్యనంతను చేతిపనిద్వారా నేర్చుకొనవలెనను సలహా ఇపుడు వారి కీయబడుచున్నది. ఈ ప్రకారము వారు పిల్లలవలె మొదటినుండియు శిక్షణపొంది ఉపాధ్యాయులగుటకు కొన్ని యేండ్లు పట్టును.

గాంధిజీ జవాబు :—కాదు, పేండ్ల పూర్తి శిక్షణ అవసరములేదు. ఉపాధ్యాయుడు కాగోరు వ్యక్తి కొంత గణితము, చరిత్ర మొదలగు వానిని నేర్చియున్నాడనుకొందము. అట్టి పెట్టెలు చేయుటగాని, నూలు వడుకుటగాని ముందతనికి నేర్పుదును. ఈపని నడుచుచుండగనే, ఆ పరిశ్రమద్వారా అతడు గణితమును, చరిత్రను, భూగోళమును ఎట్లు నేర్చుకొని యుండవలసినదో చూపుదును. ఇట్లతడు తన జ్ఞానమును ఆ ప్రత్యేక పరిశ్రమతో సమన్వయించుకొనుట యెట్లో గ్రహించును. దీనికెంతో కాలము పట్టదు. మరియొక ఉదాహరణ : ఏడేండ్ల

కుమారునితో నే నొక బేసిక్ పాఠశాలకు వెళ్లుదును. ఇద్ద రము నూలు వడకుట నేర్చుకొందుము. నాకు ఇదివరకున్న జ్ఞానము నంతను ఈ పరిశ్రమతో కలుపుట యెట్లో తెలిసి కొందును. కుర్రవానికిదంతయు కొత్త. 70 యేండ్ల తండ్రికి ఇదంతయు చర్విత చర్వణము. అతని పాతజ్ఞానమునకు ఒక కొత్త రూపము నిచ్చుకొనిన చాలును. దీనికి కొలది వారముల కంటె ఎక్కువ కాల మక్కర లేదు. కాని ఎనిమిదేండ్ల బాలుని కుండు గ్రహణశక్తిని, కుతూహలమును ఉపాధ్యాయుడు పెంపొందించుకొనలేనిచో అతనికి నూలు వడుకుట మాత్రమే వచ్చును. నూతన విజ్ఞానమతనికి అలవడదు.

ప్రశ్న :— మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణుడైనవాడు ఇష్ట మున్నచో కాలేజీలో చేరగలడు. బేసిక్ విద్య నభ్యసించిన వాడు కూడ కాలేజీకి పనికి వచ్చునా?

జవాబు :— పై యిద్దరిలోను రెండవవాని శక్తి పెరుగుటచే మొదటివానికంటె అతడెక్కువ సమర్థతను చూపును. కాలేజీలో చేరు సామాన్య మెట్రిక్యులేట్లకు తరుచు కలుగు నిస్సహాయతను నిస్పృహను అతడు పొందడు.

ప్రశ్న :— బేసిక్ విద్యాలయమున చేరు పిల్లల కనీసపు వయస్సు ఏడు యేండ్లని నిర్ణయించినారు. ఈ లెక్క తేదీలను బట్టియా లేక విద్యార్థి మానసికాభివృద్ధిని బట్టియా?

జవాబు: — ఏడు సంవత్సరములు సగటున కనీసపువయస్సు.

కాని హెచ్చుతగ్గు లుండవచ్చును. శారీరక వయస్సు, మానసిక వయస్సుకూడ లెక్కకు వచ్చును. ఏడేండ్లపుడే ఒకనికి శరీరపుష్టితో శ్రమపడగల శక్తి యుండును. ఎనిమిదేండ్ల వానికి గూడ ఒకప్పుడు ఆశక్తి లేకపోవచ్చును. కనుక దీనిని గూర్చి కఠిన నియమము లుండరాదు. అన్ని అంశములును లెక్కకు వచ్చును.

మరియు గాంధిజీ ఇట్లనెను : "మీ ప్రశ్నలనుబట్టి మీకు చాల సంశయము లున్నట్లు తోచుచున్నది. పని ప్రారంభించు పద్ధతి ఇదికాదు. దృఢవిశ్వాసముతో మీరు పనికి పూనుకో వలెను. లక్షలాది బిడ్డలకు జీవితశిక్షణ నీయగలిగినది బేసిక్ విద్యావిధాన మొకటేయని నాకున్న విశ్వాసము మీకును ఉన్నచో, మీ కార్యము బాగుగ కొనసాగును. మీకు విశ్వాసము లేదన్నచో, మీకు శిక్షణ నిచ్చువారిలో లోప మున్నదన్న మాట. వారు మీకేమిచ్చినను, యీయ లేకున్నను, ఈ దృఢవిశ్వాస మొకటి మాత్రము వారు మీలో కలిగింపగలిగిన చాలును.

### పండితంమన్యుల చిక్కు ప్రశ్నలు

ప్రశ్న:— బేసిక్ విద్యాపద్ధతి గ్రామస్థులకు మాత్రమే అయితే పట్టణవాసుల గతియేమి? వారు పాతమార్గములో పడి యుండవలసినదేనా?

గాంధిజీ జవాబు:—ఈ ప్రశ్న మంచిది, యుక్తమైనది.

అయితే దీనికిదివరలో 'హరిజన్' పత్రికలో జవాబు చెప్పియే యున్నాను. ఈ నాటికీముద్ద మింగుడుపడిన చాలును. ఏడు లక్షలగ్రామాల విద్యాసమస్యను మనము పరిష్కరించుకొన గలుగుట ఇప్పటికి చాలును. విద్యావేత్తలు పట్టణాల విష యముకూడ యోచించుచునే యున్నారు. గ్రామసమస్యతో నగరసమస్యను ముడిపెట్టుకొన్నచో మనశక్తులు వ్యర్థమగును.

ప్రశ్న :—ఒక గ్రామములో మూడు రకముల చేతిపరిశ్ర మల పాఠశాలలు మూడున్నవనుకొందము. అందొక దాని కంటె మరొకదానిలో శిక్షణావకాశములు బాగున్నచో పిల్ల వాడు అందు ఏ పాఠశాలకు పోవలెను?

జవాబు:—అట్లు ఒకచోట పెక్కు పాఠశాలలుండు స్థితి సంభవింపరాదు. మన గ్రామములు చాలభాగము ఒక్క పాఠశాలకు మించి యుండదగినంత పెద్దవికావు. కాని పెద్ద గ్రామమైతే రెండు పాఠశాలలున్నను ఉండవచ్చును. ఇక్కడైనను రెంటియందు ఒకే పరిశ్రమ యుండవలెను. కాని ఇందుకూడ కఠిననియమ ముండరాదు. అనుభవమునుబట్టి నిర్ణయ ములు జరుగవలెను. వివిధపరిశ్రమలు ప్రజోపయుక్తములగుటకుగాను అందు ఏవేవి బిడ్డల మానసికశక్తులను వికసింప జేయగలుగునో పరిశీలింప బడవలెను. మీ రెన్నుకొన్న పరి శ్రమ పిల్లలలోని శక్తులను పూర్ణముగను, సమానముగను పెంపొందింపగలిగి యుండవలెను,

ప్రశ్న:— భవిష్యత్తులో పిల్లవాని వృత్తి మరియొకటి కానుండగా ఒకచేతిపనికై వాడు ఏడేండ్లు వృథాపుచ్చుట యెందుకు? ఒక బ్యాంకరు కొడుకు తరువాత తండ్రివృత్తి నవలంభింపదలచియుండగా ఏడేండ్లు నూలువడుకుట యెందుకు?

జవాబు:—నూతన విద్యావిధాన మనసేమో తెలియని ప్రశ్నయిది. ఈ విధానములో పిల్లవాడు బడికి వెళ్లుట ఊరక వృత్తి నేర్చుకొనుటకు మాత్రమే కాదు. ఒక చేతిపనిద్వారా మనోవికాసమును కలిగించు ప్రాథమికవిద్యను బడయుటకై అతడు బడికి వెళ్లును. మామూలు బడులలో ఏడేండ్లు చదివిన వానికంటె ఏడేండ్లు నూతనవిద్యనభ్యసించిన బాలుడు ఎక్కువ సమర్థుడగు బ్యాంకరు కాగలడని నావాదన. మనో వికాసము నిచ్చు శిక్షణ మొదటివానికి లేనందువలన, అతడు బ్యాంకింగు పాఠశాలలో కొంత బాధపడవలసివచ్చును. దురభిమానములు, దుర్భ్రమలు ఒకపట్టున చావవు. నూతన విద్యయనగా ఏదో కొంతచదువు, ప్రక్కనే ఏదోకొంత చేతి పనికాదన్న ప్రధానవిషయమును మీకు తెలియజెప్పగలిగి నచో ఈ నాటి నా పని సఫలమైనట్లు ఎంచుకొందును. చేతి పనులద్వారా నేర్పబడు పూర్ణమైన ప్రాథమికవిద్య ఇది.

ప్రశ్న:—ప్రతి పాఠశాలలోను ఒకటికంటె ఎక్కువ పరిశ్రమలునేర్పుట మంచిదికాదా? ఏండ్లతరబడి ఒకేపని చేయవలసి వచ్చుటచే పిల్లలకు విసుగుపుట్టదా?

జవాబు:— పిల్లలొకనెల పడికిన తరువాత, ఉపాధ్యాయుని శ్రద్ధ మందగించినచో, నేనతనిని పాఠశాలనుండి పంపివేయుదును. ఒకే సంగీతపు పనిముట్టునుండి క్రొత్తక్రొత్త స్వరములు, రాగములు ఎట్లు బయలుదేరునో, అట్లే ఇక్కడ ప్రతిపాఠమునందును నూతనత్వముండవలెను. ఒక పరిశ్రమనుండి మరియొక దానికి మారుచుండుటవలన పిల్లవాడు స్థిరత్వము లేక, కొమ్మనుండి కొమ్మకు దుముకు కోతివలె తయారగును. శాస్త్రదృష్టితో నేర్చుకొనబడు నూలు పరిశ్రమలో వడుకుటయే గాక అనేక ఇతర విషయముల జ్ఞానము ఇమిడియుండగలదని మనచర్చలో నే నింతకుపూర్వమే చెప్పియుంటిని. స్వంత తకిలీని, ఆసునుకూడ పిల్లవాడు త్వరలో తయారుచేసికొనగలుగును. కనుక నేను మొదట చెప్పినట్లు అధ్యాపకుడు శాస్త్రదృష్టితో పరిశ్రమను చేపట్టినచో, విద్యార్థులతో నతడు బహుముఖముల మాటలాడును. అవన్నియు పిల్లవాని శక్తులన్నిటి వికాసమునకు పోషకములగును.

హరిజన్ : 4-3-'39.

## 33

## "పాశ్చాత్యుల నుండి తెచ్చుకొన్న దిగుమతి వస్తువు కాదు"

[1937 అక్టోబరులో వార్ధాలో జరిగిన బేసిక్ విద్యా సభ చే నియ

మింపబడిన కమిటీవారి 'బేసిక్ జాతీయవిద్య' అను నివేదికయొక్క రెండవ కూర్పునకు మహాత్ముడు వ్రాసిన తొలిపలుకు.—సం.]

ఈ నివేదికయొక్క మొదటి వేయిప్రతులును ఖర్చైనవి. దీనినిబట్టి డాక్టరు జఖీర్‌హుస్సేన్ కమిటీవారి 'బేసిక్ జాతీయవిద్య' ఇండియా లోపలను బయటను కొందరి దృష్టిని ఆకర్షించినట్లున్నది. దీనిపేరు 'గ్రామ పరిశ్రమలద్వారా నేర్పబడు గ్రామీణ జాతీయవిద్య' అనియుండిన ఎక్కువ బాగుండెడిది. 'గ్రామీణ' అను పదము ఉన్నతవిద్య, లేక ఆంగ్లవిద్యకు ఉద్వాసము చెప్పుచున్నది. 'జాతీయ' అను మాటకిప్పుడు సత్యము, అహింస గుర్తుగనున్నవి. 'గ్రామ పరిశ్రమల ద్వారా' అను మాటవలన ఉపయుక్తములగు కొన్ని చేతిపనులద్వారా గ్రామమునందే గ్రామ బాల బాలికల శక్తులన్నిటిని వికసింపచేయుదురనిన్ని, దీనికి బయటివారి జోక్యము, నిర్బంధము ఉండదనిన్ని అర్థమువచ్చును. ఇట్లైనచో గ్రామ బాలికలవిద్యలో నూతన శకమేర్పడినట్లే. ఇది ఏమాత్రము పశ్చిమ ఖండమునుండి దిగుమతిచేసికొన్న వస్తువు కాదు. పాఠకులు ఈ విషయమును గుర్తించినచో, ఉత్తమ విద్యావేత్తలు బహుశ్రద్ధతో తయారుచేసిన ఈ ప్రణాళిక వారికింకను విస్పష్టము కాగలదు.

సేగాన్ : 28-5-'38.

# 34

## మధ్య పరగణాల స్థానిక సంస్థలు దారి చూపు చున్నవి

పై రాష్ట్రములోని స్థానిక సంస్థల మహాసభకు గాంధిజీ ఆహ్వానింపబడెను. ఒక సందేశ మీయుడని ఆయనను వారు కోరిరి. ఒక సభ్యు డడిగిన ఈ క్రిందిప్రశ్నకు జవాబుగా గాంధిజీ ఒక సందేశ మిచ్చెను : "బేసిక్ విద్యాప్రణాళిక దేశము యొక్క ఆర్థిక, రాజకీయాభ్యుదయమున కెట్లు తోడ్పడ గలదు?"

గాంధిజీ ఇట్లు చెప్పెను : "మీారీప్రశ్న నడుగుట నాకు సంతోషము. దేశముయొక్క ఆర్థికాభ్యుదయమును గూర్చిన ఆలోచన అణుమాత్రమును లేకయే ప్రస్తుతమున్న ప్రాథమిక విద్య యేర్పాటు చేయబడెను. దీనికగుచున్న ఖర్చుకు ప్రభుత్వమున కెట్టి ప్రతిఫలమును వచ్చుటలేదు. ఉన్నత విద్యా ఫలితముగ శుక్లాజీ వంటి కొలదిమంది రాజ్యనిర్వాహకులు మనకు లభించినారనుట ప్రాథమిక విద్య కగుచున్న దుర్వ్యయమును సమర్థించదు. ఇంగ్లీషు నేర్చిన, లేక ఇంగ్లీషు డిగ్రీలు పొందిన వారివలన తప్ప దేశవ్యవహారములు జరుగనేరవను మూఢనమ్మక యొకటి ప్రబలినది. ఇప్పటి ప్రాథమిక విద్యకు పెట్టు డబ్బంతయు పూర్తిగ వృథాయని, ఇందుండి ఉన్నత విద్యకు వెళ్లువారి సంఖ్య అత్యల్పమని, ఇందు గరపబడు అక్షర

జ్ఞానము శాశ్వతముగ నిలిచియుండదని, ఉన్నంతలో ఈ స్వల్పవిద్యయైనను చాల కొద్దిమందికి మాత్రమే లభించు చున్నదని విద్యాశాఖ డైరెక్టర్లే అంగీకరించినారు. మధ్య పరగణాల గ్రామాలలోని ప్రాథమిక పాఠశాలలు అతి తక్కువ. వీనివలన ఎట్టి ప్రతిఫలమును లేదు.

"విద్యయంతయు చేతిపరిశ్రమల ద్వారా నేర్పబడవలెను కనుక, నూతన విద్యాప్రణాళిక నికరమైన ఆర్థిక సౌష్ఠవముపై ఆధారపడియుండును. విద్య యొకటిగాను, చేతిపని మరియొకటి గాను విడిగా నేర్పబడరాదు. చేతిపరిశ్రమ ద్వారానే విద్య యంతయు రావలెను. ఉదాహరణ : నేతపనిద్వారా విద్య నేర్చుచున్న విద్యార్థి మామూలు నేతవానికంటె ఎక్కువ గణ్యత పొందును. నేతపనివాడు దేశమునకు ఆర్థికముగ నష్ట మని యెవరును అనలేరు. ఇతడు వివిధములగు పనిముట్ల పరిచ యము కలిగి, కళయుందారితేరి, మామూలు పనివానికంటె ప్రవీణుడగును శ్రీమతి ఆశాదేవి చూపిన లెక్కలను బట్టి కడచిన కొలది మాసముల ఆర్థిక ఫలితములు మనకు తెలియ గలవు. ఇవి మే మనుకున్న దానికంటె ఎక్కువ ఆశాజనకము లుగ నున్నవి. స్వయంపోషక విద్య యనగా నా యుద్దేశ మిదియే. స్వయంపోషక మనగా పరికరములపై పెట్టుబడి యంతయు దీనివల్ల రాబట్టవలెనని కాదు. పిల్లలు తయారు చేయు వస్తువుల విలువ అధ్యాపకుని జీతమునకు సరిపోగలదని

మాత్రమే. బేసిక్ విద్యావిధానములోని ఆర్థిక దృష్టి ఇట్లు స్వయంవ్యక్తము కాగలదు.

"ఇక జాతీయాభ్యుదయము మాట ఒకటున్నది. గ్రామ పరిశ్రమలనుగూర్చి కుమారప్ప కమిటీ నివేదికను మీరు చూచినారో లేదో! పాత లెక్కలనుబట్టి ఇండియాలో మని షికి సగటు సంవత్సర ఆదాయము రు 70. కాని మధ్య పరగ ణాలలోని సగటు సంవత్సరాదాయము రు 12 మొదలు రు 14కు మించదని ఆయన ఋజువుచేసినారు. నూలు వడకుట మొదలగు గ్రామ పరిశ్రమలు గ్రామ జీవితావసరములను తీర్చగలవని చెప్పి అవి బేసిక్ విద్యలో చేర్చబడినవి. కనుక పరిశ్రమద్వారా విద్య నభ్యసించిన బాలురు తమ జ్ఞానమును తమ గృహముల లోనికి తీసికొనిపోవలెను. గ్రామ పరిశ్రమాభివృద్ధితో గ్రామ స్థుల ఆదాయము రెట్టింపు అగునని మీకు తెలియగలదు. మీరు ప్రజాసేవకులై నూతనవిద్యయందభిమానముతో చురు కుగ పనిచేసినచో మీ జిల్లాబోర్డులలోని తగవులు చాలవరకు అంతరించును. నే నిక్కడికి వచ్చుచుండగా నాకొక లేఖ ఈయబడినది. బడిపిల్లలు రోజుకు నాలుగు గంటలు వడికి ఒక నెలలో రు 75 సంపాదించినట్లు అందున్నది. ఇట్లు ఇండియా లోని కోట్లకొలది ప్రాథమిక విద్యార్థు లెంత సంపాదించ వచ్చునో లెక్క వేయుడు.

"ఇదిగాక బిడ్డలలో కల్పనాశక్తి ఆత్మవిశ్వాసము పెరుగును. సంఘమునందు అసమానత్వమును పోగొట్టి దేశసౌభాగ్యమును పెంచుటలో తాము తోడ్పడవలెననెడు ప్రేరణ వారికెంతగ కలుగునో ఊహింపుడు. ఇదంతయు సహజముగ రాజకీయ చైతన్యమునకు దారితీయును. స్థానికవ్యవహార జ్ఞానము, అందలి దుర్వ్యాపారములను నిర్మూలించు ఉపాయములు విద్యార్థులకు తెలిసియుండవలెను. ఇట్టి రాజ్యాంగ పరిజ్ఞానము ప్రతి బడిబాలునికి అవసరము. ఇది వాని యున్నతికి తోడ్పడును.

"ఈ విద్య దేశములోని ఆర్థిక, రాజకీయాభ్యుదయమును తప్పక చేకూర్చగలదని మీకు నేను పూర్తిగ ఋజువు చేసితినని భావించుచున్నాను.

"మీరిచటికి వచ్చియున్నారు కనుక, ఈ విధానమును మీరు చక్కగ పరిశీలింతురని, మీకిందు విశ్వాస మేర్పడినదో లేదో శ్రీ శుక్లా, ఆర్యనాయకం గార్లతో మీరు చెప్పి వెళ్ళవలెనని నా విజ్ఞప్తి. మీరు న్యాయముగ ప్రయత్నించినచో పాఠశాలలను పునరుజ్జీవింప చేయగలిగితిమని, మీ విద్యార్థులలో నూతన చైతన్యము కలిగినదని మూడు నెలలలో మీరు నివేదిక వ్రాసి పంపగలరు. విత్తనము వృక్షమగుటకు చాలకాలము పట్టవచ్చును. కాని మీరు నాకెడు

ఈ విద్యా బీజముయొక్క ఫలితము కొన్ని నెలలలోపలనే కొంతవరకు కనబడును. ఇండియా ప్రజల యెదుటనే నుంచినవి, అతి సరళమైన ప్రణాళికలు. కాని విప్లవాత్మకములగు మార్పులను తేగలిగిన విషయములివి. ఖాదీ, మద్యనిషేధము, చేతి పరిశ్రమల పునరుద్ధరణ, పనిద్వారా గరపబడు విద్య—ఇత్యాదులు. కాని ప్రస్తుత విధానపు మైకమును వదలించుకొన్న గాని ఈ సరళ విషయములు మీకు గోచరింపవు.

"మీరేమి చేసినను ఆత్మవంచకులు మాత్రము కావద్దు. మమ్ము వంచింపవద్దు. ఈ విధానమునందు మీకు ఉత్సాహము లేనిచో దయచేసి అట్లని స్పష్టముగ చెప్పివేయుడు.

"పెట్టుబడినిగూర్చి ఒక మాట. ఇందు పెట్టుబడి ధనము భవన నిర్మాణమునకు పెట్టు ధనమువలె అంతయు నష్టము కాదు. పనిముట్లకు, ముడి సరుకుకు పెట్టిన డబ్బు ఏండ్లతరబడి ఉత్పత్తి నిచ్చుచునే యుండును. రాట్నములు, మగ్గములు, ఏకుడు కమానులు వరుసగ అనేక జట్ల విద్యార్థుల శిక్షణకు పనికివచ్చును. యంత్ర పరిశ్రమలలో పెద్ద పెట్టుబడి, ఎక్కువగా పరికరముల అరుగుదల, కొట్టివేత ఉండును. ఈ విధానములో అట్టిదేమియు ఉండదు. చక్కగా నడుపబడు గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అట్టి నష్టము వచ్చుటకు అవకాశము లేదు.

“చివరిమాట. రాగల రాజకీయపు మార్పులనుగూర్చి మీరు కలత చెందవద్దు. మంత్రులు వచ్చుచుందురు, పోవు చుందురు. నోటీసుఇచ్చిన వెంటనే గద్దె దిగుటకు ఒప్పుకొనియే వారు పదవులను స్వీకరించినారు. అవసరమైనచో ప్రభుత్వ కార్యాలయమునుండి నేరుగ జైలుకే పోవలసియుండునని వారెరుగుదురు. సంతోషముతో వారట్టిపని చేయనూగలరు. కాని మీ కార్యక్రమము మంత్రివర్గములపై ఆధారపడి యుండనక్కరలేదు. మీరు నియమించుకొన్న పనికి గట్టి పునాదియున్నచో, మంత్రివర్గము లెన్నిమారినను, అది నిలి చియేయుండును. పనిలో మీకు విశ్వాసమున్న చాలును. తానెన్నుకొన్న సత్యాహింసల ధర్మమునకు కాంగ్రెసెంత కాలము కట్టుబడియుండునో అంతవరకే అదియు, దాని కార్య క్రమమును నిలువగలవు. నేను కాంగ్రెసును తీవ్రముగ విమ ర్శించితిని; నిర్దాక్షిణ్యముగ దానిలోపముల నెత్తి చూపితిని. కాని దాని పరపతి ఇప్పటికిని కొంత నిలిచియున్నది.

“మీ విశ్వాసము పైనను, మనో నిశ్చయముపైనను సమస్తమును ఆధారపడియున్నది. మీలో గట్టి సంకల్ప మున్నచో మార్గము కనబడితీరును. ఇబ్బందులన్నియు తొలగి పోవును. మీ విశ్వాసముమాత్రము సజీవమైనది కావలెను. వారిలో భగవద్విశ్వాసమున్నదని హేలాదిమానవు లనుచుం

దురు, కాని ఇంచుక అలజడికి బెదరి పారిపోవువారి విశ్వాసము సజీవము కాదు. అది మృతప్రాయము. సజీవమగు విశ్వాసమైనచో, కార్యసిద్ధికి కావలయు జ్ఞానమును, సాధనోపాయములను అది అన్వేషించును. మీలో ప్రతియొక్కరును మీ విశ్వాసమును ప్రకటించినందులకు నేను సంతసించినాను. ఇది నిజమైతే మీ రాష్ట్రము మిగతవారికి దృష్టాంతముగ నుండగలదు.''

హరిజన్ : 28-10-'39.

# 35

## తకిలీ × ఆటవస్తువులు

వార్ధాజిల్లా ఖాదీయాత్ర * మార్చి 15వ తేదీ సాయంకాలము 5 గం॥కు ముగిసెను. ప్రశ్నలున్నచో, ప్రార్థన తరువాత అడుగవచ్చునని గాంధిజీ అనుటచే చాలమంది ఆ రాత్రి కక్కడనే నిలిచిపోయిరి. ఈ క్రింది దొక ప్రశ్న, దానికి ప్రత్యుత్తరము.

---

* వార్ధాజిల్లా ఖాదీ అభిమానులు 'ఖాదీయాత్ర' పేరిట ఆ యేటి వార్షికసభను సేవాగ్రామ్‌లో జరిపిరి. శ్రీ వినోబాయొక్క అధ్వర్యము, ప్రోత్సాహముతో ఈ సమావేశములు జరుపబడినవి.—సం.

ప్రశ్న:— బేసిక్ విద్యలో తకిలీని ప్రవేశపెట్టుట అది స్వాయంపోషకమగునను ఆర్థికదృష్టితోనా, లేక దానికున్న విద్యాప్రాముఖ్యము వలననా ?

జవాబు:—ఏ విషయమునైనను బేసిక్ విద్యలో ప్రవేశపెట్టు దృష్టి ఎప్పుడును ఒకటే. అది విద్యాదృష్టి. చేతిపరిశ్రమ ద్వారా పిల్లవానియొక్క శారీరక, మానసిక, నైతికఅభివృద్ధిని చేకూర్చుటయే దాని ఆశయము. విద్యాభివృద్ధి దృష్టితో ఏ ప్రణాళిక దక్షతతో నిర్వహింపబడగలదో అది ఆర్థికముగగూడ తప్పక విజయవంతమగును. ఉదాహరణ: మట్టితో ఆటవస్తువులనుచేయుట మన బిడ్డలకు నేర్పవచ్చును. కాని కొంతకాలమున కవి విరిగిపోవును. ఈ పనికూడ బిడ్డల మానసిక శక్తిని వృద్ధిపరచును. కాని ఇందొక చాల ముఖ్యమగు నైతిక సూత్రము లోపించినది. మానవుని పరిశ్రమ, సామగ్రి వృథా కాకూడదు. ప్రతి క్షణమును ప్రయోజనకరముగ వినియోగపడవలెనను సూత్రమును దృష్టాంతపూర్వకముగ ఒత్తి చెప్పుటయే ఉత్తమ పారశిక్షణ. అప్పుడది అప్రయత్నముగ స్వాయంపోషకము కాగలదు.

హరిజన్ : 6-4-'40.

# 36

## పుస్తక పఠనము × చేతి పరిశ్రమ

శ్రీ నరహరి పరీఖ్ ఇట్లు వ్రాయుచున్నారు :

"మన ఖాదీ పాఠశాలలలోను, ఇతరచోట్లను పుస్తక పఠనమున కీయబడుచున్న అత్యధిక ప్రాధాన్యత చాల పొరపాటని నా యుద్దేశము. కొన్ని గంటలు పరిశ్రమకును, మరికొన్ని గంటలు చదువునకును ఈయబడు చున్నవి. కాని పుస్తక పఠనమునుండియే జ్ఞానము లభించునని వారి నమ్మకము. పుస్తకములనుండి కంటె పరిశ్రమనుండియే విద్యార్థులకు ఎక్కువ మానసికాభివృద్ధి కలుగునని నా యభిప్రాయము. ఈ విషయమై మీ యభిప్రాయము నిచ్చినచో చాల కృతజ్ఞుడను."

పై విలేఖరి వాదము న్యాయమైనది. పుస్తక శిక్షణ అన్నివేళల మనోవికాసము కలిగించుననుటకు వీలులేదు. ముఖ్యముగ కంఠస్థము చేయించుటయే దాని పని. బొమ్మలు మనసులో ముద్రితములైనట్లే అక్షరములును ముద్రితములగును. కాని పుస్తకవిద్య కూడ కేవలము అక్షరములనుకూడ బలుకుటతో పూర్తికాదు. చేతిపరిశ్రమల విషయము కూడ ఇంతే. చేతిపరిశ్రమ యనగా వట్టి బండపని కాదు. దాని శాస్త్రజ్ఞానమంతయు అలవడవలెను. అందువలన హైస్కూళ్ళలోను, కాలేజీలలోను కలుగు మనోవికాసముకంటె ఇక్కడ అది అధికముగను, తొందరగను కలుగును. కనుక, చేతి

పనులను నిరసించి వానికి తక్కువ స్థానమిచ్చుట కడుశోచనీయము. అందువలన విద్యార్థులు పరిశ్రమకుండవలసిన విలువను తగ్గించుకొన్నవా రగుదురు. పుస్తక పఠనము కండ్లను పాడుచేయును. ఆలోచనాశక్తి, కల్పనాశక్తి సన్నగిలును. చేతిపనులు చేయుచు వాని శాస్త్రజ్ఞానమును బడయుటలో అట్టి ప్రమాదము లేదు. ఇక్కడను కొంత పుస్తకవిద్య అవసరమే కాని అది పరిశ్రమకు సంబంధించి యుండును. కనుక మనస్సునకు గూడ పరిశ్రమ యుండును. నా యుద్దేశ్యములో బేసిక్ శిక్షణ యనగా ఇదే. ఇందు సత్యమున్నది కనుక, కాలక్రమమున ఇది ఫలప్రదము కావలసినదే. ఈలోగా పుస్తకపు చదువును, చేతి పరిశ్రమను విడదీయకుందురు గాక! చేతిపరిశ్రమవిద్యలో విడరాని భాగముగ నెంచబడి, మిగత విషయములతో సమాన ప్రాముఖ్యము కలిగియుండవలెను. కనీసము జాతీయ పాఠశాలలలో నైనను ఈ సత్యము గుర్తింపబడవలెను.

హరిజన్ : 5-4-'42.

# 37

## చేతిపని, మానసికాభివృద్ధి

"ఇక్కడ చేతిపరిశ్రమకు అత్యధిక ప్రాముఖ్య మీయబడుచున్నదని మీలో నొకరి ఫిర్యాదు. చేతి పరిశ్రమయొక్క

విద్యా ప్రాముఖ్యమునందు నాకు పూర్ణ విశ్వాసమున్నది. మన ప్రస్తుత విద్యావిధానము బ్రిటిషు రాజ్యాధికారమును బరపలచి దానిని చిరస్థాయిగ చేయుటకే ఉద్దేశింపబడినది. దాని నీడను పెరిగినవారు సహజముగ ఆ రుచులనే పెంచుకొనుటచే చేతిపరిశ్రమ యనిన వారికి సంకటము. ప్రభుత్వ విద్యా సంస్థలలో ఒక్కరుకూడ రోడ్లు, మరుగుదొడ్లు శుభ్రపరచు పనిని విద్యార్థులకు నేర్పవలె ననుకొనరు. ఇక నిక్కడనో పారిశుధ్యము, ఆరోగ్యము శిక్షణయొక్క ఆది, అంతము కూడ. వీధులు తుడిచి శుభ్రపరచుట మీరు కష్టించి నేర్వవలసిన లలితకళ. ఏ విద్యకైనను, పట్టుదలతో ప్రశ్నించుట, తీవ్రజిజ్ఞాస ముఖ్యమైనవి. కాని ప్రశ్నించు వానికి ఉపాధ్యాయుని యెడల భక్తి, గౌరవము, వినయము ఉండవలెను. ప్రశ్నలడుగుట పెంకెతనముగా పరిణమించరాదు. పెంకెతనము జ్ఞాన సంపాదనకు శత్రువు. నేర్చుకోవలెనను సంకల్పమును, వినమ్రతయు లేనిచో జ్ఞానసంపాదనయే లేదు.

"సూక్ష్మబుద్ధితో చేయబడు ఉపయుక్తమగు చేతిపరిశ్రమ మనోవికాసమును కలిగించు ఉత్తమ సాధనము. ఇతర విధములకూడ చురుకైన మేధస్సును పెంపొందింపవచ్చును. కాని అట్టి మెదడు సర్వశక్తులను సమానముగ వృద్ధిపరుపజాలదు. అంగసౌష్ఠవములేని వికృతరూపముగ అది పరిణమించును.

అది మనుష్యుని నీచునిగను, తుంటరిగను చేయును. సమ తూకముగల బుద్ధివికాసమునకు శారీరక, మానసిక, ఆత్మ శక్తులమూటి సమన్వయము అవసరము. ఇందుచేతనే ఈ శిక్షణకు చేతిపరిశ్రమ కేంద్రముగ చేయబడినది. సంఘమున కుపయోగపడు పరిశ్రమద్వారా వికసించిన మేధస్సు సేవకు సాధనమగును. అది సాధారణముగ పెడదారి కీడ్వబడుట కష్టము. రెండవది తప్పుడుదారిని పడెనా, మొదటిది దానిని మందలించి ఋజుమార్గమున బెట్టును. ఈముఖ్య విషయమును మీరు గుర్తించినచో మిమ్ములనీ శిక్షణకు బంపిన రాష్ట్ర ప్రభుత్వములు మీకై చేసినవ్యయము సద్వినియోగమైనట్లే.''

హరిజన్ : 8-9-'46.

# 38

## బేసిక్ శిక్షణ పొందిన వాని లక్షణములు

తొమ్మండుగురు ఏడవ తరగతి బాలురను శ్రీ ఆర్య నాయకం గాంధిజీ వద్దకు తీసికొని వచ్చెను. సేవాగ్రామ్ బేసిక్ స్కూలులో ఏడేండ్ల శిక్షణ వారు పూర్తిచేసిరి. వారు సేవాగ్రామ్ నుండియు, పరిసర గ్రామాలనుండియు వచ్చిన బాలురు. ఎన్నడును పాఠశాల నెరుగని వ్యవసాయకులతో

పోల్చినచో, ఈ మొదటి జట్టు బేసిక్ విద్యార్థులస్థితి చాల ప్రోత్సాహకరముగ నుండెను. వారు పరిశుభ్రముగను, సుశిక్షితులుగను, మర్యాదస్థులుగాను ఉండిరి. గాంధిజీ కొంతసేపు పరిహాసమాడి వారిని నవ్వించెను. అందొకడు ధైర్యముతో గాంధిజీని ఇట్లడిగెను : ''ఏడేండ్ల బేసిక్ శిక్షణ పూర్తిచేసిన పదునాలుగేండ్ల బాలురు ఎట్లుండవలెనని మీ యభిప్రాయము ?'' ఈ యవకాశమును తీసికొని గాంధిజీ ఇట్లనెను : ''తీసికోవలసినంత శ్రద్ధ, బాధ్యత పాఠశాలలో తీసికోబడినచో 14 ఏండ్ల బాలురు ఆరోగ్యవంతులు, సత్యవంతులు, పరిశుద్ధులు అయియుందురు. గ్రామీణ మానసికతత్వము వారిలో నిండియుండును. వారి మెదడు, చేతులు సమానముగు వికాసము పొందియుండవలెను. కపటవృత్తి వారియందే మాత్రము కనబడదు. వారి బుద్ధి కుశాగ్రబుద్ధి. ధనసంపాదనకయి వారు ప్రాకులాడరు. చేతికందిన ఏ ధర్మకార్యమునైనను చేయుటకు సంసిద్ధులగుదురు వారు పట్టణవాసులగుట కిష్టపడరు. సహకార, సేవా ధర్మములను పాఠశాలలో నేర్చి, తమ పరిసరములను ఆ తత్వముతో నింపుదురు. వారెన్నడును ఇతరులపై ఆధారపడి యాచకులుగ బ్రతుకరు.''

హరిజన్ : 8-9-'46.

# మంత్రుల సమావేశములో ప్రశ్నలు*

ప్రశ్న :— స్వయంపోషకత్వముమాట లేకుండ బేసిక్ విద్యను నడుపవచ్చునా?

జవాబు:—మీ రట్లు తప్పక ప్రయత్నించవచ్చును. కాని, అంతకంటె మీరు బేసిక్ విద్యను పూర్తిగ మరచిపోవుటయే మంచిదని నా సలహా. స్వయంపోషకత్వము మొదటి షరతు కాదు, కాని నా దృష్టిలో అదొక గట్టి పరీక్ష. ఈ విద్య మొదటినుండియు స్వయంపోషకము కావలెనని కాదు. మొత్తము ఏడేండ్లలో జమ, ఖర్చు సరిపోవలెను. అట్లుకానిచో విద్యార్థులు ఏడేండ్ల చివరకూడ జీవితమునకు పనికిరారని, వారు నేర్చినది బేసిక్ విద్య కాదని తేలును. స్వయంపోషకము కానిచో నూతనవిద్య ప్రాణములేని బొందివంటి దగును.

ప్రశ్న:—చేతిపరిశ్రమ ద్వారా విద్య గరపబడవలెనను సూత్రమును మన మంగీకరించితిమి. కాని ముసల్మాను లెందు చేతనో రాట్నమునకు వ్యతిరేకులు ప్రత్తిపండు ప్రదేశములో

---

* 1946 జూలై 29, 30 తేదీలలో పూనా కౌన్సిల్ భవనమున శ్రీ బి. జి. ఖేర్ అధ్యక్షతను మంత్రుల సమావేశము జరిగెను. ఒక గంట సేపు పైగా గాంధిజీ సమావేశమున పాల్గొనెను.

నూలు పరిశ్రమకు మీరిచ్చు ప్రాధాన్యత సరియే కావచ్చును. కాని ప్రత్తి పండని చోట్లకు అది సరిపడదని మీ రంగీకరించరా? ఆ చోట్ల సేద్యమువంటి మరియొక పరిశ్రమ చేయించరాదా?

జవాబు — ఇది చాలపురాతన ప్రశ్న. విద్యకు సాధనముగా నుండవలసిన ఏ పరిశ్రమయైనను అందరికిని ఉపయోగపడవలెను. ఇండియా స్వతంత్రమై తనకాళ్లపై తాను నిలువవలెనన్నచో ప్రతి యింటను రాట్నధ్వని వినిపించవలెనని 1908 లోనే నేనుతీర్మానించుకొంటిని ఇంగ్లాండు తానుగ ఒక్క ప్రత్తికాయను పండించకుండ ఇండియాకును యావత్ప్రపంచమునకును వస్త్రముల నెగుమతి చేయగలుగుచున్నదే! అవసరమైనచో ప్రక్క జిల్లానుండియో, రాష్ట్రమునుండియో దూదిని తెచ్చుకోవలసినంత మాత్రాన మన యిండ్లలో రాట్నపరిశ్రమ నెందుకు ప్రవేశపెట్టలేమో నాకు బోధపడుట లేదు. ఒకప్పుడు ఇండియాలో ప్రత్తిపండించని ప్రాంతమే యుండెడిదికాదు. "ప్రత్తి ప్రాంతముల"ని పేరుపెట్టి ప్రత్తి పంటను కొన్నిచోట్లలోనే కేంద్రీకరించిన కృత్రిమపద్ధతి తరువాత అమలులోనికి వచ్చెను. దీనిని గృహాపరిశ్రమగ చేసికొన్న ప్రజలను, బీదరైతులను బాధించి పై పద్ధతి నవలంబించినవారు వస్త్రపరిశ్రమను గుత్తకుగొన్న దురాశాపరులే. ఇపుడుకూడ చెప్పు — ప్రత్తి ఇండియాలో అన్నిచోట్లను

పెరిగి ఫలించును. మీ వాదములుచూడగా, మనము యత్న హీనులమని, ధైర్యసాహసములు కల్పనాశక్తిలేని వారమని ధృవపడుచున్నది. అవసరమగు ముడిసరుకును స్థలాంతరము నుండి తెచ్చుకొనుట దాటరాని కష్టమైనచో మన పరిశ్రమలే చచ్చిపోవును.

మరియు దిగంబరి కాకుండ తన బట్టను స్వయముగ తయారుచేసికోగల శక్తి మనుష్యునకు కల్పించుటయే ఒక విద్య. ఇదికాక నూలు పరిశ్రమలోని యావత్తు పనులను సూక్ష్మబుద్ధితో నెరవేర్చుకొనుటలో ప్రశస్తమయిన విద్యా విలువయున్నది. మనుష్యునికి సంపూర్ణవిద్యను అందించగల అవకాశము నూలుపరిశ్రమ కున్నంతగ మరియే పరిశ్రమకును లేదని చెప్పవచ్చును. ముసల్‌మానులు భ్రమలో పడియుండు టచే వారి సందేహనివృత్తి ఈ నాడు మనముచేయలేక పోవచ్చును. భ్రమలో చిక్కుకొన్నవారికి, దానిలోనున్నంత వరకు, ఆభ్రమయే పరమసత్యమయి తోచును. కాని, అసం దిగ్ధమగు దృఢవిశ్వాసముతో మన విధానమునకు విజయము చేకూర్చుకొనగలిగినచో ముసల్మానులే మనవద్దకు వచ్చి ఇందలి రహస్యము చెప్పుమని యడుగుదురు. నిరుపేదలగు ముసల్మాన్ ప్రజలకు ముస్లింలీగుకంటెను, మరే ముస్లింసంస్థ కంటెను చరఖా ఎక్కువ సహాయపడినదని వారు గుర్తించి

నట్లు తోచదు. బంగాళమునందలి నేతపనివాండ్రలో అధిక సంఖ్యాకులు ముస్లిములే. అతి సన్నమైన ఢక్కా 'మజ్లిను'ల ప్రపంచఖ్యాతి మనము మరువలేము. అదంతయు ఆ నూలు వడికిన ముస్లిం స్త్రీల, నేసిన ముస్లింల నేర్పరితనమే.

మహారాష్ట్ర విషయముకూడ ఇంతే. ఈ భ్రమను తొలగించుకొనుటకు ఒకటే మందు—నిష్ఠతో స్వధర్మమును నెరవేర్చుటయే. సత్యమొకటే శాశ్వతవస్తువు. మిగిలినదంతయు కాలవాహినిలో కొట్టుకొనిపోవలసినదే. అందరును నన్ను విడనాడినను, నే నొంటరినై పోయినను సత్యమునకు సాక్షిగ నేను నిలువ వలసినవాడను. ఈ నాడు నామాట అరణ్యరోదనము కావచ్చును. కాని, అందు సత్యమున్నచో, ఇతరధ్వనులు అణగిపోయి నా ధ్వనియే వినబడగలదు.

విషమ వృత్తము

"నూతనవిద్యకు సమర్థులగు అధ్యాపకులను తయారు చేయుటకు కొంతకాలము పట్టును. ఈలోగా పాఠశాలలను సంస్కరించుట కేమిచేయవలెను?" అని శ్రీ అవినాశలింగం చెట్టియారు ఇంగ్లీషున గాంధిజీని అడిగెను.

గాంధిజీ ఆయనను మందలించుచు, "హిందీలో మాట్లాడలేనిచో తన ఇంగ్లీషును హిందీలో అనువదించగలిగిన మరొకరి చెవిలో చెప్పియుండవలసినద"ని చెప్పి అందరిని నవ్వించెను.

మరియు గాంధిజీ ఇట్లనెను : "ప్రస్తుత విద్యావిధానము మన బానిసత్వమును బలపరచుటయే కాని ఇండియాకు స్వాతంత్ర్యము నీయజాలదని మీరు గుర్తించినచో మీరు దానిని ప్రోత్సహించుటకు నిరాకరించవలెను. దాని స్థానే వేరొక మంచిపద్ధతివచ్చినను, రాకున్నను దానినిమాత్రము మీరు బహిష్కరింపవలసినదే. నూతన విద్యాసూత్రమునకు లోబడి మీరు చేయగలిగిన దేమో చేసి తృప్తిచెందుడు. ఈ నూతనవిద్యను అమలుపరచు మంత్రులు తమ కక్కర లేదని ప్రజలన్నచో మంత్రులు రాజీనామా లిచ్చిపోవుటయే మంచిది. ప్రజలకు ప్రాణభిక్షపెట్టు ఆహారమును తామీయ లేకను, లేక ప్రజలకది రుచింపకను దానికిబదులు విషాన్న ప్రయోగముచేయుటలో మాత్రము మంత్రులు భాగస్వాములు కారాదు."

ప్రశ్న:— నూతనవిద్యకు కావలసినది ధనముకాదు, మనుష్యులని మీ రందరు. కాని మనుష్యులను తయారు చేయుటకు సంస్థలు, వాటికయి డబ్బుకావలెగదా ! ఈ విషమ వృత్తమునుండి బయటపడుట యెట్లు ?

జవాబు — దీనికి ప్రతిక్రియ మీ చేతిలోనేయున్నది. స్వయముగ మీతోనే పని ప్రారంభింపుడు. పరోపకారము స్వగృహమునందే ప్రారంభము కావలెనను చక్కని ఆంగ్ల

సామెతకలదు. మనమట్టుకు మనము ప్రభువులవలె పడకకుర్చీలలో పరుండి, పనిపాటులకు 'క్రింది జాతి' మానవులను అప్పగించినచో, మన మెక్కుడికిని చేరుకొనలేము. నా పద్ధతి ఇది కాదు. ముందు నాతోను, నా పరిసరములతోను ప్రారంభించి నా మోతాదులో నా పని నేను చేసికొనుటయే బాల్యము నుండియు నా కభ్యాసము. ఈ విషయమున ఆంగ్లజాతి చరిత్రలోని ఒకవిషయమును గమనింతము. మొదట వారొక చిన్నజట్టుగ ఇండియాకువచ్చి క్రమముగ ఒక పెద్ద సామ్రాజ్యమును స్థాపించినారు. రాజకీయముగ కంటె సాంస్కృతికముగ ఆ సామ్రాజ్యప్రభావము బలవత్తరముగ వ్యాపించెను దానికి తార్కాణముగనే మనమీనాఁజున ఇంతగా ఇంగ్లీషు వ్యామోహమున జిక్కి మాతృభాషల కుద్వాసము చెప్పితిమి. బానిస తనసంకెళ్ళను వదలలేక గట్టిగ పట్టుకొన్నట్లే, మనమును ఇంగ్లీషును కౌగలించుకొని కూర్చున్నాము. ఆంగ్లేయుల విశ్వాసము, ఏకాగ్రదృష్టి, దీక్ష, త్యాగము చూడుడు. పట్టుదల యున్నచోట మార్గము కనబడునని ఇందువలన విదితమగు చున్నది. ఏమి సంభవించినను కర్తవ్యమును వదలమను నిశ్చయముతో మనము నడుముకట్టి నిలుతుము గాక! దానితో కష్టము లన్నియు కరగిపోవును.

## ఇంగ్లీషు కుండదగు స్థానము

ప్రశ్న :—ఈ కార్యక్రమములో ఇంగ్లీషునకు ఏ స్థానముండగలదు ? దానిని నిర్బంధముగ నేర్పవలెనా, లేక యిష్టమున్నవారు రెండవ భాషగ తీసికొనవలసినదా ?

జవాబు :—మాతృభాషయందు ఏయే లోపములున్నను, తల్లియొక్క వక్షస్థలమునకు వలె దానికి నే నంటుకొని యుండవలసినదే. పాలిచ్చి నన్ను బ్రతికించ గలిగిన దదియే. ఇంగ్లీషు దాని ఉచితస్థానమునందది యున్నచో నేను హర్షింతును. దానిది కానిస్థానము నది ఆక్రమించినచో నేను దాని ప్రబల శత్రువును. ఇంగ్లీషు ఈనాడు ప్రపంచ భాషయైనది. అందుచే హైస్కూలులో గాక, కాలేజీ విద్యలో దానిని ఐచ్ఛిక భాషగా నేను చేయుదును. అదియు చాల కొద్దిమందికే. లక్షలాది విద్యార్థులకు దానితో పనియుండదు. ఈనాడు నిర్బంధోచిత ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టుట కవకాశములులేని మనము, ఇంగ్లీషు బోధించుట కెట్లు యేర్పాటు చేయగలము ? రష్యా తన విజ్ఞానాభివృద్ధి నంతను ఇంగ్లీషు లేకయే సాధింపగలిగినది. ఇంగ్లీషు లేనిచో మన బ్రతుకు సాగదనుకొనుట మన భావదాస్యము వల్లనే. అట్టి చచ్చు సిద్ధాంతమును నే నెన్నడును ఆమోదింపను.

హరిజన్ : 25-8-'46.

# 40

## మాతృభాష × ఇంగ్లీషు

ఒక విద్యావేత్త ఇట్లు వ్రాయుచున్నారు :

"మీరు జాగ్రత పడనిచో పట్టణములలోని బేసిక్ విద్య పెడమార్గము పట్టును. ఉదాహరణ : మాతృభాషను దింపివేసి ఇంగ్లీషు దాని స్థానము నాక్రమించును. రెంటి మధ్యను ఉచ్చనీచ తారతమ్యము లేర్పడును."

అసలు గ్రామములకొరకే నా ప్రణాళిక ఉద్దేశింపబడినది. దానిని విశదీకరించుచు, పట్టణముల విషయమున కొంత భేద ముండునని నేనంటిని. విద్యాసాధనములగు పరిశ్రమలనుగూర్చి నేనామాట చెప్పియుంటిని. ప్రాథమిక దశలో ఇంగ్లీషున కేమాత్రమును తావుండరాదని నా ప్రతిపాదన. ఈ ప్రాథమిక శిక్షణ ఇంగ్లీషులేని మెట్రిక్యులేషన్ మెట్టుతో సమానము కావలెననికూడ నిర్ధారణ చేయబడినది. బిడ్డలపై ఇంగ్లీషును రుద్దుటచే వారి సహజాభివృద్ధి ఆగిపోవును, కల్పనాశక్తి నశించును. ముఖ్యముగ జ్ఞాపకశక్తిని పెంచుటకే భాషాపఠనము. మొదటినుండియు ఇంగ్లీషును నేర్పుట బిడ్డలను అనవసరముగ బాధించుటయే. తల్లిభాషను అలక్ష్యము చేసిననేగాని బిడ్డలు పరభాషను నేర్చుకొనలేరు. గ్రామస్థులకెట్లో పట్టణవాసులకు గూడ అట్లే విద్యాభివృద్ధి మాతృభాష యను రాతి పునాదిపై

నిలుచుట అత్యావశ్యకము. ఇంత తేటతెల్లమగు విషయమును కష్టపడి ఋజువు చేసికోవలసిన అవస్థ ఈ ఒక్క నిర్భాగ్యపు ఇండియాకే పట్టినది.

హరిజన్ : 9-9 '39.

# 41

## నూతన విద్యలో వైద్యమునకు స్థానము

శ్రీమతి ఆశాదేవి తన పనిలో నిమగ్నురాలై యుండుచు నా సమయమును అనవసరముగ తీసికొనదు. అయినను నేను ఢిల్లీకి బయలుదేరుచుండగా ఆమె నన్నొక ప్రశ్న నడుగవచ్చి, అయిదు నిమిషములపాటు నావద్ద నుండెను. "తాలిమీసంఘములోని అధ్యాపకులు వైద్యశిక్షణ పొందవలసిన అవసరమున్నదా? మీ యభిప్రాయమేమి? డాక్టర్లకిచ్చినట్లు 4 లేక 5 ఏండ్ల శిక్షణను నేను పొందవలసి యుండునా?" అని ఆమె నన్నడిగెను.

ఆంగ్లవిద్యలో ఎం. ఏ. డిగ్రీ తీసికొన్న ఆశాదేవి వంటి వ్యక్తి కూడ, ఎంత ప్రయత్నించినను, ఆ పాత విద్యా ప్రభావము నుండి పూర్తిగ తప్పుకొనలేక పోయెనని వెంటనే నాకు తోచెను.

గర్వింపదగిన డిగ్రీలు నాకు లేవు. నేను నేర్చిన కొద్ది హైస్కూలు విద్యకు విలువ నిచ్చుట నే నెప్పుడో మరచి పోతిని. ప్రకృతి చికిత్స యను శుద్ధ జలధారను నేను బాగుగ గ్రోలితిని. కనుక నే నామెతో ఇట్లంటిని : "తాము ఆరోగ్యముగ నుండుట, పరిసరములను పరిశుభ్రముగ నుంచుకొనుట. ఇవి బిడ్డలు నేర్వవలసిన మొదటి పాఠమని మీ రందురుకదా! కావలసిన వైద్యజ్ఞాన మంతయు ఇందేయున్న దని నే నందును. కోట్లాది గ్రామస్థుల కొరకు మన విద్య యుద్దేశింపబడినది. అది వారికి ఉపకరింపవలెను. వారి జీవితము ప్రకృతికి సన్నిహితమై యుండవలెను. కాని వారికి ప్రకృతి నియమములు తెలియవు. తెలిసిన దానినికూడ వా రాచరింపరు. జాలిగొల్పు గ్రామీణుల స్థితి గతులను మార్చుటకే నూతన విద్యావశ్యకత కలిగినది. కనుక నూతన విద్యనుగూర్చి తెలిసికొనుటకు మనకు పుస్తకము లంతగా సాయపడవు. మన మింతవరకు తెలిసికొన్నది ప్రకృతి గ్రంథమునుండి. అట్లే గ్రామ వైద్యము కూడ ప్రకృతినుండియే రావలెను. ఆరోగ్య పారిశుధ్య ధర్మ సూత్రములును, పుష్టికరమగు ఆహార నియమమును పాటించుచు బ్రతుకుటయే ప్రకృతి చికిత్సలోని సారము. ప్రతివాడును తనకుతానే వైద్యుడు కాగలడు. బ్రతుకుటకు మాత్రము భుజించువాడు; పృథ్వి, నీరు, ఆకాశము, సూర్యుడు, గాలి యను పంచభూములతో మైత్రి నెరపువాడు; వీనిని సృష్టించిన

ఈశ్వరుని సేవించువాడు రోగము పాలు కాగూడదు. రోగము వచ్చినచో శాంతచిత్తుడై దైవమును నమ్మి చావవలసినచో చచ్చును. తన పరిసరములలో నేవైన ఓషధులున్నచో వాని నతడు ఉపయోగించవచ్చును. కోట్లకొలది ప్రజలిట్లే బ్రతికి శాంతముగ చనిపోవుచున్నారు. వారు డాక్టరు ముఖమే యెరుగరు. మనము నిజమగు గ్రామ తత్త్వమును హృద్గతము చేసికొందుము గాక! గ్రామ బాలబాలికలు, పెద్దలు మన వద్దకు వచ్చుచుందురు. సత్యశీలురయి బ్రతుకుట యెట్లో వారికి బోధింపుడు. నూరింట 99 పాళ్లు రోగులు తిండిలేకను, కాని తిండ్లు తినుటవలనను, అపరిశుభ్రత వలనను వచ్చు రోగము లచే చనిపోవుచున్నారని వైద్యులు స్పష్టపరచినారు. 99 మందికి చక్కని బ్రతుకు తెరువును మనము చూపగలిగితిమా, మిగి లిన ఒకనిని మరచినను బాధలేదు. డాక్టరు సుశీలానయ్యరు వంటి పరోపకారి యెవరైన ఆ ఒక్కనికి సేవచేయగలరు. అట్టి వారికిగాను మనము చింత నొందవలసిన పనిలేదు. మన కీనాడు మంచి నీరు, మంచి నేల, మంచి గాలి కరవైనవి. సూర్యరశ్మియొక్క, ఆకాశముయొక్క అమూల్యమగు విలువ మనము గుర్తించుటలేదు. పంచ భూతములను వివేకముతో మనము సేవించినచో, సరియైన సమీకృతాహారమును తీసి కొన్నచో యుగములకు సరిపడిన ఘనకార్యమును నెరవేర్చిన వారమగుదుము. ఈ జ్ఞాన సంపాదనకు డిగ్రీలతోగాని, కోట్ల

కొలది ధనముతో గాని మనకు పనిలేదు. కావలసినదెల్ల సజీవ మగు ఈశ్వర విశ్వాసము, సేవా తత్పరత, పంచ భూతము లతో సన్నిహిత సంబంధము, ఆహార నియమములను గూర్చిన జ్ఞానము. వీనిని నేర్చుకొనుటకు స్కూళ్ళలోను, కాలేజీలలోను వృధా కాలయాపన అక్కరలేదు.''

హరిజన్ : 1-9-'46.

# 42

## విద్యావేత్తలతో

1947 ఏప్రిల్‌లో పాట్నాలో జరిగిన హిందూస్థానీ తాలిమీసంఘు సమావేశములో గాంధిజీ సంఘు సభ్యుల యెదుట తన హృదయమునంతను వెళ్లబోసెను.

### స్వయంపోషకత్వము

మొదట బడ్జెటు చర్చవచ్చెను. ప్రభుత్వములపై ఆశ పెట్టుకోవద్దని గాంధిజీ సంఘు సభ్యులను హెచ్చరించెను. ''మనము అడిగినంత యిచ్చుటకు వారు సంసిద్ధులు కావచ్చును. కాని వారిపై ఆధారపడుట మొదలిడితిమేని దానితో నూతనవిద్య అంతరించును. ఇది మూడేండ్ల బడ్జెటు. ఇది పూర్తియగుసరికి ప్రణాళిక పూర్తిగ స్వయంపోషకము కావలెను. కనుక మీరు అందులకు తగిన బడ్జెటునే వేయ

వలెను. ఈ మూడేండ్లలో ప్రణాళిక విజయవంతము కానిచో కార్యకర్తలు తమ అశక్తతను దేశమునకు ప్రకటించవలసి యుండు. విలువతో కూడిన పరాజయము విజయమున కొక సోపానమే.

## మీ హద్దులను తెలిసికొనుడు

హిందూస్థానీ తాలిమీసంఘము మద్రాసులో ఒక ట్రెయినింగుస్కూలు స్థాపించుట మంచిదని, దాని వ్యయమును ప్రభుత్వము భరించునని విద్యామంత్రి శ్రీ అవినాశలింగం అని యుండెను. తమశక్తికి మించినపనికి పూనుకొనవద్దని తాలిమీసంఘమును మందలించుచు గాంధిజీ ఇట్లనెను : "ఇట్టి పనులవలన సంఘము తనశక్తులను వ్యర్థపరచుకొని మద్రాసు ప్రభుత్వమునుకూడ, చిక్కు పెట్టగలదు. ఈనాడు అధికార స్వీకారముతో కోట్లకొలది రూపాయలు కాంగ్రెసు ప్రభుత్వముల చేతికి వచ్చినవి. మంచి చెడ్డలను సంఘము విచారించుకొని, చాలినందరు ఉపాధ్యాయులుండి, నడుపగలమను నమ్మకమున్నచో సంస్థను నడుపవచ్చును. ఎవరిహద్దులను వారు గుర్తించుట మంచిది."

## త్రివిధమగు అభివృద్ధి

"మనశ్శరీరముల యొక్కయు, ఆత్మయొక్కయు అభ్యుదయమే మన విధానముయొక్క ఆశయము. ప్రస్తుత విద్య

మనస్సునకుమాత్రమే ప్రాధాన్యమునిచ్చును. కొంచెము నూలు వడుకుటతోను, కొంచెము చీపురుపనితోను నూతనవిద్య పూర్తికాదు. ఇవికూడ ఎంత అవసరమైనను, శక్తులన్నియు సమముగ వృద్ధికానిచో ఇవి వృధాయగును. ఇప్పుడు నేను మరియొక పనిలో నిమగ్నుడనైయున్నాను. కాని నూతన విద్య నా మనసులో ఎల్లపుడును ఉండనే యున్నది.''

## ఖాదీ

తరువాత గాంధిజీ నవీనవిద్యలో ఖాదీకున్న స్థానమును గూర్చి ఇట్లనెను : ''1908 లో దక్షిణాఫ్రికాలో ఖాదీ నా మనస్సులో ప్రముఖస్థానము నాక్రమించెను. సర్వసంపన్నమైన మరొక చేతిపరిశ్రమ నాకు కనబడినచో నూలు వడుకుటను నూతనవిద్యాకేంద్ర పరిశ్రమగ చేయుడని చెప్పియుండెడు వాడనుకాను. అందరును రోజుకొకగంట వడికినచో ఇండియా తనకుకావలసిన బట్టనంతను తయారు చేసికొనగలుగునని నా అంచనా. అట్లుగాక దినమునకు ఆరు గంటలు వడకవలసినచో ఖాదీ కిందుస్థానమే లేదు. ప్రజలు ఇతరపనులుకూడ చేసికొనవలెనుగదా! తిండి సంపాదించుకొనవలె. మానసిక పరిశ్రమకూడ కొంతయుండును. నవీనవిద్యలో బానిస చాకిరీకి తావులేదు. వడుకుటకుపయోగించు ఆ గంటకాలము ఆత్మాభివృద్ధిని కలిగించునదిగ ఉండవలెను.''

## ఖాదీ, పర – బేసిక్

"కనీసము బేసిక్ తరువాతి తరగతిలోనైనను మిల్లు పద్ధతులుకూడ నేర్పబడవలెనని (శ్రీ) సయ్యాదీన్‌గారన్నారు. కాని అది నాకిష్టములేదు. బేసిక్ తరువాతి శిక్షణలోకూడ నూలువడుకు పరిశ్రమ విద్యకు మంచి సాధనమే. ఇది గాక, లక్షలకొలది విద్యార్థులు ఈ ముఖ్యపరిశ్రమనుండి తప్పింప బడరాదు. (శ్రీ) దేవప్రకాశ్ తకిలీని, చీపురునుగూర్చి వ్రాసిన వ్యాసము నిన్ననాకు చూపినారు. అదంతయు నిజమైనచో ఆ రెంటిద్వారా ఎంతో జ్ఞానమును బడయవచ్చును. బేసిక్ శిక్షణకాలములో అది పూర్తి కాదు. సర్వజనులకు క్షేమకర మగునట్లు ఈ రెండు ముఖ్యపరిశ్రమల శాస్త్రమును మన మింకను వృద్ధిపరచలేదు. మిల్లు నూలుకు, మిల్లునేతకు తకిలీ, చేతిమగ్గములే ప్రాతిపదికలు. పాశ్చాత్యులు మనలను కొల్ల గొట్టుటకొరకే మిల్లులు స్థాపించిరి. మన మింకొకరి భాగ్య మును హరించము. కనుక మనకు మిల్లులక్కరలేదు. తకిలీ, చేతిమగ్గముల శాస్త్రజ్ఞానమవసరము. ఈ విషయమున ఇం డయా ఐరోపాను అనుకరించినట్లైన, ఇండియాకును, ప్రపంచ మునకును సర్వనాశము తప్పదు."

## ఖాదీ, మిల్లులు

పాఠశాలనుండి వెళ్లు యువకులు మిల్లుపనుల కాశించి

పోవుచుండగా, విద్యావేత్తలుకూడ నూతన దృక్పథమున చూడలేకపోవుచున్నారని డాక్టరు జకిర్‌హుస్సేన్ అనెను. గాంధిజీ ఇట్లు బదులుచెప్పెను : "నేనుద్దేశించిన పాఠశాలల లోని యువకులు మిల్లు ఉద్యోగముకుపోరు. ఖాదీబట్ట, మిల్లు బట్ట ఒకచోట పెట్టి అమ్మరాదు. మన మిల్లులు తమ సరుకును ఇండియాబయట అమ్ముకోవచ్చును. లాంకషైరులో నేయు బట్ట ఇంగ్లాండులో అమ్మదు. అంతయు బయటి కెగుమతి యగును. విదేశములలోకూడ మన మిల్లుసరుకు చిరకాలము అమ్ముడు కాకపోవచ్చును."

## ఏకైక మార్గము

"మీా యిబ్బంది నా కగపడుచునేయున్నది. దేశ వాతా వరణమంతయు మిల్లు వ్యామోహముతో నిండియున్నది. మన మంత్రులుకూడ మిల్లులనుగూర్చియే మాట్లాడుదురు. మన విశ్వాసముకొరకుగాను బ్రతికి చచ్చుటయే మనకున్న మార్గము. ఖాదీ సత్యమని మనము నమ్మినచో, దాని నా చరణలో చూపుచు వ్యాపింపజేయవలెను. జాతిశ్రేయ మునకై మనముచేయునది న్యాయమని మంత్రులకు నచ్చజెప్ప వలెను.

"హిందూస్థానీ తాలిమీా సంఘమును సృష్టించినది కాంగ్రెసే. కాని దానియెడల ఏమాత్రపు శ్రద్ధను కాంగ్రెసు ఎప్పుడును చూపలేదు, చరఖా సంఘముకూడ కాంగ్రెసునుండి

పుట్టినదే. కాని కాంగ్రెసు దానిని తనదిగ చేసికొనలేదు. ఈ సంస్థ లిప్పు డెవరికి కావలెను? కాంగ్రెసు వారికి కొద్ది ధనము, కొద్ది అనుభవము ఉన్నరోజులలో నిర్మాణ కార్యక్రమము యెడల వారికి శ్రద్ధ యుండెను. ఈనాడు ప్రభుత్వమంతయు వారి చేతికి వచ్చినది. దానితో వచ్చిన అధికారమును వారింకను జీర్ణించుకొనలేదు. దానికి కొంత కాలము పట్టును."

## ఆ యధికార మిపుడు లేదు

నూతన విద్యను నూతన సాంఘిక వ్యవస్థయొక్క స్థాపనకు పునాదిగ గాంధిజీ పరిగణించెను. అధికారమందున్న మంత్రులకు బహుశా తాలిమీ సంఘాభిప్రాయములతో పూర్తిగ ఏకీభావము లేదు. సంఘము యొక్కయు ప్రభుత్వము యొక్కయు కార్యక్రమములను సమన్వయ పరచవలసినదనియు లేకున్న సంఘము నెత్తివేయవలసినదనియు డాక్టరు జకిర్ హుస్సేన్ గాంధిజీతో అనెను. పూర్వము తనకుండిన పలుకుబడి ఇప్పుడు లేదని చెప్పుచు గాంధిజీ ఇట్లనెను: "ప్రభుత్వము యొక్క ఉదాసీనతకు నేను వారిని నిందించను. వారి చేతికి వచ్చిన రాజ్యయంత్రమును వారు నడుపవలెను. నేను మంత్రినైనచో నేనును అట్లే చేసియుందునేమో. అయినను పండిత జవహర్‌లాల్‌తోను, తదితరులతోను నేను సంప్రదించు

చున్నాను. విషయమును విశదపరచుట విద్యావేత్తల కర్త వ్యమే కదా !"

డాక్టరు జకీర్ హుస్సేన్ :— ఈ విద్యా విధానమును మంత్రులకు సరిగా విశదపరచక పోవుట కాంగ్రెసుదే పొర పాటని నా యుద్దేశము. ఇక్కడికి వచ్చేముందు నేను మౌలానా అబుల్ కలామ్ అజద్ గారిని కలిసికొంటిని. ఆయన సానుభూ తిని చూపిరి. సంఘమును కలసికొందు నన్నారు. సంఘమువారు కూడ ఆయనను చూచుటకు నిశ్చయించుకొన్నారు.

గాంధిజీ :— ఈ ప్రభుత్వము మున్ముందు మిమ్ము ఆహ్వా నించి యుండవలసినది. సర్జెంటుగారు తాలిమీ సంఘ సలహాల ననుసరించి పని చేయవలెను. మీ కాహ్వానము పంపుడని ప్రభుత్వమునకు నేను సలహా నిచ్చియుంటిని.

## మత విద్య

బేసిక్ పాఠశాలలలో మత బోధకు అవకాశమిచ్చుచు దానికి కొంత ప్రత్యేక సమయ మీయవలెననియు, మత విష యములు తెలిసినవారు పాఠశాలలకు వచ్చి బోధించుట కవ కాశ ముండవలెననియు, ఇంతకుమించి ప్రభుత్వము జోక్యము కలిగించుకొనరాదనియు శ్రీ జకీర్ హుస్సేన్ అనెను.

గాంధిజీ ఇట్లు సమాధాన మిచ్చెను : "ఆ విషయమై

మీరు మౌలానా గారితో మాట్లాడవలెను మతబోధ విష యమై ప్రభుత్వము బాధ్యత వహించవలెననుట నే నంగీక రించను. తప్పుడు మతబోధలు చేయువారు కొందరున్నచో వారిని మనము నివారించు టెట్లు? వారిని వారింప యత్నించి నచో ఫలితము చాల అసహ్యముగ నుండును. మతబోధ చేయగోరువారు తాము స్వయముగ చేసికొనవచ్చును. అయి నను ఆబోధ శాంతి భద్రతలకును, సార్వజనిక నీతి ధర్మము నకును విరుద్ధముగ నుండరాదు. అందరిచే అంగీకరింపబడి, సర్వమత సమ్మతములగు నీతి ధర్మ సూత్రములను బోధించు టకు మాత్రము ప్రభుత్వము బాధ్యత వహించును. మత సం బంధములేని 'సెక్యులర్' రాజ్యము మనది.''

సర్టిఫికెట్ల సమస్య

శిక్షణను పూర్తిచేసికొన్న వారికి యోగ్యతాపత్రముల నిచ్చు విషయమున గాంధిజీ ఇట్లనెను : ''వారు ఉత్తీర్ణులైన తరగతి పేరు స్పష్టముగను, క్లుప్తముగను తెలుపుచు, ఏ మాత్రపు అతిశయోక్తియు లేక విద్యార్థి అర్హతలను కూడ తెలుపుచు యోగ్యతా పత్రములు హిందూస్థానీలో వ్రాయ బడవలెను. అంతేకాని తగినంత విలువలేని వస్తువుకు పెద్ద పేర్లు పెట్టుటలో ఎట్టి ఘనతయు లేదు.''

స్త్రీ పురుషులను కలిపి విద్య నేర్పుట

స్త్రీ పురుషులను కలిపియుంచు తాలిమీ సంఘు విద్యా

విధానము మదరాసుకు సరిపడదని మద్రాసు విద్యా మంత్రి శ్రీ అవినాశలింగం అనెను. చిన్న బిడ్డలనుగాని, ప్రాజ్ఞులైన పెద్దవారినిగాని కలిపియుంచుటలో తన కభ్యంతరము లేదనెను. 15, 16 సం॥ల వయస్సున ట్రెయినింగుకు వచ్చు యువతులను యువకులతో కలిపి కూర్చుండబెట్టుట తన కిష్టము లేదని ఆయన అనెను. గాంధిజీ ఈ యభిప్రాయముతో నేకీభవించక ఇట్లు చెప్పెను: ''స్కూళ్ళయందు వారినిసహపాఠులను చేసి, ట్రెయినింగు స్కూళ్ళలో చేయనిచో, ఎక్కడనో ఏదో తప్పున్నదని పిల్లలు అనుకొందురు. నాబిడ్డ లట్టి ప్రమాదమున పడినను పడనిత్తును. ఎప్పుడో ఒకప్పుడు మన మీ స్త్రీ పురుష భేద దృష్టిని పోగొట్టుకొనవలెను. పాశ్చాత్యులనుండి మనము ఉదాహరణలను తీసికొనరాదు. ట్రెయినింగు స్కూళ్ళలోనైనను ఉపాధ్యాయులు బుద్ధికుశలురు, పవిత్రులు, నూతన విద్యా తత్వముతో నిండినవారు అయితే ప్రమాదము లేదు. ఒకచో ప్రమాదము తటస్థించినను మనము భయము చెందరాదు. అట్టివి ఎక్కడను జరుగుచునే యుండును. నేనింత ధైర్యముతో మాట్లాడుచున్నను, అపాయములకు గల అవకాశమును నేను గుర్తించకపోలేదు. మంత్రి – బాధ్యతతో మీకు మీరే యోచించుకొని పనిచేయుడు.''

## ఖాదీ, స్వయంపోషకత్వము

స్వయంపోషకత్వ విషయమున శ్రీ జాజూజీ ఇట్లనెను :

"వడ్రంగమువంటి కొన్ని యితర పరిశ్రమలవలన రాగల ఆదాయము వడుకు, నేతపనులనుండి రాదు. ఇందు ఏడేండ్ల బేసిక్ శిక్షణ పొందినపిమ్మటకూడ విద్యార్థులు స్వయంపోషకులు కాగలుగుట సందేహాస్పదము. చరఖాసంఘపు రేట్ల ప్రకారము వారు దినమునకు ఆరు లేక ఎనిమిది అణాలు సంపాదించగలరు." గాంధిజీ ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను : "డబ్బు దృష్టిలో మనమాలోచింపరాదు. మనకందరకు బట్ట అవసరము: కనుక మన పనులనిటికిని ఖాదీయే కేంద్రము. ఏడు లక్షల గ్రామములకు వస్త్రమును తయారుచేయవలసిన సమస్య ఇది. నేతపనివాండ్రకు హెచ్చు రేట్లిచ్చి మనమిపుడు నేత నేయించుచున్నాము. నూలు వడుకుటవలెనే అందరికిని నేత పనికూడ రావలెనని నేను చెప్పియుండకపోవుట పొరపాటు. దాని కెంతసమయము మన మీయగలమో అంతే సరిపోవును. అట్లుగాక మనకున్న కాలమంతయు దానికే కావలసినచో విషయమును పునరాలోచన చేయవలసి యుందుము."

పనియందలి అభిమానముతోనే పని చేయవలెను

"నూతన విద్యాబోధకుడు పారిశ్రామికుడును అధ్యాపకుడునుగూడ కావలెను. అతడున్నది వేతనముకొరకు మాత్రమే కాదు. జీతము లేక వేతనము అనునది సరియైన మాటకాదు. ప్రతిఫలమును గౌరవముతో స్వీకరించు కార్యదక్షుడతడు. అతని భార్య బిడ్డలుకూడ పనిచేయుదురు. నిజమగు సహకార

భావ మిక్కి యేర్పడగలదు నూతనవిద్య ప్రతి గ్రామమునకు వ్యాపించుట కిదియే మార్గము.''

వ్యవసాయమును బేసిక్ పరిశ్రమగా చేయుట

''సేద్యమును బేసిక్ పరిశ్రమగా నేల చేయరాదని కొందర డుగుదురు. నూలుపరిశ్రమకున్న విద్యావకాశములు సేద్యములో లేవని నా జవాబు. వడుకుపరిశ్రమలోని కళాకౌశలము సేద్యముద్వారా వృద్ధిపొందదు. నూతన విద్యయొక్క ఉద్దేశము వృత్తినినేర్పుట మాత్రమే కాదు. అది మానవునికి పూర్ణ వికాసము గలిగింపవలెను.

''కాని, విద్య సేద్యముతో ప్రారంభించకపోయినను చివరకు సేద్యముకూడ ఇందు రావలసినదే. నూతన విద్యయొక్క ఆవరణ చాల విశాలమైనది. విద్యార్థులును అధ్యాపకులును కలిసి తమకు కావలసినదంతయు సంపాదింపగలిగి యుండవలెను. అధ్యాపకుడు మొదటిరకపు పనివాడు కావలెను. గ్రామ బాలబాలికలందరును అప్రయత్నముగ పాఠశాలకు ఆకర్షింపబడుదురు ఈ విధముగ విద్య దానియంతట అది ఉచితము సార్వజనికము అగును.

''ఈ నాడు మనగ్రామములలో పెరిగిన కూరగాయలు ఆ గ్రామప్రజలకు లభింపవు. నేటి ఇండియా స్థితి ఇది. తిరువాన్

కూరులో గ్రామస్థులకు ఆ గ్రామములలో కాచిన కొబ్బరి కాయలు దొరకవు. వానిని ఒకచో కేంద్రీకరించి ఇతర పట్టణముల కెగుమతిచేయుదురు. బేసిక్ పాఠశాలలు నెలకొను చోట్ల ఈ యక్రమ మంతరించును. మరియు ఈ కాలమున నల్లమందు, పొగాకువంటి నగదుపంటలను మనము పెంచుచున్నాము. నూతనవిద్యలో ఉత్తీర్ణులైనవారు స్వోపయోగమునకు కావలసిన ఆహారపంటలనే పండింతురు."

హరిజన్ : 9-11-'47.

# ఆరవ భాగము

# బేసిక్ విద్యా ఫలితములు

## 43

## నూలువడుకుట, శీలము

అఖిలభారత చరఖాసంఘు (కర్నాటక శాఖ) కార్యదర్శి సెటిల్‌మెంట్లలో జరిగిన వడుకుపరిశ్రమ నివేదికలో ఇట్లు వ్రాయుచున్నారు.

"రెవరెండ్ ఆర్. యన్. విల్సన్ హుబ్లీ సెటిల్‌మెంటు మేనేజరు. ఇ. డబ్లియు. బ్రిస్కోకన్య అక్కడి పాఠశాలాధికారిణి. అఖిలభారత చరఖాసంఘు కర్నాటకశాఖవారు బీజపూర్, గడగ్ సెటిల్‌మెంట్ల నివాసులకు ఏకుటను, వడుకుటను నేర్పుటకు ఉపాధ్యాయులను పంపినట్లు వీరు వార్తాపత్రికలలో చూచిరి. హుబ్లీ సెటిల్‌మెంటులోకూడ అట్టి ప్రయోగమును సాగించుటకు సంకల్పించి, చరఖాసంఘు అధ్యాపకులను అక్కడికికూడ ఆహ్వానించిరి.

"మొదట వసతిగృహములోని బాలురతో మేము పని ప్రారంభించితిమి. ఇందు 8, 16 యేండ్లమధ్య వయస్సుగల 333 బాలురుండిరి. ఈ బాలురలో కొందరు వారి సంరక్షకులవలనను, కొందరు పోలీసువారివలనను పంపబడుచుందురు. చిన్న చోరీలు మొదలగు దురభ్యాసములకులోనైన ఈ బాలుర నడవడిని చక్కబరచుటకుగాను వారీసంస్థలో చేర్చబడుదురు. అయితే వారి నిచట ఋజుమార్గమున బెట్టుట కష్టమేయయ్యెను. సంస్థ

నుండి బాలురు పారిపోవుట, వారిని వెదకిపట్టుకొని మరల తీసికొనివచ్చుట జరుగుచుండును. పిల్లల మనశ్శరీరములకు శిక్షణ, వికాసము నీయగల సాధనము సెటిల్మెంటు అధికారులకేదియు కనుపించలేదు.

"అఖిలభారత చరఖాసంఘమువారితో సంప్రదించగా, బాలురకు 3½ నెలల శిక్షణనిచ్చుటకు ఒక అధ్యాపకుడు పంపబడెను. ఆంధ్రదేశ పద్ధతిని ప్రత్తి బాగుచేయుట, దూదియేకుట, నూలువడుకుట బాలురకు నేర్పబడెను. అందు 14, 16 సం॥ల వయస్సుగల బాలురు ముందు శిక్షణకు తీసికొనబడిరి. ఒక్కొక్కడు దినమునకు 1200, 1500 గజములవరకు దారము వడికెను. 25, 30 నంబరుగల నూలువచ్చెను. క్రమశిక్షణతోగూడిన నిత్య కార్యక్రమముద్వారా బాలురనడవడి చాలవరకు బాగుపడినదని, చేసిన పనికి కొంత ప్రతిఫలముకూడ వారికి ముట్టుచున్నదని సెటిల్మెంటు మేనేజరు నాకు తెలిపియున్నారు. జరిగినపనినిగూర్చి బ్రిస్కోకన్యగారి లేఖయే చెప్పగలదు. ఆమె లేఖనిందుతో తమకు పంపుచున్నాను."

సెటిల్మెంటు విద్యాలయ పర్యవేక్షకురాలగు బ్రిస్కో-కన్య పై విషయమై నాకు వ్రాసిన లేఖ యిది.

"ఇక్కడజరిగిన పనినిగూర్చి మీకు తెలుపవలసినదిగ చరఖా సంఘమువారు నన్ను కోరినారు.

1. నూలువడుకు తరగతిని మేము 1940 జనవరి 15వ తేదీని ప్రారంభించితిమి.

2. అందలి బాలురవయస్సు 14, 16 మధ్యనుండును. వారిపరిశ్రమను చేయుచు చూపిన ఉత్సాహము, ఆనందము మా కత్యంత ఆశ్చర్యమును గొల్పెను.

3. వ్యాయముతోగూడిన పెద్దపరిశ్రమలను మేము నెలకొల్పలేకపోవుటచే వారు సోమరులైపోయిరి. వారిప్పుడు నిత్యము పనిలో నిమగ్నులై

అతి సంతుష్టులై యున్నారు. పూర్వమువలె పారిపోవలెనను కోరికయే వారికిపుడు కలుగుట లేదు.

4. రోజుకు 5 గంటలు పనిచేసి ఒక్కొకడు దినమునకు 2 అణాలు మొదలు 2¼ అణాలవరకు సంపాదించుచున్నారు. బాలురతో ఈ పని జయప్రదమైనది కనుక ఈ వారమునుండి బాలికలకుగూడ ఇదే శిక్షణ ప్రారంభించినాము. ఈ వార్త మీకు సంతోషము కలిగించగలదని చెప్పి, ఈ లేఖ వ్రాయుచున్నాను. వడుకుచున్న బాలుర ఫొటోకూడ ఒకటి ఇందుతో పంపుచున్నాను. వారి ముఖము లిప్పుడెంత కళకాంతులతో నున్నవో చూచి మీరు ఆనందింపగలరు."

బుద్ధికి నిలకడనిచ్చుశక్తి నూలువడుకుటలో కలదని ధృవపరచుటకు పై లేఖలోని విషయములే ప్రత్యక్షసాక్ష్యము. అక్కడ జరుగుచున్న ప్రయోగముయొక్క క్రమాభివృద్ధిని గూర్చిన నివేదికలను బ్రిస్కోకన్యగారు నాకు పంపుచుండవలెనని నా కోరిక.

హరిజన్ : 4-8-'40.

# 44

## ఎడారి మధ్య ఉద్యానవనము

బేసిక్ విద్యపై ప్రభుత్వోద్యోగులు చేయుచున్నవి అనాలోచితములగు ప్రతికూల విమర్శలు. కాని బీహారు గవర్నరుకు కార్యసచివుడు శ్రీ ఇ. ఆర్. జె. ఆర్. కజిన్సు బీహారు బేసిక్ స్కూళ్ళనుగూర్చి హిందూస్థానీ తాలిమీ సంఘ కార్యదర్శి

శ్రీ ఆర్య నాయకం గారికి పంపిన సదభిప్రాయము చాల సంతోషదాయకముగ నున్నది. అందు ఇట్లున్నది :

"నేను బేసిక్ పాఠశాలలను చూచు కార్యక్రమము అధిక వర్షముల వలన ఆగిపోయినది. కాని 27 పాఠశాలలోను 18 పాఠశాలల తాలూకు అధ్యాపకులను విద్యార్థులను కలసికొన గలిగితిని. ఆ దృశ్యము నాకు పరమానందమును కలిగించినది. ఏడు సంవత్సరముల శిక్షణ పూర్తియైన పిమ్మట గాని ఈ ప్రయోగ ఫలితములను మనము నిర్ణయింపలేమనుట నిజము. అయినను విద్యార్థుల పరిశుభ్రత, బుద్ధికుశలత, పనియందు చూపు ఉత్సాహము నన్నత్యంతము ఆకర్షించినవి. మనము సాగించుచున్న విధానము సరియైనదని నా గట్టి నమ్మకము. ఏడేండ్ల విద్యను పూర్తిచేసిన బేసిక్ విద్యార్థులు అదే వయస్సు గల ఇతర స్కూళ్ళ విద్యార్థులకు ఏ మాత్రమును తీసిపోరు.

"నేను గట్టిగ నొక్కి చెప్పవలసిన మరొక ముఖ్య విషయ మున్నది. ఈ పాఠశాలలు ఆయా గ్రామప్రజల సద్భావమును, ఆసక్తిని చూరగొన్న వనుట నిస్సందేహము. ఈ స్థితి ఇట్లే యున్నచో బేసిక్ విధానము విజయవంతమై తీరును. చౌబె టోలా-పరూకియా గ్రామస్థులు, భూస్వాములు కనబరచు చున్న దేశభక్తి, విద్యార్థుల ఆటపాటలకు వారిచ్చిన విశాల మగు చక్కని స్థలము, రోడ్డు వేయించుట, గొప్ప బాలభట

సంఘ నిర్మాణము, గ్రామబాలుర ప్రతిదినము క్రమము తప్పక బడికి హాజరై తీరవలెనను నియమము – ఇవన్నియు అత్యంత శ్లాఘాపాత్రములు. భావికాలపు విద్యార్థులలో సామాన్య విద్యకుతోడు మానసికమగు చురుకుతనము, చేతిలో కళాకౌశలము, ఆరోగ్యము, పారిశుధ్యము మొదలగు విశిష్ట గుణములు చూడగలము. ముందు కాలపు గ్రామములు ఎక్కువ ఆరోగ్య, సౌందర్యములతోను, వివేకజ్ఞానములతోను నిండి అలరారగలవు. గ్రామస్థుల ప్రయత్నములు ఫలప్రదము లగుటకు సందేహము లేదు.''

హారిజన్ : 22-2-'42.

# 45

## చేతి పరిశ్రమల ద్వారా విద్య

శ్రీమతి ఆశాదేవి ఆకర్షణీయములగు ఈ కింది లెక్కలను పంపినారు :

''బీహారు రాష్ట్రమున చంపరాన్ జిల్లా, బెట్టయా-తానాలోని 27 బేసిక్ పాఠశాలలలో 1942 ఏప్రిల్ నాటికి మూడేండ్ల కార్యక్రమము ముగిసినది. 1, 2, 3 తరగతుల తాలూకు 1941-42 సం॥ ఆర్థికపట్టిక బేసిక్ విద్య కార్యకర్తలకు ఉత్సాహకరముగ నుండగలదు. ముఖ్యవిషయముల నిందు క్లుప్తముగ ఉదహరించుచున్నాను. ఈ స్కూళ్లలో 1, 2, 3

తరగతుల సగటు హాజరు వరుసగా నూటికి 70, 76, 79. ఒక్కొక్కరి సగటు సంపాదన వరసగా రు 0-11-0, రు 2-4-2, రు 6-1-1లు అన్ని స్కూళ్ళలో కలిసి మొదటి తరగతి (సగటు హాజరును బట్టి) 390 మంది పిల్లలు 10,264 గంటలు పనిచేసి సంపాదించిన మొత్తము రు 267-8-6. రెండవతరగతి 356 మంది 14082 గంటలు పనిచేసి సంపాదించినది రు 804-13-8. మూడవ తరగతిలోని 319 మంది 14362 గంటలపనిలో సంపాదన రు 1935-14-11. అనగా మొత్తము 1065 మంది సంవత్సర సంపాదన రు 3008-5-1. మూడవ తరగతి పిల్లవాని సగటు గరిష్ట సంపాదన రు 15-12-0, రెండవ తరగతి వానిది రు 6-2-0, మొదటి తరగతి వానిది రు 2-10-1. మూడవ తరగతి పిల్లలు వడుకుటలో కనబర చిన సగటు గరిష్ట వేగము, రాట్నపు నూలు గంటకు 480 చుట్లు, తకిలీ నూలు 281 చుట్లు. రెండవతరగతి రాట్నపు నూలు 350 చుట్లు, తకిలీ నూలు 242 చుట్లు. మొదటి తరగతి తకిలీ నూలు వేగము గంటకు 164 చుట్లు."

నూలు తయారు, ఆదాయముకూడ ముఖ్యమైనవే. అయి నను పై అంకెలు అందుకని తెలుపబడలేదు. విద్యా పట ములో ఆదాయమునకును, నూలుకును రెండవస్థాన మీయ బడును. బాలబాలికల శిక్షణలో చేతి పరిశ్రమలకు విద్యాసం బంధమగు విలువ ఎంతయున్నదో తెలుపుటకే ఈ యంకె లీయబడినవి. పరిశ్రమ, జాగరూకత, చిన్నవిషయములందు కూడశ్రద్ధ — ఇవి లేనిచో ఈ పని నెరవేరి యుండెడిది కాదన్నట్లు స్పష్టము.

హరిజన్ : 21-6-'42.

# ఏడవ భాగము

# బేసిక్ తరువాతి విద్య

## 46

## కాంగ్రెసు మంత్రిత్వములు; బేసిక్ తరువాతి విద్య

జూలై 29, 30 తేదీలలో పూనా కౌన్సిల్ భవనమున కాంగ్రెసు రాష్ట్రముల విద్యామంత్రుల సభ జరిగెను. సభాధ్యక్షులు శ్రీ బాలా సాహెబ్ ఖేర్‌గారే వారిని ఆహ్వానించిరి. 29వ తేదీని గాంధిజీ ఒక గంటకు పైగా సభలో పాల్గొనెను.

గాంధిజీ విడుదలయిన పిమ్మట 1944లో తాలిమీసంఘపు మొదటి సమావేశము జరిగెను. బేసిక్ విద్యయొక్క ఆవరణను పెంచవలసిన అవసరమునుగూర్చి గాంధిజీ అందు విశదీకరించెను. బేసిక్ పూర్వ, పరశిక్షణలనుగూడ నిర్వహించవలసియుండునని ఆయన చెప్పెను. బేసిక్ విద్య అక్షరశః జీవితశిక్షణ కావలెనని ఆయన ఆశయము. దాని ఆవరణను విపులపరచు విధానమును తెల్పుచు, అందు మంత్రుల కర్తవ్యమునుగూడ

ఆయన చెప్పెను. డాక్టరు జకిర్‌హుస్సేన్ ఇచ్చిన ఒక ప్రశ్నకు సమాధానముగ ఆయన ఈ మాటలను చెప్పెను. తాము నెరవేర్చలేని పెద్దపనులను నెత్తిపై బెట్టుకొనవద్దని, అత్యాశతోగూడిన కార్యక్రమములవల్ల చిక్కులు, ప్రమాదములు తటస్థించునని జకిర్‌హుస్సేన్‌గారి వాదన.

## "నేను మంత్రినైతే"

గాంధిజీ ఇట్లు చెప్పెను : "కర్తవ్యము నాకు గోచరించుచునేయున్నది. కాని దానిని నెరవేర్చుమార్గము సరిగా తెలియుటలేదు. ఇంతవరకు మన మార్గము సుస్పష్టమయియుండినది. ఇక ముందు మనము దారితెలియని ప్రయాణము చేయవలసియున్నాము. మీ యిబ్బందులు నే నెరుగుదును. పాతపద్ధతులలో తయారైనవారికి ఒక్కసారి వానినుండి తప్పుకొనుట కష్టము. నేనే మంత్రినైయున్నచో, ఇకమీదట ప్రభుత్వ విద్యయంతయు బేసిక్ పద్ధతిలోనికి రావలెనని ఉత్తరువు లిత్తును. చాల రాష్ట్రములలో వయోజనవిద్యకై ప్రయత్నములు తీవ్రముగ సాగుచున్నవి. ఇదియు ముఖ్యముగా చేతిపరిశ్రమల ద్వారా జరుగవలెనని నా యభిప్రాయము. ఈ సందర్భమున నూలువడుకు పరిశ్రమ, తత్ సంబంధమగు

అన్ని క్రియలతోసహా, విద్యాదృష్టిలో మొదటి రకపు చేతిపని కాగలదు. కాని ఎవరికి ఏ చేతిపనికావలెనో వారే దానిని నిర్ణయించుకోవచ్చును. చివరకు ఏ పరిశ్రమ నిజముగు విలువ గలదిగ తేలునో అదే చివరకు నిలుచును. విద్యాశాఖలోని ఇన్స్పెక్టర్లు, తదితర ఉద్యోగులు గ్రామప్రజలవద్దకును, పాఠశాలోపాధ్యాయుల వద్దకును వెళ్లి ఈ నూతన ప్రభుత్వ విద్యావిధానముయొక్క ప్రాముఖ్యమును, ఉపయోగమును గూర్చి తెలియజెప్పవలెను. ఈ పని అధికారదృష్టితో జరుగ రాదు. ఈప్రాణాళికయందు విశ్వాసము, భక్తి, శ్రద్ధ ఉద్యోగు లకు లేనిచో, వారు ఉద్యోగములను వదలుకొనుటయే మం చిది. కాని మంత్రులుమట్టుకు తమ బాధ్యతలను గుర్తించు కొని, నడుముకట్టి పనిచేసినచో, అంతయు సవ్యముగ నడ చును. ఆర్డర్లు జారీచేయుచు ఊరక కూర్చుండుటవలన ఏపనియు జరుగదు.

## ఉన్నతవిద్యను జాతీయము చేయుట

"వయోజనవిద్యనుగూర్చి నేను చెప్పినదే ఉన్నతవిద్యకు కూడ వర్తించును. అది ఇండియా స్థితిగతులతో అన్వ యించునదయి యుండవలెను. కనుక అది బేసిక్ విద్యయొక్క

విస్తరణ లేక తరువాతిమెట్టుగా నుండవలెను. ఇదొక ముఖ్య విషయము. ఇందు మీకు నాతో ఏకీభావము లేనిచో నా సలహాలు మీకు నిరుపయోగములు. అట్లుగాక, విశ్వవిద్యాలయపు చదువులు మనలను స్వాతంత్ర్యయోధులుగ గాక, బానిసలుగ జేసినదని మీ రొప్పుకొన్నచో, ఈ విధానమును రద్దుచేసి జాతీయాశయములకు తగినట్లు సంస్కరింపవలెనని నావలెనే మీకును తొందర పుట్టవలెను.

"ఈ నాడు మన విశ్వవిద్యాలయ పట్టభద్రులు ప్రభుత్వోద్యోగములకయి ప్రాకులాడుచున్నారు. లేదా, పెడమార్గములు త్రొక్కి సంఘమునందు అశాంతిని పుట్టించుటద్వారా తమ నిరాశను వెలిబుచ్చుచున్నారు ఇతరులను యాచించుటకుగాని, వారి యిండ్లలో తేరతిండితినుచు బ్రతుకుటకుగాని వీరు వెనుదీయరు. వీరిస్థితి ఇంత శోచనీయముగనున్నది. దేశ స్వాతంత్ర్యమునకై బ్రతికిచచ్చు ప్రజాసేవకులను తయారు చేయవలసిన బాధ్యత విశ్వవిద్యాలయములపై నున్నది. కనుక తాలిమీ సంఘమునుండి అధ్యాపకులను తీసికొని విశ్వవిద్యాలయ ప్రణాళికను బేసిక్ విద్యతో కలిపి, దాని పైమెట్టుగా పరిగణింపవలెనని నా ప్రతిపాదన,

"మంత్రులు ప్రజాప్రతినిధుల మనిచెప్పి పదవీస్వీకారము చేసినారు. కనుక వారి ప్రతి పనియందును ప్రజాహితమే ప్రాధాన్యత వహించవలెను. ఈ నాడు బొంబాయి, అహమ్మదాబాదులలో జరుగుచున్న వ్యవహారములు ప్రజపై పలుకుబడిని కాంగ్రెసు కోల్పోయినదని ఋజువుచేసినచో ఇది చాల అపశకునము. నూతనవిద్య ఇప్పటికింకను లేత మొక్కగానున్నను మహావృక్షముగ విస్తరిల్లు సూచన లిందు కనబడుచున్నవి. ప్రజామోదము లేని మంత్రిశాసనములతో బలాత్కారముగ దీనిని అమలుపరచరాదు. ప్రజామోదమును, బలమును కూడగట్టుకొనజాలనిచో మంత్రులు రాజీనామా నిచ్చివేయుటయే మంచిదని నా సలహా. దీనివల్ల అరాచకమగునేమోయని వారు భయపడ నక్కరలేదు. తమకు న్యాయమనితోచిన కర్తవ్యము నాచరించి, ఫలితము దైవమునకు వదలుటయే వారిపని. ఈ యనుభవమునుండియైనను ప్రజలు నిజమగు స్వాతంత్ర్యపాఠమును నేర్చుకోగలరు."

హరిజన్ : 25-8-'46.

47

## క్రొత్త విశ్వవిద్యాలయములు

రాష్ట్రములలో క్రొత్త విశ్వవిద్యాలయములు కావలెనను వ్యామోహము పెరుగుచున్నట్లున్నది. గుజరాతీ భాష కొకటి, మహారాష్ట్రమున కొకటి, కన్నడమున కొకటి, ఓఢ్రభాష కొకటి, అస్సామీ కొకటి, ఇట్లెన్నిటికో విశ్వవిద్యాలయములు కావలెనట. సారవంతములగు ఈ ప్రాంతీయ భాషల కొరకును, ఆ యా రాష్ట్ర ప్రజలకును పూర్ణ ఔన్నత్యము చేకూర్చుట కొరకైనచో, ప్రత్యేక విశ్వవిద్యాలయములు ఆవశ్యకమే.

కాని, ఈ యుద్దేశమును నెరవేర్చుకొనుటకైనను మనము కూడని తొందర పడుచున్నామేమోనని నా భయము. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ముందు జరుగవలెను. ఆ యా ప్రత్యేక రాష్ట్ర పరిపాలనకింద, విశ్వవిద్యాలయములు లేని చోట, అవి సహజముగ నెలకొల్పబడును. బొంబాయి రాష్ట్రమున గుజరాతీ, మరాఠీ, కన్నడము, మూడు భాషలున్నవి. కనుక వాటికి అభివృద్ధి కలుగలేదు. మద్రాసు రాష్ట్రమున నాలుగు భాషలు —తమిళము, తెలుగు, మళయాళము, కన్నడము కూడ. ఆంధ్రదేశమున కొక విశ్వవిద్యాలయ మున్నది. కాని, అక్కడ అది పరాధీనముకాని ప్రత్యేక రాష్ట్ర విశ్వ

విద్యాలయమువలె లేదు. అది న్యాయముగ ఆక్రమించవలసిన స్థానము వేరు. అట్టి స్వేచ్ఛ ఇండియాకు వచ్చి రెండేనెల లైనది. అన్నామలే విశ్వవిద్యాలయ విషయముకూడ ఇంతే. అందు తమిళమునకు ప్రాధాన్యత వచ్చినదని మాత్ర మెట్లన గలము?

క్రొత్త విశ్వవిద్యాలయముల స్థాపనకు అనుకూలమగు పరిస్థితు లేర్పడవలెను. ప్రాంతీయ భాషలద్వారా విద్యగరపు పాఠశాలలును, కాలేజీలును వాటికి పోషకములుగ నుండవలెను. అప్పుడే సరియైన వాతావరణ మేర్పడును. విశ్వవిద్యాలయము దీనికంతకును శిఖరము. మహనీయమగు శిఖరము నిలువగలుగుటకు దిట్టమగు పునాది కావలెను.

మనకు రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినను, పాశ్చాత్త్యుల కపట ఆధిపత్యమునుండి మనమింకను బయటపడలేదు. జ్ఞానమంతయు మనకు పాశ్చాత్త్యులనుండియే రావలెనని చెప్పు రాజ్యతంత్రజ్ఞులకు నేను చెప్పున దేమియు ఉండదు. పాశ్చాత్త్యులనుండి ఏ మంచియు కూడ రాదని నేనను. కాని మన మీ విషయమున ఎట్టి నిర్ధారణకును రాజాలకున్నాము. రాజ్యాంగ స్వేచ్ఛ వచ్చినట్లున్నది కనుక విదేశభాష, విదేశీ భావనా సంప్రదాయముల సూక్ష్మ ప్రభావము మనలను విడిచి

పెట్టినదని ఎవరును అనజాలరు. క్రొత్త విశ్వవిద్యాలయముల నిర్మాణమునకు పూనుకొనుటకు ముందు మనము నిదానముగ నిలిచి క్రొత్తగా వచ్చిన స్వాతంత్ర్య ప్రాణవాయువుతో ఊపిరితిత్తులను నింపుకొనుట వివేకము కదా! దేశముపట్ల మనకున్న బాధ్యత మనకీ విషయమును బోధించుట లేదా? విశ్వవిద్యాలయమున కెప్పుడును పెద్ద భవనపంక్తులు గాని, వెండి బంగారు నిధులుకాని అక్కరలేదు. బుద్ధిశాలురగు ప్రజల సదభిప్రాయబలము, అండ దానికత్యావశ్యకము. ఎప్పటి కప్పుడు, కావలసినంతగ అధ్యాపకగణము సిద్ధముగ నుండవలెను. విశ్వవిద్యాలయ స్థాపకులు దూరదృష్టి కలవారు కావలెను.

విశ్వవిద్యాలయముల స్థాపనకు ప్రజాప్రభుత్వము డబ్బు కోసము వెదకుకోవలసిన పనిలేదు. అవి ప్రజలకు కావలసి యున్నచో వారే ధనమును సమకూర్తురు. అట్లు స్థాపింపబడు విశ్వవిద్యాలయములు వారు ప్రాతినిధ్యము వహించు దేశమునకు అలంకారములుగ భాసిల్లును. విదేశీయుల పరిపాలనక్రింద ప్రజలకు లభించునదంతయు పైనుండి వచ్చుటచేత, ప్రజల పరాధీనత మరింత పెరుగుచుండును. ప్రజాభీష్టమను విశాల

మగు పునాదిపై నిలిచిన ప్రతిదియు క్రిందినుండి పైకి నడచును. కనుక దానికి స్థిరత్వముండును. దానిసౌందర్యము ప్రజకు బలము చేకూర్చును. అట్టి ప్రజాహిత విద్యావ్యాపనకయి ఖర్చుపెట్టుధనము తిరిగి పదిరెట్లులాభమును ప్రజకు చేకూర్చును. మంచినేలలో చల్లిన గింజలు ఎట్టిఫలసమృద్ధినీయగలవో ఇదియు అట్లే. విదేశీయులు స్థాపించిన విశ్వవిద్యాలయములు పైపద్ధతికి వ్యతిరేకముగ నడచినవి. ఇది సహజము కనుక, క్రొత్తగా వచ్చిన స్వేచ్ఛను జీర్ణించుకోగలుగు వరకును క్రొత్త విశ్వవిద్యాలయములను నెలకొల్పుటలో జాగరూకత అవసరము.

ఇక, హిందూ ముస్లిం సమస్యను తీసికొనుడు. ఇది మనకు ప్రాణాపాయ స్థితిని తెచ్చిపెట్టినది. మనమెక్కడ గట్టెక్కగలమో చెప్పుట కష్టము. ఊహింపరాని కష్టములు వాటిల్లినవనుకొనుడు. భారత యూనియన్‌లో ఒక్క మహమ్మదీయునికి గాని, పాకిస్థానులో ఒక్కసిక్కు లేక హిందువునకుగాని రక్షణ, గౌరవము లేవనుకొందము. అప్పుడు మన విద్య విషపూరిత మగును. అట్లుగాక హిందువులు, ముస్లిములు, తదితరులు ఏరాజ్యములో నున్నను సంపూర్ణ రక్షణ గౌరవములతో బ్రతుకగలిగినచో, అప్పుడు మన విద్యకు సహజసుందర రూపమేర్పడును. వివిధ మతములకు చెందిన ప్రజలు మైత్రితో బ్రతుకుచు వివిధ సంస్కృతుల చక్కని సమ్మేళనమును

గావించి, దానికి బలమొసంగి చిరకాలము వర్తిల్ల జేయు దురు. అట్లుగాక హిందుస్థానమున ఒకానొకప్పుడు ఒకే మతము ప్రాతినిధ్యము వహించెనని చెప్పి, వెనుకకు మరలి ఆ దినము కొరకు ఎదురుచూచితిమా, చరిత్రలో అట్టి తేదీ (దినము) ఏదియు మనకు దొరకకపోవుటయే సంభవము కావచ్చును. ఆ దినమే మనకు దొరికి, మనము వెనుకంజ వేయ నారంభించినచో, మన సంస్కృతిని ఆ వికృత కాలము నకు నెట్టివేసి, యావత్ సృష్టియొక్క శాపమునకు పాత్రుల మగుదుము. ఒక ఉదాహరణ : దేశ చరిత్రనుండి మహామ్మ దీయ యుగమును తుడిచివేయు వ్యర్థప్రయత్నమునకు పూను కొంటిమేని, ప్రపంచమున సాటిలేని బ్రహ్మాండమైన ఢిల్లీ జూమా మసీదు, ఆలిఘర్ ముస్లిం విశ్వవిద్యాలయము, ప్రపంచములోని సప్తమహాద్భుతములలో నొకటియగు ఆగ్రా టాజ్ మహలు, మొగలుల కాలమున నిర్మింపబడిన ఢిల్లీ, ఆగ్రా కోటలు—ఇవన్నియు ఉన్నవను మాటయే మనము మరచిపోవలసి యుండును. ఆ దృష్టితో మన చరిత్రను తిరుగ వ్రాసికొనవలెను. ఈ పరస్పర విరుద్ధ భావనల మధ్య సరి యగు నిర్ణయము చేసికొనుటకు తగిన వాతావరణము మన కిపుడు లేనేలేదు. రెండు నెలలై వచ్చిన దేశస్వాతంత్ర్యము తన్నుదా రూపొందించుకొనుటలో కొట్టుమిట్టాడుచున్నది. చివరకది ఏరూపము పొందనున్నదో తెలియదు. ఈ విషయ

ములు నిర్ధారణ యగువరకును ఉన్న విశ్వవిద్యాలయములలో చేతనైన సంస్కరణలు గావించుకొనుచు, ఉత్సాహముతో అందు స్వాతంత్ర్యతత్త్వమును చొప్పించుచుండిన చాలును. ఇట్లు మనము సంపాదించగల అనుభవము సమయము వచ్చినపుడు క్రొత్తవిశ్వవిద్యాలయముల స్థాపనకు సాయపడగలదు.

కనుక క్రొత్త విశ్వవిద్యాలయముల స్థాపనకు నిదానముతో గూడిన ఆలస్యము అవసరమని విద్యావేత్తలు నిర్ణయింతురు గాక!

**హారిజన్ : 2-11-'47.**

# గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ

## స్టేటు బోర్డు సభ్యులు

అధ్యక్షులు :

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంచాలక్ - సభ్యత్వ కార్యదర్శి :

శ్రీ ఎస్. రామానంద్ గారు

సభ్యులు :

శ్రీ ప్రభాకర్ జీ

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారు

శ్రీ పి. వి. ఎస్. మూర్తిరాజుగారు

శ్రీ రామకృష్ణదూత్ గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీమతి ఆర్. కె. అనంతలక్ష్మిగారు

శ్రీ పాతూరి నాగభూషణరావుగారు

(తత్వప్రచారక్)

శ్రీ ఎ. రామనాథంగారు

(గ్రామసేవక్)

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)

## స ల హా స ం ఘ స భ్యు లు

# గాంధీ సాహిత్య ప్రచురణాలయము

(గాంధీ స్మారకనిధి ఆంధ్ర శాఖ)

## సంపాదకవర్గము

అధ్యక్షులు:

శ్రీ మల్లవరపు వెంకటకృష్ణారావుగారు

సంపాదకులు:

శ్రీ తల్లాప్రగడ రామచంద్రరావుగారు (కన్వీనరు)

శ్రీ పైడిమర్రి సత్యనారాయణమూర్తిగారు

సభ్యులు:

శ్రీ ఎస్. రామానంద్‌గారు

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు

శ్రీ ముదుగంటి జగ్గన్నశాస్త్రిగారు

శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు

శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు

శ్రీ నండూరి వెంకటకృష్ణమాచార్యులుగారు

శ్రీ స్వామీ సత్యప్రకాశ్ జీ ఉదాసీన్

తెలుగులోనికి అనువదింపబడిన

# గాంధీజీ రచనలు

1. ఢిల్లీ దినచర్య
2. నా మతము
3. మన గ్రామ పునర్నిర్మాణము
4. నూతన విద్యావిధానము
5. అంటూ దిస్ లాస్ట్ (సర్వోదయ)
6. సర్వోదయ
7. నవీన విద్యాపథంలో
8. నిర్మాణ కార్యక్రమము

## అచ్చులోనున్నవి

9. పంచాయతీ రాజ్యము
10. సహకార సేద్యము
11. అస్పృశ్యతా నివారణ కార్యకర్తలకు
12. అహింసాత్మక సామ్యవాదము

గాంధీ సాహిత్య ప్రచురణాలయము
(గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ)
కాకినాడ